# భారతి

మాసపత్రిక



సంపాదకుడు :

శివలెంక శంభుప్రసాద్



మే 1971




**సంపుటము : 48** సంచిక 5 :


విడిపత్రిక వెల ఒక రూపాయి

# వి ష యా ను క్ర మ ణి క

## మే 1971

# కావ్యావతరణము

## శ్రీ బెళ్ళూరి శ్రీనివాసమూర్తి

పరరాజుల్ మదసైన్యధాటి కెదురోర్వన్ లేమి వెన్నిచ్చి సం
గర రంగంబున పాఱిపోయిరి; మదిన్గారించు రాజ్యాంగపున్
బరువుల్ తగ్గ ప్రశాంతి చేకురె నికన్ భావంబు సాహిత్య మం
దిర మార్గంబున బోయె పెద్దన కవీంద్రా! పల్కు మేటేనియున్

ఇరువురి హృదయంబులు త
త్పరతన్ సుఖియింప మరగ బహుధా కావ్యాం
తరవీథులబడి, రచనా
సరణిన్ గురియింపు మమృతసారం బెలమిన్.

పలికితి చాటువుల్ రసము బంచితి సత్కవికోటిలోన నీ
పలుకు విశిష్టతం బొరసి పావనమై సుమనోమనోజ్ఞమై
వెలసె, మహాకవి ప్రతిభ పేర్మివహించితి వేప్రబంధమున్
పలికెదవో నిరీక్ష నలువందగు నాకు రసైకజీవికిన్.

అని కృష్ణరాయ భూపతి
తనయంతన మోదబాష్పతతి కన్నుగవన్
దొనకంగ బలికె; పెద్దన
తన మోమున లేతనవ్వు తరగలుదేలన్.

"ఓ మహాప్రభు! యెంత రసోచితములు
ఎంత హృదయంగమంబులు ఎంతస్నేహ
భరములు పవిత్ర తావక భాషితములు
జీవితము మీది సత్కళాప్లావితము గ!

కవికిన్ డెందము పొంగి తన్మయముగాగన్ దైవదత్తప్రభా
నివహంబై కవితా ప్రవంతిపటిమన్ నిక్కమ్ము; మీరున్ మహా
కవులై యుండ వచింపగావలెనె స్నిగ్ధంబైన మీయాజ్ఞ నా
భవబంధంబులు ద్రెంచె నిశ్చలితసాహిత్యాసంగసంసిద్ధికిన్.

అనుచున్ బత్కాడు పెద్దనార్యునకు గాఢాలింగనంబిచ్చి, పో
యని జన్మాంతరరక్తి మేల్కొలిపి కావ్యాలాపముం జేయుచో
మనుచారిత్రముచెప్పి యంతరములన్ మాధుర్యముం జిల్కగ
మ్మని విద్యానగరైకవైభవము నింపన్బోలు నా ప్రీతికిన్

పరిపాలించిన దేశము—
సరిహద్దులు, ప్రకృతిశోభ, సాక్షాత్తుగ కా
వ్యరచన బింబింపగ ని
ర్భర ముదమున దేలిపోదు ప్రజతో నేనున్—

అడిగిన యగ్రహారముల నందగజేసితి జీవితంబునన్
జడిమ వహింపబోక చిరసౌఖ్యరసాంబుధి దేలియాడి పెం
పడరగ కావ్యనందనవిహారమొనర్చి మహాయశోనిధుల్
పుడమి వెలార్చి యాంధ్ర బుధపుంగవులన్ దనియింపగా దగున్

కృతికర్తకు కృతిభర్తకు
సతతము చేకూరు దివ్యసాన్నిధ్యము స
త్కృతివలన ఆంధ్రకవితా
పితామహుడవీవు ౘకయిత పెద్ద వటంచున్.

కనుసన్నన్ బొనరించె మంత్రివరు భూకాంతుండు శీఘ్రంబుగన్
గొని తాంబూలకరండ మొక్క చిగురాకుంబోని తన్వంగి వ
చ్చిన తుళ్వప్రభు డంది నవ్యకుసుమశ్రీగంధమాల్యంబు పె
ద్దన కంఠంబునగూర్చె అంచితకళాతాత్పర్యమిట్లొప్పనే!

తను కప్పురపుం దమ్ముల
మున సత్కారమ్ము సలుప మోదంబున పె
ద్దన పౌనఃపున్యముగా
ప్రణామములు గూర్చె కావ్యరచనా దృష్టిన్.

---

# కాకతీయులనాటి రెండు శాసనములు

## శ్రీ బి. ఎన్. శాస్త్రి

### 1. దుప్పల్లి శిలాశాసనము

నల్లగొండ మండలము రామన్నపేటతాలూకా దుప్పల్లిగ్రామమున శ్రీ వేంకటరామారెడ్డిగారి ఇంటి ఆవరణములో ఈ శాసనమున్నది. ఇది నల్లసరపు రాతిపై నాలుగువైపుల చెక్కబడిన తెలుగు శాసనము. కాకతి ప్రతాపరుద్రదేవ మహారాజు కాలమున వేయించిన శాసనమిది. దుప్పల్లి మూసీనదీ తీరముననున్న గ్రామము. వలిగొండ గ్రామమునుండి తొరూరు సర్వీసులో దుప్పల్లిగ్రామము చేరవచ్చును.

మూసీనదీతీరమున శిథిలమైన దేవాలయములున్నవి. శిథిలరూపముననున్న దుప్పల్లి గ్రామము మూసీనది నానుకొనియే యున్నది. ఇప్పటి దుప్పల్లి మూసీనదికి రెండు ఫర్లాంగుల దూరములో నున్నది. మూసీనదీతీరమున పురాతనమైన దేవాలయములు, నగరములు, గ్రామములు శిథిలరూపమున కనిపించుచున్నవి. సంగం, ఇంద్రపురి, వలిగొండ, వేములకొండ, లక్ష్మీపురం, దుప్పల్లి, నాగులబండ, సూరారం మున్నగునవి శిథిల నగరములు, మూసీనదీతీరమున నున్నట్టివి. రామన్నపేట తాలూకాలోనివి.

ఆకారాదికములు :

ఈ శాసనము మూసీనదీ తీరమున శిథిల శివాలయముచెంత భూమిలో పూడిపోయియుండెను. మూసీనదినుండి, దుప్పల్లి చెఱువులోనికి నీటికాలువ తీయించుచుండ ఈ శాసనము బయల్పడినది. శ్రీ కసరవేంకటరామారెడ్డిగారు శాసన శిలను భద్రముగా అచటినుండి తరలించి తమ ఇంటి ఆవరణములో పాతించిరి. శాసనము మొదటిప్రక్క ఆవు, లేగ చిహ్నములును, రెండవప్రక్క సూర్యచంద్రుల చిహ్నములు, పానవట్టముతోగూడిన శివలింగమును చెక్కబడినవి. శాసనశిల ఎత్తు 3.'8.''; వెడల్పు 1,3 వైపుల 1'.2''; 2, 4 వైపుల 11''.5 లు కలదు. శాసనము మొదటిప్రక్క 16 పంక్తులు, రెండవ ప్రక్క 16 పంక్తులు,మూడవప్రక్క 21 పంక్తులు, నాలుగవ ప్రక్క 26 పంక్తులు కలవు. మొత్తము 79 పంక్తులుగల శాసనమిది.

లిపి :

ఆంధ్రదేశమున 13, 14 శతాబ్దులలో వాడుకలోనున్న తెలుగులిపి ఈ శాసనమున వాడఁబడినది. శాసనాక్షరములు మూడుప్రక్కల ఒకే పరిమాణములోను నాలుగవప్రక్క చిన్నవిగను చెక్కబడినవి. ఈ శాసనములోని అక్షరములు, పేరూరు[1] దుద్దెడ[2] బొల్లేపల్లి[3] మల్లేపల్లి[4] శాసనాక్షరములను పోలియున్నవి. శాసనములోని కొన్నిపదములు, సంక్షిప్తముగా వ్రాయబడినవి. శుద్ధబదులు 'శు', గురువారము బదులు 'గు' కనిపించుచున్నవి. కొన్నిసంయుక్తాక్షరములు విడగొట్టబడి వ్రాయబడినవి. శాసనములోని పంక్తులు చక్కని వరుసలలో నున్నవి.

భాష :

ఈ శాసనభాషయంతయు తెలుగు. శాసనము నాలుగవప్రక్క నాలుగవ పంక్తినుండి వ్యాసగీతాశ్లోకములు, 17 వ పంక్తివరకు వ్రాయబడినవి. ఇవి మూఁడు శ్లోకములు. 18 వ పంక్తినుండి శాసనాం

1. అప్రకటితము.
2. అప్రకటితము.
3. భారతి—మార్చి—1969.
4. భారతి—ఆగస్టు 1970.

తము అనగా 26 వ పంక్తి వరకుగల శాసనభాగము పతనములో నున్నది. ఇందు దానమును విఘ్నము చేసిన వారికి కలుగు పాపము తెలుపబడినది.

ఇందు 'ఱ' వాడబడినది. 'ఱ' కు పూర్వాక్షరము ద్విత్వముగా వ్రాయబడినది.

శకపర్ష—శకవఱుష.
సర్వమాన్యము—సవ్వఱ మాన్యము.
ధర్మసేతున్నృపాణాం—ధమ్మఱసేతున్నృపాణాం
పార్థివేంద్రాన్—పాత్థిఱవేంద్రాన్.
షష్టిర్వర్ష—షష్టివ్వఱషఱ

**శాసన విషయము :**

ఈ శాసనమున కాకతి రెండవ ప్రతాపరుద్రుని ప్రశంస కలదు. శాసనారంభమున 'మహామండలేశ్వరు డగు కాకతి ప్రతాపరుద్రదేవమహారాజు, సుఖసంకథా వినోదంబుల పృథ్వీరాజ్యము చేయుచుండ శకవర్షము 1228 పరాభవ సంవత్సర ఆషాఢ శుద్ధపౌర్ణమి గురువారమునాడు, దుప్పర్తి బొల్లమరాజు, 31 పాళ్లను, రంగయరుద్రదేవుడు మూడు పాళ్లను నాయంకరమందు కాశ్మీరదేవరకు రంగభోగానకై అష్టాదశ ప్రజాను ఇరుగారుంబాఱునట్టి భూమిని సర్వమాన్యముగా ధారవోసియిచ్చినవిధము' వర్ణింపబడినది.

పట్టపసముద్రము వెనక నేరెడ చేను ముయ్యడ్డాను, నాగులకూమువను కుద్రుచేను మఱుత్తరును, కాస్యని చెఱువువెనకను తావిచేను అడ్డాను, నారాయణదేవర చెఱువువెనక తామరపడెచేను ముయ్యడ్డాను మొత్తము నాలుగు మఱుతురులు అడ్డ దానమిచ్చిరి. తామరపడ చేనుకు ప్రతిక్షేత్రము సోమయకాలువక్రింద ఇచ్చినట్లు శాసనమున నున్నది. దేవరభోగమునకు మాడలు పెట్టిరి. ఈ దానమునకు విఘ్నము చేసినవారు గ్గంగకఱుత గవిలల బొడిచిన పాపానంబోవువారని వ్రాయబడినది. శాసనము నాలుగవప్రక్క (1) 'సామాన్యోయంధమ్మఱసేతున్నృఱపాణాం' (2) 'స్వదత్తా ద్విగుణం పుణ్యం' 3. 'స్వదత్తం పరదత్తంవా' అను శ్లోకముల పిదప దానము విఘ్నము చేసిన కలుగు పాపము తెలుపబడినది.

**కాలనిర్ణయము :**

ఈ శాసనము కాకతి రెండవ ప్రతాపరుద్రుని పాలనా కాలమున శకసంవత్సరము 1228 అనగా క్రీ. శ. 1306 పరాభవ సంవత్సర ఆషాఢ శుద్ధ పౌర్ణమి గురువారము నా డీయబడినది.

దుప్పర్తి గ్రామము ఇందుపుకేల సీమలోనిది. కాకతి ప్రభువుల ప్రతినిధి ఇందుపులకేలసీమకు కేంద్రమైన ఇంద్రపాలనగరము నుండి పాలించుచుండెను. దుప్పర్తి చేరువలోనున్న నాగులబండ, కూరెళ్ల గ్రామములందు కాకతీయులకు సంబంధించిన శాసనములున్నవి. అవి కాకతి రెండవ ప్రతాపరుద్రుని కాలమున వేయించినవే.

# దుప్పల్లి శిలాశాసనము

## శాసనము—మూలము

### మొదటి ప్రక్క

1. స్వస్తి శ్రీ మన్మహామం
2. డలేశ్వర కాకతియ్య ప్ర
3. తాపరుద్ర దేవ మ
4. హారాజులు సుఖ
5. సంకథా వినోదం
6. బులం ప్రిథివిరాజ్య
7. ము సేయు చుం
8. డం గాను శకవరు
9. షంబులు 1228
10. [illegible] పరాభవ సంవ
11. త్సర ఆషాఢ శు 15 గు
12. దుప్పల్లి బొల్లమరాజు
13. ముప్పడియ ఒక పొలా
14. మ రంగయ రుద్రదేవం
15. డు మూండు పోడ్లాను
16. నాయంకణము ఎలు



## రెండవ ప్రక్క



1. తాండి ఆ కాశ్మీర దే
2. వరకు రంగభోగా
3. నకై అష్ట్యదశ ప్రజా
4. లివి ఏలిని ఇరుగాల
5. ముం బాఅను స
6. వ్వఞమాన్యముగా
7. ను ధారవోసిన చె
8. రు పబ్బసముద్ర
9. ము వెనక వెరెడచేమ
10. ముయ్యడ్డాను వా
11. గుల తూమునము
12. కుద్రుచేను మత్తు
13. రుంను కాస్వాని చె
14. ఉవు వెనకను రా
15. విచేను అడ్డాను నా
16. రాయణదేవరచేని

## మూడవ ప్రక్క

1. చెఱువు వెనక దామ
2. రవడె చేను ముయ్య
3. డ్డను వెరసి నాలుగు
4. మఱుతురున్ను అడ్డ ఇ
5. ందుణను అనిగడ్డిన ని
6. మిత్రమై తామరపడె
7. చేను ముంపెనేని ఆ చే
8. నికై ప్రతిక్షేత్రము సో
9. మయుకాల్వ మోర
10. వాతను జలగవాడె
11. మఱుతురు ఇచ్చు
12. వారు ఊడ్లను రొల్కి త
13. మకుం జేసెడి వారు
14. బడి పల్లచము మాడ
15. ను చిన్నముంబాదిక
16. వల్లాను మాడంబాడి
17. క గెల్ల దేవర భోగానకై
18. ఇచ్చిరి. ఈ మేరకు ఎవ్వరు వి
19. ఘ్నము సేసినాను వారు
20. గంగ కఱుతం గవిలం బొ
21. డిచిన పాపానం బోవు వారు



## నాలుగవ ప్రక్క



1 మఱిన్ని దేవబ్రాహ్మ నా
2. సుగమయ్యద్రోహ నా
3. ను పడువారు ఇదిట్టిది
4. సామాన్యోయం ధర్మ్మసే
5. తు నృపాణాం కాలేకాలే
6. పాలనీయ్యో భవద్భిః । స
7. ర్వానేతాన్ భావినః పార్థి
8. వేంద్రాన్ భూయోభూ
9. యో యాచతే రామచంద్రః
10. స్వదత్తా ద్విగుణం పుణ్యం
11. పరదత్తానుపాలనం
12. పూర్వ్వదత్తాపహర్ణం
13. స్వదత్తం నిష్ఫలంభవేత్ ॥
14 స్వదత్తాం పరదత్తాం వా
15. యో హరేతి వసుంధరాం
16. షష్టివ్వర్ష సహస్రాణి
17. విష్టాయాం జాయతే క్రిమిః
18. సమస్తమైన ప్రజాను కూడి ఏతి
19. పడిపాలకై విడిచినపన్ను పట్టి
20. చందములందున్ను విలిచి
21. కొనెడివారు మాడను పీ
22. సము సేసిపెట్టువారు ఈ
23. ధర్మ్మానకు విఘ్నము సేసి
24. న వారు ప్రజకు వె?కి వా
25. సియము భిన్నము సేసి
26. న పాపానం బోవువారు ॥

## 2. తాడువాయి శాసనము

ఈ శాసనము నల్లగొండ మండలము, హుజూరునగర్ తాలూకా తాడువాయి గ్రామము లోని శ్రీ చెన్నమల్లికార్జున మహాలింగ దేవాలయ ఆవరణములో నుండెను. దేవాలయము శిథిలముకాగా, చాలకాలము క్రిందట కీ. శే. శ్రీ రాజా నాయని వెంకటరంగారావు బహద్దరువారు, తమ వడిగూడెం కోటలోనికి శాసనము నతిజాగ్రత్తగా తరలించి భద్రపరచినారు. వడిగూడెం రాజాగారి కోటలో గోడ ప్రక్క ఈ శాసనమున్నది. శాసనము నల్లరాతిపై మూడువైపుల చెక్కబడినది. ఇందు మొదటి రెండువైపుల మారయ గణపయ రెడ్డిగారు వేయించిన శాసనమును, మూడవవైపు చెలుకు అన్నయ రెడ్డిగారు వేయించిన శాసనమును చెక్కబడినది.

ఆకారాదికములు :

నల్లరాతిపై చెక్కబడిన ఈ శాసనమును త్రవ్వించి ప్రక్కకు నిలిపి ప్రతిబింబములు తీయవలసి వచ్చినది. శాసనారంభమున సూర్యచంద్రుల చిహ్నములు చెక్కబడినవి. శాసన శిల పొడవు 3'.4"లు. వెడల్పు 1, 3 ప్రక్కలు 1'.1". 2,4 ప్రక్కలు 1.'2" లు. శాసన శిఖరము ఎత్తు 10" లు. ఇది నల్లసరపు రాతిపై చెక్కబడిన శాసనము. మొదటి శాసనము, మొదటి ప్రక్క 21 పంక్తులు, రెండవ ప్రక్క 28 పంక్తులు, రెండవ శాసనము మూడవ ప్రక్క చెక్కబడినది. ఇందు 24 పంక్తులు కలవు. మొదటి శాసనమున కాకతి ప్రతాపరుద్ర దేవమహారాజు పేర్కొనబడినాడు.

లిపి :

ఈ శాసన శిలపై మూడు వైపుల చెక్కబడిన రెండు శాసనములు తెలుగు భాషలో వేయింప బడినవి. శాసనలిపి, పదమూడు, పదునాలుగు శతాబ్దులలో ఆంధ్రదేశమున, ముఖ్యముగా తెలంగాణ ప్రాంతమున వాడుకలోనున్న లిపిలో వ్రాయబడినది. శాసనాక్షరము లందముగలేవు. పంక్తులు వంకరగా మున్నవి. కొన్నియక్షరములు చిన్నవిగను, మరికొన్ని పెద్దవిగను చెక్కబడినవి. శాసనారంభమున 'ఓం' గుర్తు కలదు. కొన్నిసంయుక్తాక్షరములను విడదీసి వ్రాయుట జరిగినది. శాసనాక్షరములు—కాకతి రుద్రమ నాటి బొల్లేపల్లి[5], శక సంవత్సరము 1187 నాటి శాఙ్గ్గ్ణపాణిదేవమహారాజుల పానుగల్లు[6], శ. సం. 1214 నాటి ప్రతాపకుమారరుద్రదేవమహారాజుల పేర్కొను గంగిదేవని గణపవరము[7] శాసనాక్షరములను పోలియున్నవి.

భాష :

ఆంధ్రదేశమున 13, 14 శతాబ్దులలో వాడుకలోనున్న తెలుగుభాష ఈ శాసనమునందు వాడబడినది. శిల్పి అక్షరములను కడుజాగరూకతతో చెక్కినాడు. శాసనమున,

త్రైలోక్య బదులు త్రయలోక్య
వర్షంబులు బదులు వరుషంబులు.
శార్వరి బదులు శార్వ్వరి.
కార్తీక బదులు కార్త్తీక.
మల్లికార్జున బదులు మల్లికార్జ్జున

వ్రాయబడినవి. చక్కని తెలుగుభాషలో వ్రాయబడిన ఈ శాసనములు కాకతీయులనాటి తెలుగుభాషా స్వరూపమును తెలిసికొనుటకు తోడ్పడుచున్నవి.

శాసన విషయము :

శాసనారంభమున శివుని స్తుతించు శ్లోకము కలదు. శ్లోకము తరువాత 'స్వస్తి' వచనముతో శాసనమారంభమగుచున్నది. శాసనము శకవర్షము 1222 లో శార్వరి సం. కార్తీక శుద్ధ 15న వేయింప బడినది. ఇందు మహామండలేశ్వర కాకతియ్య ప్రతాప రుద్రదేవ మహారాజు వర్ణింపబడినాడు. ప్రతాపరుద్ర

5. భారతి—మార్చి 1969.

6. తెలంగాణ శాసనములు. Vol. I. శా. శా. సం. 34.

7. తెలంగాణ శాసనములు. Vol. I, శా. శా. సం. 43.

దేవమహారాజు పరిపాలనములో చెఱకు జగద్దాడు మారయు గణపయరెడ్డికి పుణ్యముగాను, తాడువాయి శ్రీ చెన్నమల్లికార్జునమహాలింగదేవునికి అందరి ప్రజలు—కేతులెంక, ఆచంద్రార్కముగా తాడువాయి పర్వాయములో మాడ పదిరెండు—12 బవినులరీతి నొసంగిరి. ఈ మహాదేవునికి, నేలమ్రఱి గ్రామీణులు ఆ యూరి సిద్దాయమందు ఈ పద్ధతి ప్రకార మొసంగిరి. అగసాల దేవోజు—ఏటిమడి, వనము ఈ మహాలింగ దేవున కొసంగెను. శాసనాంతమున దానము పాటించినవారికి కలుగు ఫలము 'స్వదత్తా ద్విగుణం పుణ్యం' అను శ్లోకమును చెప్పబడినవి.

**శాసన కాలము :**

ఈ శాసనము శక సంవత్సరము 1222. శార్వరి కార్తీక శుద్ధ పౌర్ణమి నా డీయబడినది. శ. సం. 1222 క్రీ. శ. 1300 కు సమానము. కాకతి ప్రతాపరుద్ర దేవమహారాజు ఓరుగల్లు పట్టణమును రాజధానిగా ఆంధ్రదేశమును పాలించుకాలమున చెఱకు వంశీయులు, వారి బంధువులు, సామంతులు నేటి మహబూబునగర మండలములోని, దేవరకొండ, మిర్యాలగూడ, హుజూరునగర్ ప్రాంతములను, పాలించుచుండిరని తెలియుచున్నది. శాసనమున కాకతి ప్రతాపరుద్రుడు, చెఱకు వంశీయులు, కేతులెంక ప్రశంస కలదు.

ఈ శాసనశిల మూఁడవప్రైపు చెక్కబడిన 24 పంక్తుల శాసనమును, శక సంవత్సర 1228 ప్లవంగ శ్రావణ శుద్ధ ద్వాదశి గురువారమున మహాసామంతుడైన చెఱకు జగద్దాడు అన్నయరెడ్డి పాలించు కాలమున అతని క్షేమముగోరి చెన్నమల్లికార్జున దేవునికి, మామిడితోట, పందుము పొలము, అల్లునూరి రెడ్డి దానమిచ్చు సందర్భమున వేయించెను. మొదటి శాసనము వెలసిన ఆరు సంవత్సరముల తరువాత ఈ శాసనము వేయింపబడినది. ఈ శాసనమున పేర్కొనబడిన చెఱకు జగద్దాడు అన్నయరెడ్డి మొదటి శాసనమున పేర్కొనబడిన చెఱకు జగద్దాడుమారయ గణపయరెడ్డి కుమారుడు కావచ్చును. ఈ శాసనము శ. సం. 1228 నాటిది కావున శాసనకాలము క్రీ. శ. 1306. శాసనారంభమున గాని చివరగాని శ్లోకములు లేవు. శాసనాంతమున ధర్మము ప్రతిపాలించిన వారికి అన్ని ధర్మముల ఫలము కలుగునని తెలుపబడినది. మొదటి శాసనమున పేర్కొనబడిన తాడువాయి, నేలమ్రఱి గ్రామములు హుజూరునగర్ తాలూకాలో నున్నవి. హైద్రాబాదు విజయవాడ రోడ్డుపై మునగాల, బరాకత్‌గూడ మధ్యనున్న సమితి రోడ్డునుండి తాడువాయి, నేలమ్రఱి గ్రామములకు వెళ్లవచ్చును.

## తాడువాయి శాసనము

### I. శాసనము – మూలము

మొ ద టి ప్ర క్క

1. ఓం. నమస్తుంగ శిర
2. శ్చుంబి చంద్ర చా
3. మర చారయేత్।
4. త్రయిలోక్య వగ
5. రారంభ మూల
6. స్తంభాయ శంభ
7. వే॥ స్వస్తి శ్రీ శకవ
8. రుషంబులు 1222
9. అగు నేంటి శార్వరి
10. సంవత్సర కార్తి
11. క శు 15 శు। స్వస్తి
12. శ్రీమను మహా
13. మండలేశ్వర కా
14. కతియ్య ప్రతాప
15. రుద్రదేవ మ
16. హారాజులు ప్రి
17. థివీ రాజ్యము సే
18 యు చుండం
19. గాను॥ స్వస్తి శ్రీమం
20. న్మహాసామంత వెలు
21. గు జగద్దాడు మార





## రెండవ ప్రక్క

1. య గణపయరడ్డి వారికి
2. ం బుణ్యముగాను తా
3. డువాయ శ్రీ చెన్నమ
4. ల్లికార్జునదేవ మహాలింగ
5. దేవునికి అందుల స
6. మస్త ప్రజాను శేతులె
7. ఉకం గాదుంన్ను ఆచంద్రా
8. క్కార్క స్థాయిగాను ఆంగరంగ
9. భోగానకుం దాడువాయ
10. సర్వ్వాయ మందున్ను గట్టినా
11. మ మాడ బదిరెండేసి బవి
12. సుల లెక్కను ఇచ్చితి॥
13. ఇ దేవునికి సేలమ్ముశ్రీ స
14. మస్త ప్రజాను ఆ యూ
15. రి సిద్ధాయ మంద్దున్ను
16. యుక్రమానసె ఇచ్చిరి
17. అగసాల దేవోజు తా
18. ఎబెట్ని తోటిమడి తా
19. డివనము ఇ దేవుని
20. కేటి పాలకు ఇచ్చెను
21. ఇ ధర్మ్మ ఎవ్వరేని ఇట్లు ప్ర
22. తిపాలింప వారికి
23. అనేక ధర్మ్మాలు సేసిన ఫ
24. లము॥ స్వదత్తా ద్విగుణ
25. పుణ్యం పరదత్తాను
26. పాలనం। పరదత్తాప
27. హారేణ స్వ దత్తా నిష్ఫ
28. లం భవేత్॥

## మూఁడవ ప్రతిక

1. ఓం స్వస్తి శ్రీ శకవర్షా
2. లు 1228 అగు నేం
3. టి ప్లవంగ సంవత్సర
4. శ్రావణ శుద్ధ 12 గు...
5. వారాన స్వస్తి శ్రీ మన్మహా
6. సామంత చెఱకు జ
7. గదాడు అన్నయ్య రడ్డివా
8. రు రాజ్యము సేయు
9. చుండంగాను చెన్నమల్లి
10. కార్జ్జున దేవునికి ఆచం
11. ద్రార్క స్థాయిగాను అన్నయ
12. రెడికి రంగనాథ—ఎంగా
13. రిపవిత్ర పందుముం ద
14. వాలము గాని ఇచ్చి ప్ర
15. తిపత్రము గార గొ
16. న్న చోవకెఱమలలోని ప
17. ందుముమ న ౧౦ అందు
18. లోని మా—మిడి తోం
19. టను ఆచంద్రార్కస్థా యు
20. గాను అల్లు మారిరెడ్డి ఇ
21. చ్చెను॥ ఇ ధర్మ్మశాం
22. ప్రతిపాలించిన వారికి
23. సర్వ్వశామ్మైనధర్మ్మశా లూరసి
24. న వట్టి ఫలం॥



# తిరుపతి వేంకటకవుల సువర్ణ పాత్రికము

## సంపాదనము : శ్రీ నిడుదవోలు వెంకటరావు

తిరుపతి వేంకటకవుల కృతులలో నింతవఱకునూ లోక మెఱుగన దీ కృతి. ఇందు ప్రసిద్ధమగు విప్రనారాయణుని కథ, నాటకరూపమున గలదు. ఈ నాటక మాకాలమున ననగా క్రీ. శ. 1910లో నప్పటి యాంగ్లేయ ప్రభుత్వమువారు శృంగార గ్రంథములను నిషేధించిన సమయమున రచింపబడినది. ఆవిషయ మిందు ప్రస్తావనయందే తెలుపబడినది.

ఇది నాటకముగాక ప్రకరణమని ప్రథమాంకము చివర గద్యవలన తెలియుచున్నది.

'ఇది శ్రీ తిరుపతి వేంకటేశ్వర విరచితంబగు సువర్ణపాత్రికమను ప్రకరణంబున బీజారోపణంబను ప్రథమాంకము.'

ఇది ప్రకరణము కాబట్టి పదియంకము లుండవలెను. కాని ప్రస్తుతము ఒకయంకము లభ్యమైనది. తక్కినభాగ మెచ్చట నున్నదో తెలియరాదు. తిరుపతి వేంకటకవులు దీనిని పూర్తిచేసిరో లేదో కూడ యంతకంటె తెలియదు.

వారి పోషకులగు శ్రీ రాజా కొచ్చెర్లకోట రామచంద్ర వేంకట కృష్ణారావుగారు దీనిని తమ సరస్వతీ పత్రికలో ప్రకటించిరి. (సం. 13. సం. 1. జనవరి; సం. 2, ఫిబ్రవరి; సం. 3. మార్చి సం. 4 & 5 ఏప్రియలు మెయి 1911) వీనినుండి నేడిది సంగృహీతమైనది.

శ్రీరస్తు
శ్రీమత్పరదేవతాయైనమః
తిరుపతి వేంకటీయము

## సువర్ణపాత్రికము

### ప్రథమాంకము

మెలఁతలపైఁట చాఁటు చను
మిట్టలపైఁ జననంబుఁగాంచి, ద
వ్వుల కధరస్థితామృతము
పొంగి వహింపఁగఁ బెంపుఁజెంది న
వ్వులను సుమంబులన్ గలయఁ
బూచు మనోభవభూరుహంబు కొ
ల్లలుగ ఫలించు పండ్లరుచి
లాగుత యోగుల చిత్తమేనియున్.[1]

శ్రుతి నిగమ వైజయంతుల దేవదేవి
హృదయమం దొప్పచున్నవారినిఁ గృతాంక
శంఖచక్రుల సజ్జన స్వాంత చరుల
విప్రనారాయణులను భావించువాఁడ.

(నాంద్యంతమందు సూత్రధారుఁడు)

పండితోత్తములారా ! మహాకవి కృతంబులగు పెక్కు నాటకంబులు మీయెదుటఁ బ్రదర్శించి మన్ననఁగాంచిన భరతపుత్రుఁడనేగాని క్రొత్తవాఁడను గాను. కొలఁదిదినముల క్రిందటనే నాకు సరస్వతీ ముఖమున లభించిన సువర్ణపాత్రికమను విప్రనారాయణ చరిత్రము మీ యెదుటఁ బ్రదర్శించి యానంద పెట్టఁదలఁచి యున్నాఁడను. ఇదె మా నటి వచ్చుచున్నది. రసాస్వాదన తత్పరాయమాణ హృదయులగు

1. ఈ నాందీపద్యము, నాటకమున ప్రధాన రసమగు శృంగారరసమును ధ్వనింపజేయుచు, మనోరమమై యున్నది.

మిమ్మొక ముహూర్తకాలము విలంబము సైచుటకై ప్రార్థించెదను.

(తెరవంకఁ జూచి)

ప్రేయసీ ! ప్రేయసీ ! (పిలుచును)

నటి : (ప్రవేశించి) ఆర్యపుత్రా ! నమస్కారము. (నమస్కరించును)

సూత్ర : ఓసీ. ప్రస్తుత కార్యమునే మఱచితివా యేమి ?

పలువు రనుంగులం ద్విజుల
బందుగు లందఱి విందుసేయఁగాఁ
బిలిచి, సమస్త వస్తువులు
విస్తరియందిడి యొక్కఁడెవ్వఁడో
బిలిచినవాఁడు రాకునికి
వేఁచినయట్లుగ నీ నిమిత్తమై
పలుగురికిం బ్రమోదమిడు
నాటకమాఁగితి నోసి ప్రేయసీ !

నటి : ఆర్యపుత్రా ! తమ నియోగము చొప్పుననె యా గ్రంథము వెదకుటకై కొంతకాలము వ్యయపఱుపవలసి వచ్చినది.

(గ్రంథము చేతికిచ్చును.)

సూత్ర : (చూచి) ఇది సారంగు తమ్మయకవి విరచితంబగు విప్రనారాయణ చరిత్రము. ఇది శ్రవ్యప్రబంధముగాని దృశ్యప్రబంధముకాదు. వచ్చిన నాలుగక్కరములు మఱచిపోయితివా యేమి ?

స్త్రీలకు విద్యలు గఱపం
బోలదుగాయంచు శుద్ధమోటుకు లెందే
నాలాపింపఁగ వారల
యాలాపము లేవియైన నాలించితివో.

నేను దెమ్మన్నది సువర్ణపాత్రికమను విప్రనారాయణ చరిత్రఁ దెలుపు నాటకముగదా ! అదియే యిపుడు మనముఁ జూపఁబోవునది. (చేతిలోని గ్రంథము పుటలువిప్పి) ఓహో ! యిది నూతన ముద్రితమై క్రొత్త సంస్కారముం గాంచియున్నదే ! దీనిని సంస్కరించిన వారెవ్వరో (పైభాగముం జూచి) ఏమవింత ! నేఁటితో నీ గ్రంథమునకు శాపవిముక్తి గలిగినది.

నటి : ఆర్యపుత్రా ! దీనికిం గలిగిన శాపమేమి ?

సూత్ర : శాపమనఁగా మఱి యేమియులేదు. కచములు కుచములు మున్నగు శృంగారావయవములు వర్ణింప బడుటయు, నీతికిని మతమునకును విరుద్ధమగు మాహాత్మ్యమును దెల్పుటయు మొదలగు దోసములు కొన్ని కల్పించి యే మహానుభావుఁడో వైజయంతీ విలాసము మొదలగు కొన్ని గ్రంథములనుఁ గాలసర్పముతోఁ బోల్చి చదువరానివని వ్రాసెనో, యాతఁడే దీనికిఁ బునస్సంస్కర్తయట ! అమ్మా ! గోదావరీ ! నీకడుపున నెంత విచిత్రసంతానము జనించుచున్నదో కదే !

చారుతరంబులై మదికి
సంతసముం బొనరింపఁజాలు శృం
గారరసప్రధానముల
గ్రంథములం గనినంత వారి వ్యా
పారము నింద్యమౌననుచుఁ
బల్కుదురక్కట ! మూరులెల్ల సం
సారము సేయరో కచకు
చంబులఁ గేలఁ బరిగ్రహింపరో!

మతమున నీతియందు నొక
మార్గము గైకొని యన్యమెల్ల గ
ర్హితమని యెంచువారె యుద
యించిరి మున్నిపు డుద్భవించు వా
రితరుల మోసపుచ్చుట క
నేక మతంబు లనేకరీతుల
ద్భుతముగ మాటిమాటికిని
బూనెదు వార లిదేమి చిత్రమో !

నటి : ఆర్యపుత్ర ! కవితారసమునం దభిరుచిపడి గ్రంథములు చదువువా రొకరు మాసుమున్న

మానుదురా ? ఇక దీనికి శాపవిమోచన మనఁగానేమి ?

సూత్ర : ఏ మాంత్రికునిచేత దీనియందు దోష పిశాచ మావేశింపఁ జేయఁబడినదో, వానిచేతనే మరల నా పిశాచము వదలింపఁ బడుటయు నా మాంత్రికుని మాయఁ దవిలి యెవ్వరు దీనిం బఠింపమానిరో వారు మరల దీనిం జదువు భాగ్యము పట్టుటయు దీనికి శాపవిమోచనము—కానిమ్మింక నీ యప్రస్తుత ప్రశంసకు ముగింతము. ప్రస్తుతమున కాయత్తపడుము.

నటి : మరలఁబోయి మీరు తెమ్మన్న గ్రంథముం దెత్తునా ?

---

2. నాటక రచనా సంప్రదాయము ననుసరించి, యీ విషయ మప్రస్తుతమైనను, అది యీనాడు ప్రస్తుతమే. దానివెనుక యీనాటివారికి తెలియని చరిత్ర ఎంతో యిమిడియున్నది. అది యాకాలమున నింగ్లీషు ప్రభుత్వమువారు తెలుగు శృంగార గ్రంథాలపై చేసిన నిషేధ శాసనము.

### శృంగారప్రబంధ ప్రచురణ నిషేధ చట్టము

ఈ నాటక రచనకు ముందుగా ననగా క్రీ. శ. 1910 లో ఈ శృంగార ప్రబంధనిషేధము ప్రారంభమైనది. అప్పటి కేభయియేండ్లనుండి యువిచ్ఛిన్నముగా, ఆంధ్ర కావ్యప్రబంధ ముద్రణలో ఆరితేరిన 'వావిళ్ల' సంస్థవారు ప్రకటించిన యీ క్రింది గ్రంథాలను ప్రభుత్వమువారు పైచట్టము క్రింద నిషేధించినారు. అంతేకాదు. ఇట్టివి ముద్రించినందులకు ప్రకటన కర్తలపై 'అభియోగము' తెచ్చారు—

1. వీథినాటకము—శ్రీనాథుడు
2. వైజయంతీ విలాసము—సారంగు తమ్మయ్య
3. హంసవింశతి—అయ్యలురాజు నారాయణ కవి.
4. తారాశశాంక విజయము—శేషము వెంకట పతి.
5. రాధికా సాంత్వనము—ముద్దుపళని
6. బిల్హణీయము—చిత్రకవి సింగరార్యుడు. (పిండిప్రోలు కృష్ణస్వామిపేర నున్నది.)
7. కవి చౌడప్పశతకము—కవి చౌడప్ప.
8. వేణుగోపాల శతకము—రాయభట్టు వీర రాఘవకవి.
9: గణికాగుణ ప్రవర్తన తారావళి—రాచవేటి కవి.

అప్పటి 'వావిళ్ల' సంస్థ సర్వాధ్యక్షులగు వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు—దీనిని ప్రతిఘటించి, ఆ కాలమున సుప్రసిద్ధ న్యాయవాదులైన పేరి నారాయణమూర్తిగారిని తమ పక్షమున న్యాయవాదిగా నెన్నుకొని హైకోర్టులో అప్పీలు చేసినారు. పేరివారి వాదనకు ప్రత్యుత్తరము చెప్పలేక, ప్రభుత్వమువారు కొన్ని సంస్కరణలతో ఉపసంహరించుకొన్నారు కాని పూర్తిగా నిషేధాన్ని తొలగింపలేదు.

ఆ సవరణలలో ముఖ్యమైనది— మొదటి ఆరును ప్రబంధ సాహిత్యమున విశిష్టములు కాబట్టి వానిలో కేవలము శృంగారరసప్రధానములై అవయవ వర్ణన కలిగిన పద్యములను తొలగించి, గ్రంథము అచ్చువేయవచ్చును. దాని ననుసరించి వైజయంతీ విలాసము తిరిగి వావిళ్ల వా రచ్చువేసినారు.

పై ప్రస్తావనలో నీ గ్రంథమునకు గలిగిన 'శాపము' నిషేధము; శాపవిమోచనము – సవరణతో ముద్రణ—

ఇక 'ఏ మహానుభావుడీ వైజయంతీ విలాసము మొదలైన వానిని చదువరానివని నిషేధించెనో అతఁడే దీనికి పునస్సంస్కర్తయట ! అమ్మా ! గోదావరీ ! నీ కడుపున నెంత విచిత్ర సంతానము జనించుచున్నదో గదే!' అన్న వాక్యములలో వ్యక్తిని గూర్చి పాఠకులు తెలిసికోవలసి యున్నది. ఆయన కీర్తిశేషుడు గోటేటి కనకరాజు. ఆకాలమున ప్రభుత్వ భాషాంతరీకరణోద్యోగి. (Telugu Translator to the Government of Madras). రాజమహేంద్రవరనివాసి. కందుకూరివారి శిష్యులు. వీరేశలింగము

సూత్ర : పోనిమ్ము. మనకంతగా మాతృకావసర
ముండగూడదు ఏమన :—

మఱపను మాటలేదు మన
మండలి కిందును గీతినృత్యమం
దరమరలేదు సార్థక ని
రర్గళ చారుపదప్రయోగముం
గఱచిన దీకవీశ్వరుల
కావ్యము సభ్యులు బుద్ధిమంతు లం
దఱు గుణమే గ్రహించి ప్రమ
దంబు వహించెదు వారు కోవరీ !

అదియునుంగాక యప్రమత్తులగు కుశీలవుల
కును మాతృకావసరంబు కలిగించు నాటకంబులు
వేఱు.

ఇల భువి భూమి పృథ్వియని
యెందు నిరర్థక శబ్దముల్ యతి
స్థలములఁ బ్రాసలందును శ
తంబులు గూర్చిన పద్యజాలము
న్నులుమరు శ్రద్ధగాఁ జదివి
నం గమనించిన నెంత బుద్ధిమం

---

గారు పైచెప్పిన గ్రంథాలలో వైజయంతీ విలాసము, తారాశశాంకము, రాధికాసాంత్వనము మున్నగువానిని గూర్చి తమ కవుల చరిత్ర మూడవభాగములో 'చాలా అవినీతిని బోధించే కావ్యా'లని తీర్మానించిచారు. గురువుగారిని పురస్కరించుకొని శిష్యుడు పై మూడు పుస్తకాలలోని భాగాలను విశేషంగాను, తక్కినవాని లోనివి కొంచెము తక్కువగాను ఇంగ్లీషులోకి భాషాంత రీకరించి ప్రభుత్వమువారికి పంపినారు. దానిపై వారు చర్య తీసికొని గ్రంథాలను నిషేధించినారు— కాబట్టి నిషేధము (శాపము)నకు కారకులు కనక రాజుగారే—హైకోర్టులో అప్పీలు గెలిచినతరువాత— ఆ గ్రంథాలలో కొన్ని శృంగార పద్యాలు తీసివేసి, వానిని ప్రకటింపవచ్చునని సవరణను (శాపవిమోచ నము) జారీ చేసినవారు వారే. అట్టి గ్రంథములపై ముఖపత్రమున నాంగ్లభాషలో

"Scholars Edition"

అని ముద్రింపవలెనని వారే శాసనము చేసినారు... ఇంత గ్రంథానికి కారకులైన కనకరాజుగారి చిత్రము —ఆంధ్రపత్రిక ప్రథమ సంవత్సరాది సంచిక (1910)లో గలదు.

క్రీ. శ. 1911 ప్రాంతమున నప్పటి పరిస్థితులనుబట్టి ప్రభుత్వము నిషేధము సడలించి నను, క్రీ. శ. 1927 లో దానిని తిరిగి ఛాయ పఱచినారు. కాని దేనినైనా ఆపగలరు గాని శృంగార రస ప్రవాహాన్ని ఆపేవారెవరు? అది ఎవరికి శక్య మవుతుంది ? కీర్తిశేషులు గంటి సూర్యనారాయణ శాస్త్రులుగారు—శృంగార గ్రంథమాలలో శృంగారా కృతులతో శృంగార గ్రంథాలు వెలువరించారు. ఆ గ్రంథాల రూపరేఖావిలాసాదులకు అందరూ ముగ్ధులైనారు. వారే కీ. శే. ప్రభాకర శాస్త్రుల వారి విపుల పీఠికతో 'క్రీడాభిరామము' ప్రకటించి నారు. అది శృంగార గ్రంథమైనను, ప్రభుత్వ నిషేధమున్నంతమాత్రాన ప్రకటింపకుండ నుండ రాదనియు, సాంఘిక చరిత్రకు సాహిత్యమునకు ముఖ్యమగుటచే యథామాతృకముగా ప్రకటింప బడ వలెనని జయంతి రామయ్య పంతులు గారు, మొదలయినవారు నిర్ణయించిన తరు వాత ప్రకటితమైనది. బందరులో కీర్తిశేషులు కే. జి. మూర్తిగారు. 'శృంగార కావ్యగ్రంథ మండ లి'లో కొక్కోకాది గ్రంథాలను సచిత్రముగా ప్రకటిం చారు. వారి గ్రంథమండలిలో—సత్యభామా సాంత్వ నమును నేను పరిష్కరించి పీఠిక వ్రాసినాను. అవి చాలా నిర్దుష్టముగాను నిరవద్యముగా ముద్రితమైనవి. దేశ స్వాతంత్ర్యముతో ఈ నిషేధశృంఖల తొలగినది.

తులకునూ వానిలో. మఱవు
దోసము తప్పదు మానినీమణీ !8

(సభవంకఁ జూచి)

ఆర్యులారా ! ఈ నటి కాలవిలంబము గావించి వచ్చుటయేగాక మఱియుం గొండొక కాల క్షేపముం జేయుటకుం దగిన త్రోవఁ జూపించినది: క్షమింపుఁడు. మేమిపుడు ప్రదర్శింపఁబోవు నాటకమునకుం గర్తలగు కవుల పేరులు వినుఁడు. పదార్థముల రుచి చూడకమునుదును పాచకుని నామముం బట్టియే తినువారి డెందములు తదభిముఖమగుటయు గలదు.

ఏ వాని ధ్యాననం జేనాఁడు గనుగొన్న
మందస్మిత ప్రభా సుందరంబు
ఏ వాని వాక్యంబు లెంతెంత బుధులు నౌ
దలఁధాల్పఁజాలు ముత్యాల జాలు
ఎవని గాథ ప్రజ్ఞ యేపట్లఁ జూచినఁ
గూలంకషాలోచనాలయంబు.
ఎవని నికేతనం బేవంక నరసినఁ
దత బంధు మిత్రాశ్రిత వ్రజంబు
ఎవని శ్రీగంటి చూపుల నెల్లయపుడు
వరదలై పాఱుచుండుఁ గృపారసంబు
శ్రీకర గుణాకరుండు కొచ్చెర్లకోట
వంశ చంద్రుఁ డే కృష్ణభూపాలమౌళి.

ఆ పోలవరపురీ భూపాలుని కవీంద్రు
లాబాల్యకవితసౌహార్ద పరులు
శతలేఖినీపద్యసంధానధౌరేయు
లష్టావధానచర్యా ప్రవీణు
లాభాష్యపఠిత దివ్యవ్యాకరణ తంత్రు
లవిరత కవితా రసైకవశ్యు
లఖిలాంధ్ర భూపాల కానీత బహుమాను
లర్చిత పరదేవ తాంఘ్రియుగులు
వరులు తిరుపతి వేంకటేశ్వరులు తేంట్లు
కొఱకు చైత్రమై శాఖముల్ విరులు సృష్టి
చేయుగతి బుధులకై రచించుచున్న
నాటకంబులలోని దీ నాటకంబు.

రంగనాథ పదాంబుజ భృంగమైన
విప్రనారాయణుని నొక్క వేశ్యవలచి
దాసునిగఁ జేసికొన్న కథావిధాన
మిందు వర్ణింపఁగాఁబడె సుందరముగ

వేశ్యారాగము మన్మథ
వశ్యము దొంగతనము వాణిజ్యంబున్
వేశ్యామాతల మాయ ల
వశ్యముఁ జూపఱకుఁ దెలియవలసిన విందున్.

ప్రియురాలా ! మన సంగీతశాలయందు గీతస్వరములే వినఁబడకున్నవేమి ? కుశీలవు లందఱేమి సేయుచున్నారో ?

(తెరవంకఁ జూచి)

భరత విద్యాప్రవీణులారా !

చేతము చల్లఁజేయుటకుఁ
జేసిన దివ్యరసాయనంబు శో
కాతిశయంబునం బొగులు
నయ్యలకొనియు వేళపుచ్చు సం
గాతము సార్వకాలిక సు
ఖస్వము సేర్చిన గోత వౌర సం
గీతమిదే కదా యభిమ
తీకరణౌషధ మెల్లవారికన్.

(చెవి యొగ్గి)

కామమోహితుండవై కామినితో నప్రస్తుత ప్రశంస ముచ్చటించునీకు మా సంగీతము వినఁబడుచున్నదా యనుచున్నారా !

---

3. ఇట్టి నిరర్థక రచనలను గూర్చి కావ్యవిమర్శనలో 'యమునికన్నా నిర్భాగ్యుణు'లని పేరు పొందిన కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగా రిట్లన్నారు. 'తనకు గోష్పాదమంత భూమి లేకపోయినా తన గ్రంథంలో మాత్రం ఎక్కడ చూచినా భూవాచక పర్యాయ పదాలే కనిపిస్తాయి'. ఇది వీరేశలింగంగారిపై విమర్శ.

మేలు ! మేలు ! భరత పుత్రులారా ! మేలు. చక్కఁగాఁ బ్రబోధితుండ నైతిని. కామునకు నేనొకఁడనేకాదు. జగములన్నియు వశ్యములే—

మగకచ్చం బిగఁగట్టి చిత్తమెపుడు
న్మత్తంబు గానీని మా
నిగణంబుం గగనాగ్రచుంబితములై
సీరంధ్ర పాలాంత రా
ళగతానేక గృహంబులై తనరు బా
లాకేళి సౌధంబులం
దగు పూసెజ్జలఁ జేర్చునేరుపరి కం
దర్పుండు సామాన్యుఁడే.

తెరలో

రారేయచ్చరలార ! రమ్ము భ్రమరీ
రా యూర్వశీ కీరకం
ఠీ రత్నప్రభలార ! రండు కలకం
ఠీ రంభరో ! వేగవే
తేరే శ్రీహరి కొల్వులోఁ దగవుకా
దే నేడు కామంబుతో
వైరాగ్యంబున కెల్ల దేవతలలో
వైరంబు సాధింపరే.

సూత్ర : నటీ ! నాటక మారంభమైనది. కామ వైరాగ్యములకు జరుగఁబోవు వివాదమునకుం దోడు పడుండని నారదుఁ డచ్చరలం బిల్చు చున్నాఁడు. మనము పోదము రమ్ము.

(అని నిష్క్రమించును)

ఇది యాముఖము.

ర : (తనలో) వైరాగ్యపక్ష మవలంబింపవలసి వచ్చిన నేను రంభాదులగు నప్సరసలం బురి కొల్పిన గర్వింతురేమో ! ఏమైనఁ గానిమ్ము నాకుఁ గలహాశనుండన్నపేరు రానేవచ్చినది. కలహకారణంబులగు పనులు నేనేల మాను దును. కాముకులు గూడ డాంబిక విరాగులగు చుండుటయు, విరాగులు సైతము ప్రచ్ఛన్న కాముకులగుటయు వైరాగ్యమున కీయవస్థఁ దెచ్చినవి. ఇంతకు మునీంద్రులగతి యేమగునో! కామమ్ముఁ గెల్చిన మునులందఱు నొక్కొక్క యచ్చర నొక్కొక్కరు పెండ్లి యాడవలయు నఁట ! వైరాగ్యమే గెల్చిన రంభాదులెల్ల సన్యాసినులు గావలయునఁట ! ఇది యెక్కడి పందెమో ? కదళీకంటకన్యాయముగా నున్నది. రెండు పందెములు గూడ నచ్చరలకే మేలు గలుగఁజేయు చున్నవి. ఎన్నిపురాణములు విన్నను, విరాగులు భ్రష్టులైరని విందుమే గాని యొక్క కాముకుఁ డెన్నఁడు విరాగియైనట్లు కానరాదు. వెయ్యేల ఆబాల్యసన్యాసి నగు నాయవస్థఁ దలఁచుకొనిన నాకే వింతయగు చున్నది ! హరిమాయంజేసి నే నాఁడుదాననై కొడుకులం గూతులం గనుట యటుండ నిమ్ము; మా పర్వతుండును, నేనును దొల్లి దేశాటనంబు సేయుచు, సృంజయుని నగరం బునకుంబోయి, యందుఁ జాతుర్మాస్య వ్రతం బునకై నిలిచి యేతని కూఁతురగు దమయంతి వరింపఁబడుటయుఁ దానంజేసి నాకుఁ గ్రోఁతి మొగంబు సంప్రాప్తించుటయుఁ దలఁచిన నాకే వింతయగుచున్నది ! ఛీ ! నేనెంత వాఁడను! కొమ్ములు మొలచిన ఋషులు సైతము స్త్రీలకు వశ్యులై కాంతావ్యామోహమ్మునం బడి సన్యాసము విసర్జించిరి. దేవఋషుల కతలే యిట్లుండ నిఁక మర్త్యసన్యాసులఁ జెప్ప నేటికి ? అందులో భూలోకంబున గతి కాలము బొత్తిగా పాడైనది.

అగ్రజాతిం బుట్టినట్టి విప్రాంసుండు
.. ..... ... బాలమాల లొసఁగ .
మేలైన బహుకుల స్త్రీలు గల్గిన రాజు
తొత్తుకన్నెల సొత్తు గుత్తసేయు .
వెచ్చాలొసంగి జీవించు కోమటిబిడ్డ
వారకాంతల యింటిపేంచఁ దిరుగ
కృషిచేసికొని బహుకృతులందు సంసారి
అంకుటాలికిఁ దత్తరంబు సూప

నుత్తమాంగన లెల్ల దాస్యేప జీవి
కాలబేయుల కులటలై గ్రాలుచుండ
నడ్డుమాఁకయులేకఁ బుష్పాంబకుండు
కాముఁడే గెల్పుఁజెందుట కేమివింత !

మఱియుఁ గొన్ని శ్రుతిస్మృతులు గల్పించి వైరాగ్యము వృద్ధిఁజెందించుటకును కామ మడు గంటుటకునుఁ దగిన యుపాయముగా స్త్రీలకు వైధవ్య నిర్బంధము నెపంబున సన్యాసినులను గాఁజేయఁ దలఁచిన తొల్లింటి ఋషుల వాక్యంబులు పిచ్చికూఁతలఁట ! విధవలకు వివాహములఁట ![4] కటకటా ! ఎంత పాపిష్ఠి కాలము వచ్చినది—కానిమ్ము. కానున్నది కాక మానదు.

(ముందుఁజూచి)

వీఁడె పర్వతుఁ డేతెంచుచున్నాఁడు.

పర్వ : (సమీపించి) మామా నమస్కారము.

నార : తండ్రీ ! పర్వత ! నీవెందుండి యెచటికేగు చున్నావు ?

పర్వ : కామ వైరాగ్యములకుఁ దగవు వచ్చినదనియు, దేవఋషులకును, దేవవేశ్యలకును సెలవైన దనియు విని స్వర్లోకంబున కేగుచున్నాను. తమరెందాఁక ?

నార : నేను నచటికే ! అందులకే ! కాని మన ఋషులలో వొక్కఁడేని స్త్రీలకు వశ్యుడు కాని వాఁడున్నచోఁగదా మన వైరాగ్యము జయముఁజెందుట ! అట్టివాఁ'డున్నాడా లేఁడా' యనియే నాకు సందియము.

పర్వ : అయ్యా ! తమకేల సందియము? విరాగులగు మహానుభావు లెందఱెందఱో యున్నారు.

నార : ఏదీ ! యొకరిపేరు చెప్పుము ?

పర్వ : విరాగియన పద్మపత్రమునందలి జలబిందువు వలె...సంసారమందుండియుఁ దత్పంక మంటని వాఁడనియా లేక స్త్రీలమొగమే యెఱుఁగని వాఁడనియా?

నార : ఇప్పుడు వచ్చిన తగవే నీ వెఱుఁగవుగాఁబోలు! కామము మహాసభలో నిస్సంశయముగా నోరెత్తి

మగతన ముండియున్ మగువ
మాట తలంపనివాఁడు దేవ మౌ
ని గణములందుఁగాని తరు
ణీమణి చూపులకోవసోకినన్
సొగయనివాఁడు మర్త్యముని
శూరుల యందునఁగాని చూపుఁడీ
జగములరెంటనంచు ప్రతి
సంధియొనర్చెఁ టాగ్రహంబునన్.

పర్వ : ఔరా ! కామము పొగరు!

సనకసనందనాది ముని
సత్తము లంబరమ్మైన గట్టనే
రని యతిరాజులుండఁగఁ గ
రంబిటులాడగవచ్చునే మహా
త్ముని శుకునైన లోఁదలఁపఁ
బోలదె సృష్టికివారుసృష్టి చే
సిన ముని గాధినందనుడు
చేసిన చైదము లెంచఁబోలునే

నార : వారికేమి అంకులుగలవో? వారును భీష్ము లైనందుల కెంత సాక్ష్యము సిద్ధము చేయ వలెనో ఎవరికెఱుక.

పర్వ : ఈ తగవు మహాత్ముల గుట్టు బయటపెట్టుటకై వచ్చినది కాబోలు! కానిమ్ము, కాలము దాఁటిపోవు చున్నది. పోదము రమ్ము.

(అని నిష్క్రమించు చున్నారు)

ఇది శుద్ధ విష్కంభము.

---

4 వీరేశలింగముగారి విధవావివాహ సంస్కరణ సూచనము. ఆకాలమున సనాతనులేకాక—యాంగ్లేయ భాష చదివినవారును కొంతమంది ఈ విధవా వివాహ సంస్కరణము నంగీకరింపలేదు. ఆనాడు వీరేశలింగము గారికి సర్వవిధముగ కుడిభుజమై యుండిన ఆంధ్ర భీష్మ న్యాపతి సుబ్బారావు పంతులుగారే, తన తమ్మునికి వీరేశలింగముగారు విధవా వివాహము చేయుదు ననగా నడ్డుపెట్టినారు.

ప్రథమాంకము

ప్రావారీకృతకుండలీంద్రనుతు నా
ర్యస్తోత్రపాత్రుం దశ
గ్రీవారిప్రియభక్తవందితుని రం
గేశాయి నాలించితే
కావేరిం బ్రతిభా లతాంకుర పరి
ష్కార క్రియాదోహద
శ్రీవారిన్వినియుంచె రంగనగరీ
గ్రీవా సుహారావళిన్

కామ : ఆ! కమలాకమలవదనసంవాహ్యమాన చరణారవిందుండును, నిత్య శృంగార వేష మనోహరుండునునై, సప్తప్రాకారాంతరాళ దివ్య మందిర మహనీయ సౌధంబున భక్తుల రక్షించు మహానుభావుండని వినియుంటిని. ద్రావిడీ వక్షోజ గళిత ఘనసార సంకుమద పంక తనుతరతరంగ సంపాతి మరుదర్భక ప్రమృష్ట సతత భక్తోపలాలనా పరిశ్రాంత రంగనగరీశాంతసంతాప నివారిణియగు కావేరీ నదియు నాయెఱుంగనిది కాదు.

వైరా : నీ యెఱుంగనిది ప్రపంచమునయెందే లేదని నీ దురభిప్రాయము. కానిమ్ము

ఆయేటి నడిదీవి యందలి పువుదోట
నొక కుటీరంబున నుండు వాఁడు
ఏవేళఁ గనుగొన్న నా వనంబునఁ బూవుఁ
జెట్లు నీర్వోసి పోషించు వాఁడు
పూలన్నియుం గోసి మాలలుగాఁ జేసి
శ్రీరంగపతికి నర్పించువాఁడు
బిక్షాశనము ప్రాణరక్షకా నెల్ల వే
ళల రంగపతినిఁ దలంచువాఁడు

వైజయం త్యవతారంబు వైష్ణవుండు
నీ కథలు నీ కుచేష్టలు నీ గుణంబు
లెన్నఁడెఱుఁగని వాఁడు జితేంద్రియుఁడు మ
దీయ భక్తుండు విప్రనారాయణుండు.

కామ : ఈ మహానుభావుని పేరైన విని యుండలేదే? ఈతనియందు నేనేమి దోషము పాకుత్తు! కటకటా! కామ సామ్రాజ్యమా! నీకుఁ బరాభవము తటస్థించుచున్నది కాఁబోలు.

(ధైర్యముఁ దెచ్చుకొని ప్రకాశముగా)

వైరాగ్యమా! మీ విప్రనారాయణుండు కలియుగములోనివాఁడే కదా! నాకుఁ బ్రాణసఖుండగు కలి మహారాజు పరాక్రమమైనను దలంపకున్నావు. ఇంతకుమున్ను నా తంత్రములు నా కథలు నాగుణంబు లెఱుంగ కుండునా?

వైరా : (నవ్వుచు) ఇఁక ముందా! యుగములు తల క్రిందైనను నీ కుతంత్రములు నీ కథలు, నీ గుణంబులు నా యనుంగు సోదరుని యొద్దఁ బనికిరావు. అతఁడు నా గుండెకాయ. అతఁడు నా సర్వస్వము. అతఁడు నా బహిః ప్రాణము.

అఱవెత లప్పరిం బటిక
నార్చిన మేలి పసిండి బొమ్మ లెం
దఱు భవదీయ దాసులు మ
నంబుల బింకము వాసి బీరముల్
దొఱఁగిరి కామమా! కమల
లోచను పూవులతోఁటకాపరిం
గఱచునె కో త్వదీయ కువి
కారము లప్రతిమప్రకారముల్

అతఁడు నీకు మారకుఁ డ
పార బలంబగు నీ బలంబు నీ
చేతి శరాళి నీ పలుగు
సేత లుపాంత చరంబులయ్యు వి
ద్యోతిత రంగ నాయక ప
యోధర దివ్యరసాశయాశనా
యాతతచాతకంబయిన
యాతని చేతముఁ ద్రిప్పఁజాలునే

---

5 ఇచట కొంత లోపించినది ఈ భాగము ప్రకటితమైన సంచిక లభ్యముకాలేదు. దొరికిన పూర్తి చేయబడును.

కామ : (ఇంద్రుని దిక్కు మొగంబై ) దేవా! నాకొకింత గడు వొసంగితి రేని యాతని మదీయ దాసుని గావించుటకు సందియములేదు.. మొగమైన నెఱుంగని వాని విషయమై యిప్పుడు నేనేమి నుడువగలను. అదియునుం గాక మా జయాపజయంబుల కిదియె మంచి త్రోవ. ఏ పురుషుని యందేని మా యుభయుల బలంబులు నుపయోగించి చూచెదము. దానికిం దగిన మానిసి పేరు వైరాగ్యమె యుచ్చరించినది. కావునం దద్విషయిక ప్రయత్నము గావించుకొనెదము.

దేవే : వైరాగ్యమా! ఏమనియెదవు?

వైరా: నా యభిప్రాయమట్లే యున్నది. గడువునెడల నొకింత కాదుగదా! కావలసినంత యొసంగెదను. (తనలో) అక్కటా! మాటనోట జారినది. కావలసినంత గడువిచ్చెదనంటిని· ఈ కుత్సితుం డే కుతంత్రముల పన్నునోకదా! అయినను నా మహానుభావుని యెడల సందేహింపఁదగదు.

దేవే : కామమా! నీ కెంత గడువు కావలెను.

కామ : రెండు నెలలుండినం జాలును.

దేవే : వైరాగ్యమా! నీకంగీకారమే కదా? ఆలోచించుకొనుము;

వైరా : దేవా! ఇందాలోచింపవలసిన దేమున్నది (తనలో) గడువు నా కుపకారకమేగదా! యమనియమాదులగు నా సైనికులనెల్ల నతని సంరక్షకై యునిపెద.

దేవే : మీ రిరువురు నెవరి సేనతో వారు పొందు. పరస్పర విజిగీషువులు కండు. స్వస్వ వ్యాపారముల నేమరకుండు.

వైరా : దేవా! మహాకవులును జిత్రకారులును దన సేన యని కామము వివాద పెంచుచున్నది. ఆ తగవు కూడ దేవరవారే తీర్చవలయును.

దేవే : కామమా! నీకును గవీంద్రులకును సంబంధ మేమున్నది ?

కామ : దేవా! అట్లనియెదరేల ? కావలసినంత సంబంధముగలదు.

నాతోడునీడయై నన్ను సంరక్షించు
శృంగారరసము వర్ణించు నేర్పు
నాదాసురాండ్రైన నలిననేత్రల రహో
వయనంబులను బయల్పఱచు శక్తి
నా వశంబుననుండి నన్నుం బేర్కొను నాయి
కానాయకాకార కల్పనంబు
నా యనుంగుల యెడ నా సేనయెడ్ల నస
త్యమునకు జంకని యతిశయోక్తి
దంపతుల కస్మదీయ ప్రతాప విధులు
వన్నె చిన్నెలతో నేర్పు వైభవంబు
కల కవీశ్వరులే లేని కాలమందు
నాకు బ్రదుకెక్కడిది సురలోకనాథ!

దేవే : వైరాగ్యమా! నీకును గవీంద్రులకుగల సంబంధ మేమి ?

వైరా: నాకును వారికినిగల సంబంధమునకు మితియే లేదు:

సంసారమందు దోషమ్ములు చూపు శాం
తరసంబు వివరించు గురు మనీష
ప్రేమాస్పదములైన స్త్రీల చైదముల నే
వముగల్గఁజేయు వాగ్వైభవంబు
ఇంద్రియావళిని జయించు ధీశక్తి బో
ధించి చక్కఁగ విమర్శించు పటిమ
కామదాసులుపడ్డ కష్టముల్ తెలిసి నా
పైని విశ్వాసి కన్పఱచు చుఱుకు
కామ్యకర్మ పరిత్యాగ గౌరవంబు
సరస యుక్తులతోం జెప్పు చతురిమంబు
గల కవీశ్వరులే లేని కాలమందు
నేను మాత్రము బ్రదుకుదునే కవీంద్ర!

దేవే : మీ యుభయుల వాదముల వలనను గవులలో రెండు తెగలు గలవని తేలుచున్నదికదా! ఎవరి తెగ వారిని వారి సైనికులనుగాం బరిగణించుకొనుట యం దాటంక మేమున్నది. కానిండు-

ముందు మీ మీ సేనలను బేర్కొనుడు. తరువాత వివాద్యాంశము విచారింతము.

కామ : అప్సరః ప్రముఖులగు స్త్రీలును శుకపికాదులగు పక్షులును వసంతాది ఋతువులును కాళిదాసాది కవులును నా సేనయేకాని హేయమైన శృంగార రసమును వర్ణించు కవులు మాత్రము నావారుగారు.

వైరా: దేవా! కవులలో నొక తెగవారిని నదియే వదలినది. ఇఁకఁ గాళిదాసాదులుకూడ దానిసేన కాదు. ఏమందురా?

సారములేక యుండు పశు
పక్షి మృగాదులకెల్ల లోకసా
ధారణమైన కామ కథ
దానికి సత్కవు లెట్టులౌదురో
కారణ మస్మదీయ జని
కారణ మక్కవి వంశవౌట; నా
వారలు వారలంచు నుడు
వందగదే! సురలోకనాయకా!

కామ: దేవా! నావాదముగూడ సావధాన చిత్తుడవై యాకర్ణింపుము.

కలయిక చోద్యముల్ మొదలు
గా గల మన్మథచేష్ట లెల్ల సాం
పులు గులుకంగ నాల్మగల
పొడుములంచుఁ గవీశ్వరుండు మై
పులకము లుప్పతిల్లఁగఁ
బొత్తములం రచియించి వాని న
ర్మిలిఁ బఠియించు వారి కొన
రింపఁడె కామకథాప్రపంచమున్

వైరా: ఎండు చెట్టెంత దోహదము చేసినను చివురించునా?

కామ : కించిత్ప్రాణావశిష్టమైన చెట్టు చిగురించునా లేదా?

వైరా: భూసారము లేనిదే, దోహదము పనిచేయదు.

కామ : దోహదమే భూసారమునుగూడఁ గలిగించును.

వైరా: పశుపక్షి మృగాదులకే కవీశ్వరులు కామవృద్ధి చేయుచున్నారు. ఎంతటి శృంగార గ్రంథ మేనియు సద్యః కాలపరనిర్వృతికై యుపయోగించును. కాని కామవృద్ధి చేయదు. అయినను మనకేల? ఈ వివాదమును సకల ధర్మస్వరూపుఁడగు దేవేంద్రుఁడే తీర్పఁగలఁడు.6

దేవే : సరియే! మీ యిరువురి వాదముల యందలి సారాంశమును నాకు గోచరమైనది. ఈ విషయ మతిగహనమైనది. అయినను నా తోచినంత వివరింతును. కామంబు సర్వజంతు సాధారణంబు. అతి కాముకులు విద్యావంతులకంటె మూర్ఖులయందు యెక్కువగ నున్నారు. కావున నా వ్యాప్తి పనికిరాదు. వైరాగ్యశాలురు విద్యావంతుల యందుదప్పఁ దదితరులయందుఁ గానరారు. ఒకానొక చోట నుండినను వారు పురాకృత విద్యా పరిపాక శాలులని యనక తీరదు — కావున విద్యావత్తకును వైరాగ్యమునకును వ్యాప్తి కుదురుచున్నది. కావున సత్కవుల శృంగారప్రబంధములవలన నానందముతప్ప వేఱు ప్రయోజనములేదు. వైరాగ్య

---

6. ఈ కామవైరాగ్య సంభాషణ—వివాదము — ప్రత్యేకముగా నాటి ప్రభుత్వ శృంగార గ్రంథ నిషేధ శాసనమును గూర్చియే ప్రవేశపెట్టబడినదని తెలియవలెను. తెలుగుభాషలో, శృంగార గ్రంథము లన్నంత మాత్రమున నవి కేవలము శృంగారమునే ప్రతిపాదింపవనియు, కొంతవ్రైన వైరాగ్యమం దుండుననియు నీ సంభాషణ మూలమున వ్యక్తమగుచున్నది. మఱియు సత్కవులైనవారు శృంగారమును వర్ణించినను, నది యుదాత్తముగ నుండి, లోకాభ్యుదయ హేతువుగ నుండును. అందువలన కేవలము కామప్రవృత్తినే ప్రోత్సహించు కావ్యములు వ్రాసిన కవులు గణనకు రారు. వారికృతులు నిరాదర యములు.

ప్రబంధ పఠనంబునం బుట్టెనేని వైరాగ్యము పుట్టవచ్చు. లేదా నిష్ప్రయోజనము కావచ్చును. సత్కవులైరేని వైరాగ్య సైనికులు కావచ్చును గాని కామసైనికు లెన్నఁడును గారు.

కామ : దేవా! నా సైనికు లందఱును నామమాత్ర సహాయులేయని నమ్మము. (భుజము చూపించుచు) దీని బలంబుచేతనే ముజ్జగంబులను జయించితిని.

(తెరలో)

దేవా ! జయము ! జయము ! మాధ్యాహ్నిక సంధ్య దేవరకు సుఖప్రద మగుఁగాక.

దేవే : కామ వైరాగ్యములారా, మీరు పొండు. స్వస్వ వ్యాపారములయం దేమరక కార్యములు సాధించుకొనుండు. మేమును సుధర్మా ధర్మాసనం బుడిగి గమ్యస్థానమునకుం బోవుచున్నాము.

(అని యందఱు నిష్క్రమింతురు)

ఇది శ్రీ తిరుపతి వెంకటేశ్వర విరచితంబగు సువర్ణ పాత్రికమను ప్రకరణంబున బీజారోపణంబను ప్రథమాంకము.

---



# జుత్తిగదేవుని ప్రతిష్ఠాత - చక్రకూటేశ్వరుని వేంగివిజయం?

శ్రీ జి. ఆర్. వర్మ

'కరవాల భైరవ మండపం' శీర్షికను 1969 ఏప్రిల్ భారతిలో ప్రచురించిన నా వ్యాసాన్ని విమర్శిస్తూ శ్రీ తురగా కృష్ణమూర్తిగారు 1970 జులై భారతిలో ఒకవ్యాసం వ్రాశారు—జుత్తిగ వాసుకీ రవిసోమేశ్వర ప్రతిష్ఠాపకు లెవరూ' అని.

తురగా వారు జుత్తిగ దేవుని ప్రతిష్ఠించినది నాగవంశ చక్రకూట సోమేశ్వరుడనీ, తన వంశం పేరిట, తన పేరిట, సహాయ్యుడైన చంద్రాదిత్యుని పేరిట ప్రతిష్ఠించెననే నిర్ధారణ చేశారు. అందుగ్గాను నాగులగూర్చి వ్రాశారు. జుత్తిగ దూతేశ్వరిలో బస్తరు దంతేశ్వరిని చూపించారు. శాసనాధారం చూపాలనే కావచ్చు 'కృష్ణపుర' శాసనం పేర్కొన్నారు. అందులో చక్రకూట సోమేశ్వరుడు 'కళింగ...వేంగీ' జయించుటలో వేంగిని దహించినట్లు స్వోత్కర్షగా చెప్పుకొన్నాడన్నారు. ఆ కాలం క్రీ. శ. 1065 తర్వాతిదన్నారు. జుత్తిగదేవుని ప్రతిష్ఠాపన క్రీ. శ. 1065–75 మధ్యకాలానిదన్నారు. కరవాల భైరవ మండప నిర్మాణకాలం క్రీ. శ. 1074 అన్నారు. వాసుకీరవిసోమేశ్వర ప్రతిష్ఠాపనవైనం చెప్పే శాసనం ఆలయం శిథిలమైనప్పుడు మరుగై యుండు నన్నారు. చక్రకూట సోమేశ్వరుని బిరుదుల్లో కొన్ని పేర్కొన్నారు. 'కృష్ణపుర' శాసనంలో ఏముందో నాకు తెలియదు. వారు వ్యాసానికి సంబంధించినంతవరకు ఆ శాసనభాగం ప్రకటించివుంటే నేనూ, పాఠకులూ సంతోషించే వారమే.

ఓనాడు ఏమీతోచక ఎవరినీ చెప్పీచెయ్యకుండా అత్తిలి ఆవలి నత్తారామేశ్వరం బైలుదేరాను. నత్తారామేశ్వరం దగ్గరే జుత్తిగ కూడా చూడమని రిక్షా డ్రైవర్ ప్రోత్సహించగా వెళ్లాను. చరిత్ర ప్రాధాన్యం గల జుత్తిగ గూర్చి అంతకుముందు ఏమీ ఎరుగను—గుర్తించాను. సెంట్రల్ గవర్నమెంటు ఎపిగ్రాఫిస్ట్, తమిళనాడు మ్యూజియం డైరెక్టర్‌గార్లపై ఆధారపడ్డానేగాని కరవాలభైరవ మండపంపైగాదు. ఆధారా లందజేసిన ప్రభుత్వోద్యోగు లిద్దరికీ కృతజ్ఞుడను.

ఏప్రిల్ 1969 'భారతి'లో వ్యాససందర్భంగా కరవాల భైరవ మండపశాసనం, వీరవిజయాదిత్యుని పాములవాక శాసనభాగం ప్రచురించాను. జుత్తిగలో నది గూర్చి వ్రాశాను. మండపశాసనం మండపనిర్మాణకాలానికే అచట వాసుకీరవిసోమేశ్వరుడున్నాడంటే వేరొకరు ధ్రువీకరణం చేయనక్కర్లేదు.

ప్రతిష్ఠాత లెవరో నాకు అంతుదొరకలేదు. సర్ప, సూర్య, చంద్రారాధన బహు పురాతనంగా వ్యాప్తిలో ఉందంటునే పరిశోధకుల భావాలు తెలియడానికి నా సహజ ధోరణిలో వ్యాసాంతాన ఒక ప్రశ్న వదిలాను. నన్ను నే సమర్థించుకునే యత్నం, ఏదో సిద్ధాంతాన్ని వెలార్చే యత్నం, ఆ ముగ్గురిపేరిట ప్రతిష్ఠించారనుట అత్యంత సంభవ మనిపించాలమంటే నేనా వ్యాసంలో మరిన్ని విషయాలు వ్రాసివుండేవాడిని. నేను చరిత్ర పరిశోధకుణ్ణి కానందున పరిశోధకులచే చెప్పించాలనే నా భావం. సెప్టెంబరు 1969 పూర్వం నే నెన్నడూ ఏ రంగాన డోలాయమానసుణ్ణిగాలేను. తురగా వారి నిర్ధారణ నాకు

సంతృప్తికరంగా లేదు. ఆ మాత్రం 'మేనమామ పోలికలు' చూపాలంటే 'సరుకు' చాలా లభించ వచ్చును.

## జుత్తిగలో దంతేశ్వరి!

జుత్తిగదేవుని బస్తరురాజుకు ముడి పెట్టడానికి నాగులగూర్చి చాలా వ్రాశారు తురగావారు. నాగులు బహు పురాతన జనాంగం—దేశవ్యాప్తులు—ఇతర దేశాల్లోనూ ఉండేవారు. తలలు తరిగే నాగజాతివారిని ఈశాన్య సరిహద్దులనుండి ఇక్కడకు లాక్కురా నక్కర్లేదు. కర్ణాట చరిత్రలో 3, 4 నాగవంశీయ ప్రాంతీయ పాలకులున్నారు. సిందవాడి నాగవంశీయులు చక్రకూటంలో పాలకులైనారని పరిశోధకాభిప్రాయం. బస్తరు గిరిజనులగూర్చి తెలిసినంతైనా చక్రకూటాధిపులగూర్చి నాకు తెలియదు. వారు ఇతర పూర్వ సమకాలిక ప్రభువులవలెనే వంశము ధ్వజము రాజ్యము ఇచ్చిన (దేవి) పేర్లు చెప్పుకున్నారు.

బస్తరు దంతేశ్వరికి జుత్తిగ దూతికకూ సంబంధం కాన్పించదు. జుత్తిగ దూతిక చిన్న విగ్రహం సాలంకృతగా నున్నందునా, ప్రాముఖ్యం లేనందునా నేను ప్రత్యేకించి పరిశీలించలేదు. దంతేశ్వరి భూదేవి. బస్తరు రాజ్య రక్షక. ఉగ్రరూపం అనుకుంటాను. నాకూ వ్యాకరణానికీ 'సగమెరికె' కాని ఎంత పామర జన భ్రష్టోచ్చారణమైనా దంతేశ్వరి దూతేశ్వరియై దూతికగా మారదనే నమ్ముతున్నాను. తురగా వారి వ్యాసంలో చక్రకూటేశ్వరుడు దంతేశ్వరినే ప్రతిష్ఠించె నన్నారు. చక్రకూటేశ్వరులు శాక్తేయులు అనుకుంటాను. అది సరైతే దూతికయే దంతేశ్వరి అయ్యుంటే దూతికకు ఆ సోమేశ్వరుడు ప్రాధాన్యమిచ్చి వాసుకీరవిసోమేశ్వరుని రెండవ మెట్టులో ఉంచివుండేవాడు. వారి కుల — రాజ్య రక్షణ దేవతగదా — బస్తరు దంతేశ్వరిని జుత్తిగకు గంతు వేయించడం తురగావారి భావానికి బలకరం కావాలనేమో! జుత్తిగ, నత్తారామేశ్వరం శాసనాల్లో క్షేత్రనామం దుత్తిక. ఆ శబ్దమే జుత్తిగగా మారి యుండునుగాని దూతికేశ్వరి దంతేశ్వరి పేరిట మాత్రం గాదు. దూతికాదేవి గూర్చిన ప్రసక్తి ఆ ఆలయాల శాసనాల్లో లేదు. శాక్తేయ గాథల్లో దేవి (శక్తి) శివుని రాక్షసులవద్దకు దూతగాపంపి దూతిక అనే పేరిట ప్రసిద్ధి నొందెననీ యున్నది. కొందరి అభిమతం — ఈ సందర్భంలో శివుడుగాదు సృగాలం అన్నారు. దేవీ వర్ణనలో 'శివాశత (సహస్ర) నినాదినీ' అనివుంది. ఈ శివా అర్థం దేవి రాక్షస సంహార కాండలో వేయి లేక వంద నక్కలంత కఠోరంగా అరచెననే భావం. పూర్వమేగాదు నేటికీ అనాగరిక జనాంగంలో సంహారకాండలో ధ్వని ప్రాధాన్యం గుర్తింపబడే ఉంది.

'భారతి'లో వ్యాసంలో జుత్తిగదేవునీ, గణపవరం దేవునీ, శివుని రుద్రగుణం చూపే నొసట లొత్తగల లింగాలను వీరులు ప్రతిష్ఠించారన్నాను. చక్రకూట సోమేశ్వరుడూ వీరుడే. వీరులు విజయ చిహ్నంగాను, పూర్వపు భక్తులూ ప్రతిష్ఠించిన శివ లింగాలకు ఆ సమకాలీనంగా భార్యను ఏర్పరచలేదు. కతిపయకాలాన దేవీప్రతిష్ఠ జరిగెను. వేంగీ చాళుక్య కులదైవం దక్షారామ భీమేశ్వరుడికీ అంతే. జుత్తిగలో క్రీ. శ. 13 శతాబ్దంలో ఉమాదేవిని (కృష్ణశిలా విగ్రహం) ప్రతిష్ఠించినట్లు శాసనం ఉంది. క్రీ. శ. 1065—76 మధ్య వాసుకీరవిసోమేశ్వరుని ప్రతిష్ఠించివట్లు నిర్ధారణచేసి ఆ రాజే దంతేశ్వరినీ ప్రతిష్ఠించగా దూతేశ్వరియై, దూతిక అయిందన్న తురగా వారెలా కొండగుర్తు శాసనాధారం ఎరుగరేమో? చాళుక్యచంద్ర చాళుక్యనారాయణ శక్తివర్మ (క్రీ. శ. 999—1010) దంతేశ్వరిని ప్రతిష్ఠించె ననబడిన చక్రకూట సోమేశ్వరునికి అర్ధశతాబ్దం పూర్వుడు—పఖబ్రు శాసనంలో జుత్తిగనే 'దుతిక'గా చెప్పినాడే—దంతేశ్వరికీ—దూతేశ్వరికీ లంకె వేసిన తురగా వారు ఆలోచించాలి!

## కరవాల భైరవ మండప నిర్మాణకాలం?

వీరవిజయాదిత్యుడు పరగండ భైరవ బిరుదాంచితుడైన వేంగీ చాళుక్య రాజరాజును మొదటి

సారి ఓడించి వేంగీశ్వరుడైనప్పుడే కరవాలభైరవ బిరుదాంకితు డైనాడని నా నమ్మకం. సహజం. ఆ గెలుపుకే విజయచిహ్న నిర్మాణం. వేంగీ చాళుక్యుల్లో, సమకాల, సమీపకాల రాజు లనేకుల్లో కరవాలభైరవ బిరుదాంచిత విజయాదిత్యుడు ఒక్క వీరవిజయా దిత్యుడు మాత్రమే కాబట్టి, ఆతడు మొదట వేంగీ శ్వరుడైనది క్రీ. శ. 1031 ప్రాంతాన కాబట్టి, క్రీ. శ. 1035 వరకూ పదస్థుడై యున్నాడు కాబట్టి, క్రీ. శ. 1035 ప్రాంతాన వేంగీ రాజ రాజుచే పదభ్రష్టుడైనందున మండప శాసనం అసం పూర్ణం అయిందనీ వ్రాశాను. కరవాలభైరవ బిరుదు దాల్చిన సమీపకాలాన్నే బిరుదుపేరున మండపనిర్మాణం (విజయచిహ్నం) చేయుటఅనే నా నమ్మకాన్నే బలపరు స్తారో బిరుదుదాల్చిన తర్వాత 40 ఏళ్ల. వరకూ ఆగి (క్రీ. శ. 1074) నిర్మించెనన్న తురగా వారి భావాన్ని సమర్థిస్తారో పరిశోధకులు!

వ్యాసానికి సంబంధించినంతవరకు — వేంగీ చాళుక్యులకు చోళసహాయం వేంగీ రాజరాజు కున్నట్లే, వీరవిజయాదిత్యునికి చాలాకాలం కళ్యాణి చాళుక్య సహాయమున్నది.

కరవాల భైరవ మండప శాసనంలో ఇచ్చిన కాలం 13 వ విజయరాజ్య సంవత్సరం. ఆ నా వ్యాసంలో విజయరాజ్య సంవత్సర గణన ఒకరాజు పోయిన కాలంనుండి కొందరూ, కొత్తరాజు వచ్చిన కాలంనుండి కొందరూ పరిశోధకులు లెక్కించారు అన్నాను.

విమలాదిత్యుడు వానప్రస్థుడైన క్రీ. శ. 1018—9+13 వ వి. రా. సం. కలిపితే క్రీ. శ. 1031—2 అగును. వేంగీ రాజరాజు రాజైనదీ ఆ కాలాన్నేగాని దాయాదుల యుద్ధాలు కారణంగా క్రీ. శ. 1021—2 పట్టాభిషిక్తుడై నాడు. ఈతని పట్టాభిషేక కాలాన్ననుసరించిన 13 వ వి. రా. సం. 1034—5 అగును. క్రీ. శ. 1035 వీరవిజయాదిత్యుడు పద భ్రష్టుడు. ఈ 13 వ వి. రా. సం. వీర విజయా దిత్యుని మొదటి పాలనా కాలానిదైతే క్రీ. శ. 1031 — 2+13 = క్రీ. శ. 1044—5 అగును. వీర విజయాదిత్యుడు వేంగీ రాజురాజు 12 సంవత్సరములు పాలించిన తర్వాత రాజ్యం గ్రహించి నట్లు ముత్తయభట్టు 'రికార్డు' పాములవాక శాసన భాగం ప్రచురించాను. ఈ లెక్కను వీరవిజయా దిత్యుడు మొదట వేంగీశ్వరుడైనది 1019+12=1031 లేక 1021—2+12=1033—4 అగును. కీ. శే. భావరాజు వేంకట కృష్ణారావుగారి లెక్కను వేంగీరాజరాజు ననుసరించిన వి. రా. సం. 10 లో వీరవిజయాదిత్యుడు వేంగీశ్వరుడైనాడంటే సరిగ్గా కీ. శ. 1031 అగును. మండప శాసనం అసంపూర్ణమైన కారణం—క్రీ. శ. 1035 లో వీరవిజయాదిత్యుని పదభ్రష్టతయే.

తురగావారు మండపనిర్మాణం క్రీ శ. 1074 అనుకోడానికి అవకాశం లేకపోలేదు. అది వీరవిజయాదిత్యుడు మరొకసారి వేంగీ సింహాసనాన్ని గ్రహించిన కాలం. అనగా అతనికుమారుడు (తండ్రిచే రాజుగా నేర్పరుప బడినవాడు) సమరైక భైరవ, సత్యాశ్రయ ఇమ్మడి శక్తివర్మ (క్రీ. శ. 1061—2) బట్టి ఏర్పడిన కాలగణనలో 1061—2+13 వి. రా. సం=1074—5 అగును. క్రీ. శ. 1062—76 వరకూ, ఈ ఇమ్మడి శక్తివర్మ వీరమరణానంతరం వేంగీశ్వరుడుగా నుండి ఎప్పుడో 40 ఏండ్లక్రితం కరవాలభైరవ బిరుదాంకితుడైయ్యుండీ, ఆ పేరిట మండపనిర్మాణం క్రీ. శ. 1074 లో చేసెనా ? క్రీ. శ. 1062—76 మధ్య నిర్మించి వుంటే మండప శాసనం అసంపూర్ణంగా వుండీ వుండదు; సరికదా మండపం సర్వాంగ శోభితంగా ఉండేది. కరవాలభైరవ మండపనిర్మాణం స్థిమితంగా జరిగిన సూచనలు మండపంలో కన్పించవు.

కరవాలభైరవ మండప నిర్మాణం క్రీ. శ. 1031 ప్రాంతానిదని నేను; కాదు క్రీ.శ. 1074 నాటిదని తురగావారూ వ్రాశాం. పరిశోధకుల 'ఓటు' ఎవరికో వేచి చూడాలి.

## చక్రకూటేశ్వరుని వేంగీ విజయం ?

తురగావారు పేర్కొన్న 'కృష్ణపుర' శాసనంలో ఏముందో నేను ఎరుగను. ఆ శాసనాధారంగా వారు చక్రకూట సోమేశ్వరుడు కళింగమును జయించి వేంగిని దహించె (జయించె) ననిరి.

చరిత్రలో వేంగి అనేక దహనకాండలు ఎరిగినదే—ఆధునికమైన 'స్కార్చ్‌డ్ ఎర్త్' పద్ధతివలె (ఓడిపోయినవారిది), పూర్వం దండెత్తి వచ్చినవారి దహనకాండ—యుద్ధతంత్రాల్లో వొకటి. కాగా వేంగికి మరోపేరు దగ్ధరాష్ట్రం. వేంగి వేగినాడై — కాలిపోయెను అనే భావంలో అనేక కథలు పశ్చిమ గోదావరిలో ప్రచారంలో ఉన్నాయి.

తురగావారు నిర్ణయించిన కాలం—క్రీ: శ. 1065—75 నాటి రాజకీయాలు, కాలమాన పరిస్థితులు కొద్దిగా చూదాం.

చక్రకూటేశ్వరులు చిరకాలం సామంతరాజులు. వేంగిలో చాళుక్య కుటుంబాలు (సర్వసిద్ధి, పిఠాపురం, రాజమండ్రి, నిడదవోలు) ఒకటికన్న ఎక్కువ ఉన్నట్లే చక్రకూటాన రెండు రాజకుటుంబాలుండుట పరిశోధకులు గుర్తించారు.

సామ్రాజ్య స్థాపనధ్యేయులైన చోళుల—కళ్యాణి చాళుక్యుల చిరకాల వైరంలో ఇరుగు పొరుగు రాజ్యాలు పాల్గొనవలసి వచ్చెను. వేంగీ విజయానికి, వేంగీ రక్షణకు పరిసరరాజ్యాలు (బఫర్) అండఅడ్డా ఉండాలి. పూర్వం సామంతరాజులు ఏ ఎండకా గొడుగు పట్టడమో, గోడమీది పిల్లివలె పొంచియుండుటో, విజయం వరించబోయేరాజు, లేక బలమైనరాజు పక్షంలో ఉండడం, అది రాజు బలహీనుడైనా, మరో బలమైనరాజు సహాయాన్నో సామంతరాజులు స్వతంత్రం ప్రకటించుకోడం జరిగింది.

వేంగిలో, వేంగీతరప్రాంతాల్లో గూడా తెలుగు చోడ సామంతరాజులు కుంతలచాళుక్య హితులు. సిందవాడినుండి వెళ్ళి చక్రకూటంలో రాజులైనవారూ హితులే—చక్రకూటానికి పశ్చిమాన సరిహద్దుల్లోవున్న అనుమకొండ, కొరవి, సబ్బిసాయిర మండలాలు కుంతల చాళుక్య సామంతరాజ్యాలు. రాజనీతిలో హితులే అహితులు కావడం వింతగాదు.

చక్రకూటరాజ్యం నేటి బస్తరు దక్షిణభాగం—అనగా ఇంద్రావతీనది దిగువ దక్షిణభాగం. వీరికి తూర్పున కళింగము, దక్షిణాన వేంగీ రాజ్యాలున్నవి. పశ్చిమాన నాటి కొరవి, అనమకొండ, సబ్బిసాయిరాలున్నాయి.

క్రీ. శ. 11 వ శతాబ్దంలోగూడా వేంగిపై దండయాత్ర చేయాలంటే తూర్పున తెలంగాణా, కళింగము, రాయలసీమమీదుగా సైన్యాలు రావాలేగాని నేటి రైల్వే, రహదార్లంత దగ్గరదారి కాదు. చక్రకూటరాజ్యం, కుంతల చాళుక్య సామంతరాజ్యాలు (తూర్పు తెలంగాణా) కళింగరాజ్యాలు వేంగికి చేరువగా నున్నవి.

చక్రకూట రాజుల్లో సోదరు లిద్దరు వెంగీ యువరాజు (కులోత్తుంగ చోళ) రాజేంద్ర చోడుని సైన్యాల్లో ఉండి యుద్ధాల్లో మరణించినట్లు పరిశోధకాభిప్రాయం.

నాటి వేంగీశ్వరుని క్లిష్టపరిస్థితిని బట్టియో, మరేరాజు ప్రోత్సాహమనో, చక్రకూటేశ్వరుడైన జగదేకభూషణ ధారావర్షుడు-వేంగీ సామంతరాజు స్వతంత్రం ప్రకటించెను. ధారావర్షుడూ, పుత్రుడు సోమేశ్వరుడూ ప్రతాపశీలురు. ఈ సోమేశ్వరుడు దండయాత్ర చేయాలంటే పశ్చిమ గోదావరికన్నా తూర్పు గోదావరి (ఆ జిల్లాలోనే వీరవిజయాదిత్యుని మొదటి రాజధాని, చివరి రాజధానీ నగరాలున్నవి) జిల్లాసులువు.

క్రీ. శ. 1067 నాటికి ధారావర్షుడు సజీవుడు. స్వతంత్రం ప్రకటించుకొన్న ధారావర్షుని దండించేందుకు వేంగీ యువరాజు రాజేంద్రచోడుడు క్రీ. శ. 1059—60 ప్రాంతాల చక్రకూటానికి వెళ్ళి అఖండ విజయంపొంది తిరుగు ప్రయాణంలో తండ్రి మరణవార్త విన్నాడు. తర్వాత చోళసింహాసనానికై నిత్యయుద్ధాల్లో మునిగినాడు. ధారావర్షుని అంతకుముందు త్రైలోక్యమల్ల సోమేశ్వరుని సేనాను

లిద్దరు చెరివొకసారి దండించి వచ్చిన చరిత్ర ఉన్నది. నాటి వేంగీశ్వరుడు వీరవిజయాదిత్యుడు. చక్రకూట సోమేశ్వరు డెత్తి వచ్చుటకు అనువైన పరిస్థితులే క్రీ. శ. 1062 తర్వాత. తండ్రితనయు లుద్ధతులే.

తురగావారు పేర్కొన్నట్లు విజయాలు (కృష్ణపురశాసనం)—మొదట జయించినది కళింగ మైతే చక్రకూటేశ్వరుడు కళింగం మీదుగా వేంగికి వచ్చెననుకోవాలి. వేంగి కుత్తరానగలవారట్లు చేయడం రాష్ట్రకూటుల నాటినుండీ ఉన్నది. క్రీ. శ. 1065—75 మధ్య కళింగభూపతులు అనంత వర్మ ఇమ్మడి వజ్రహస్తదేవుడూ (1033—70), దేవేంద్రవర్మ రాజరాజు (1070—77). ఈ తండ్రి కొడుకు లిద్దరూ సామాన్య వీరులుకాదు. వేంగికి మిత్రులుకారు. అలాంటి సందర్భంలో చక్రకూటే శ్వరుడు దండెత్తుట, జయించుట సాధ్యమా? కళింగ భూపతి ప్రోత్సాహాన్నే వేంగిపైకి వచ్చెనంటే కళింగాన్ని జయించినట్లు చెప్పకోడం ప్రగల్భం అవుతుంది. పై కళింగరాజు లిద్దరూ వేంగీశ్వరులతో చాలసార్లు పోరినవారే.

చోళులకు గంగైకొండచోళ రాజేంద్రచోళుని (క్రీ. శ. 1012—43) నాటికే చిత్రకూటం శత్రురాజ్యం అయినది. బావమరది విమలాదిత్యుని వేంగీశ్వరునిగా నిలుపుట సందర్భంగా వైరం. కళ్యాణిచాళుక్యులకు సహాయకారిగా నున్న చక్ర కూటాధీశుని ఈ రాజేంద్రచోళుడు దండించెను. ఈతని చరమకాలం క్రీ. శ. 1061.

కళ్యాణి చాళుక్య సోమేశ్వరుడు యువరాజుగా వుంటూనే పట్టాభిషిక్తుడై పాలించిన (క్రీ. శ. 1044—68) కాలానికిముందు పుష్కరాన్నుండీ మహావీరుడుగా ప్రసిద్ధ కెక్కినాడు. ఇతని తండ్రి జగదేకమల్ల ఇమ్మడి జయసింహుని (క్రీ. శ. 1014—42) నాటికే చక్రకూటరాజ్యం కీలక స్థానానికి చేరెను. త్రైలోక్యమల్ల సోమేశ్వరుని దండనాయకులు రెండుసార్లు చక్ర కూటాధీశుని శిక్షించినారు. ఒక దండనాయకునిపేరు నాగవర్మ. నాటి చక్రకూటాధీశుడు ధారావర్షుడు. కళ్యాణి చాళుక్య సోమేశ్వరుని సామంతుడైన కాకతి ప్రోలరాజు క్రీ. శ. 1067 ప్రాంతాల్లో చక్రకూటాన్ని జయించెను. అది ధారావర్షుని చరమకాలం కావచ్చును. త్రైలోక్య మల్లుడూ రుజాగ్రస్తుడై మనఃక్లేశాలలో వున్నాడు.

పూర్వం చిన్న చిన్న రాజులుకూడా శత్రురాజుల పేర్లు తను సామంతుల కుంచుట, శత్రురాజుల బొమ్మలునుంచి ఉమ్ముట చరిత్ర ఉంది.

త్రైలోక్య మల్ల సోమేశ్వరుని సామంతుడైన శోభనరసునే వేంగీశ్వరు (రాజరాజు) డనెను. కుమార సోమేశ్వరునీ (భువనైక మల్ల ఇమ్మడి సోమేశ్వరుడు క్రీ. శ. 1068—76) అట్లే పిల్చెను. వేరొక సామంతుడు సిందవాటి మండలేశ్వరుని కాంచీపుర వరేశ్వరుడనెను. త్రైలోక్యమల్లుని కనిష్ఠ (చతుర్థ) పుత్రునిపేరు విష్ణువర్ధన విజయాదిత్యుడుగా కొందరు పరిశోధకులు గ్రహించినారు. వేంగి వీరవిజయాదిత్యుడు త్రైలోక్యమల్ల సోమేశ్వరునిపుత్రునిగా చెప్పకోడంలో 'అంకకాడు' అర్థం చెప్పారు పరిశోధకులు. శేతవిజయాదిత్యుడుగూడా వేంగీశ్వర విష్ణువర్ధన విజయాదిత్యుడు—కొంతకాలం త్రైలోక్య మల్లుని సైన్యాల్లో ఉండెను.

చోళరాజు శాసనాల్లో చోళ రాజరాజు (క్రీ.శ. 985—1013) మొదలు వేంగిని జయించకున్నా జయించినట్లు, రాజుల పదస్థుల చేసినట్లు చెప్పకొన్నాడు. విమలాదిత్యునికీ, వేంగి రాజరాజుకూ సహాయం జరిగెను. ఉదాహరణకు వీరరాజేంద్రుడు వీరవిజయాదిత్యుని వేంగిలో పదస్థునిగా చేసినట్లు చెప్పకొనెను. వీరరాజేంద్రుడు వేంగి యువరాజు రాజేంద్రచోళునీ, కళ్యాణి చాళుక్య హితుడైన వీరవిజయాదిత్యుల నణచి వేంగిని చోళసామ్రాజ్యంలో కలుపుకో నిశ్చయించిరాగా—ఆపద్ధర్మంగా గావచ్చును—కళింగ రాజరాజు (బహుశా క్రీ. శ. 1067) బణపతి యను సేనానితో కదిలివచ్చి వీరవిజయాదిత్యునికి బాసటగా

నిల్చెను. వీరరాజేంద్రుడు గత్యంతరములేక కళింగ రాజ రాజునకు కుమార్తె రాజసుందరినిచ్చి పెండ్లిచేసి, వీరవిజయాదిత్యునితో సంధిచేసుకొనెను.

కళ్యాణిచాళుక్య - చోళసామ్రాజ్య కాంక్షల్లో వేంగిరాజ్యము గాయపడుటతో తనకు హితులైన కుంతల చాళుక్యరాజు సైన్యాలతో కూడ వీర విజయాదిత్యుడు పోరవలసి వచ్చెను.

వీరవిజయాదిత్యు డనేక యుద్ధములు చేసిన వాడు. వేంగి రాజరాజుతో, చోళసైన్యాలతో, కుంతల చాళుక్యసేనానులతో, కళింగరాజులతోనేగాక, హితు డుగా కళ్యాణిచాళుక్యరాజుల యుద్ధాల్లో బాసటగా పోరాడిన యోధానయోధుడు.

చారిత్రకంగా సముద్రగుప్తుని దిగ్విజయం నాటికే వున్నాయి—ప్రశస్తుల్లో ప్రగల్భాలు, అత్యు క్తులూ. అలహాబాదు ప్రశస్తిలో వేంగి హస్తి వర్మాదులను సముద్రగుప్తు డోడించినట్లున్నదిగాని నిజానికి వోడించలేదు.

పోతే—పూర్వం వోడిపోయిన రాజుల బిరుదు నిశానీలు గెల్చిన రాజు లుపయోగించుకున్నట్లే విజయుడైన వాని సామంత సేనానులూ వాడు కొన్నారు. విజయుని సాహసచర్యలు తమ కాపాదించు కొన్నారు.

కుంతలచాళుక్యహితుడు వీరవిజయాదిత్యుడు కథాకాల సమీపకాలాన్నే కుంతలచాళుక్య సైన్యాలను వోడించిన వైనం—తానెవరికి బాసటగా నిల్చి పోరాడెనో అట్టి కుమార విక్రమాదిత్యుని (త్రిభువనమల్ల విక్రమాదిత్యుని (క్రీ. శ. 1076—1126) సేనాని నోడించియుండెను. వేంగిరాజ్యాన్ని తమ సామ్రాజ్య భాగంగా చేసుకునే యత్నాల్లో, తమతమ వైరానలంలో వేంగిని ఇంధనం చేసిన కుంతలచాళుక్య చోళ సైన్యా లతో వీరవిజయాదిత్యుడు పోరాడెను.

త్రిభువనమల్ల విక్రమాదిత్యుని కాలపు తెలంగాణా శాసనాల్లో '(ఆవంచ) నొకదానిలో' 'బేంగీశ వంశవన దవదహన' అనే ప్రశంస ఉన్నది. కుమారవిక్రమాదిత్య చోళవీరరాజేంద్రులకూ వేంగి కుమారవిక్రమాదిత్య సేనాని వీరవిజయాదిత్యులకు జరిగిన వేంగి యుద్ధాల్లో చక్రకూట సోమేశ్వరు డున్నాడా?

ఆ సమీపకాలాన్నే వీరవిజయాదిత్యుడు కుంతల చాళుక్య సోమేశ్వరునికి బాసటగా గంగవాడి, నోళంబ వాడి రక్షణలో నుండెను. నన్నయభట్టు, వానస నారాయణభట్టు వినతిపై వేంగిరాజురాజును త్రైలోక్య మల్ల సోమేశ్వరుడు వేంగీశ్వరునిగా నుండ ననుమతించుట (ఆంధ్ర మహాభారత రచనాకాలం) రాజనీతిగా పరిశోధకులు గుర్తించిరి. అప్పుడు వీర విజయాదిత్యుడు వేంగేతరరాజ్యాన్ని కుంతల చాళుక్య ప్రతినిధిగా పాలించెను. వీరవిజయాదిత్యుని శాసనాలు బళ్లారి జిల్లాలోనూ లభించెనని పరిశోధకులనిరి.

త్రైలోక్య మల్ల సోమేశ్వరుని చరమకాలం క్రీ. శ. 1067. చోళ వీరరాజేంద్రుని వేంగి దండ యాత్రలు (క్రీ. శ. 1062—70) ఆఖరైనవి. వేంగి కుమార రాజేంద్రుడు కులోత్తుంగ చోళుడై చోళ చక్రవర్తి (క్రీ. శ. 1070—1118)గా పాలించెను. ఇతని పుత్రుడు వీర విజయాదిత్యుని యనంతరం (1076 ప్రాంతం) వేంగిలో చోళరాజు ప్రతినిధిగా (క్రీ. శ. 1077) వేంగి నేలెను.

పూర్వ యుద్ధతంత్రాల్లో నేడు ఉన్న 'క్విస్లింగ్స్, ఫిఫ్త్ కాలమిస్ట్' చర్యలూ, పౌర జీవనం స్తంభించే పనులూ, అరాచకము అడ్డంకులు కన్పించే వున్నాయి.

చక్రకూట సోమేశ్వరుడు ఒకానొక బలమైన రాజు పక్షాన వేంగిదహనం చేయడమో, వేరొకరాజు సైన్యాలతో వచ్చియుండుటో జరిగాలి కాని తానై చక్రకూటేశ్వరునిగా వేంగిదహనంచేయటం, జయిం చడం సాధ్యమా ?

ఈ చక్రకూటేశ్వరుని బిరుదావళి నిచ్చారు తురగావారు. ఆ బిరుదావళి స్వతంత్ర రాజులందరికీ పూర్వ సమకాలికం—సార్వ రాజనంగా ఉందేగాని ప్రత్యే

కతలేదు సరికదా, ఏమాత్రం వేంగీవిజయాన్ని సూచించదు. కృష్ణపుర శాసనపాఠం తెలియకుండానే వ్రాస్తున్నాను. వేంగీశ్వరులకు మాత్రమేగల సర్వలోకాశ్రయ, విష్ణువర్ధన, రాజమార్తాండాది బిరుదులుగాని, వీర విజయాదిత్యునికి మాత్రమేగల కలియుధిష్ఠిర, కరవాలభైరవ, ముమ్మడి చాళుక్య భీమాది బిరుదులుగాని చక్రకూట సోమేశ్వరుని కున్నట్లు తురగావారు వ్రాయలేదు.

చక్రకూటేశ్వరు డేరాజు పనుపుననో, బహుశా కళ్యాణకటకాధీశ్వరుల (కుమార విక్రమాదిత్య) సైన్యాలతోనో వేంగికి వచ్చియుండెనా? మరొకవిషయం. చక్రకూట సోమేశ్వరు డోడించిన మరో దగ్గరి రాజు పేరు మధురాంతకుడు. వీరిద్దరి పేర్లలో నొకటి కళ్యాణిచాళుక్యులకు, రెండవది చోళరాజులకూ హితులనే సూచిస్తున్నాయి.

కేవల చక్రకూట సోమేశ్వరుడొక్కడే వేంగీదహనకారుడు లేక విజయుడై యుండునా ?

చిత్రకూటేశ్వరుడు— పేరులో, బిరుదావళిలో— పశ్చిమచాళుక్యుల కాశ్రితుడు. వేంగీదహనాది విషయాలు పశ్చిమచాళ్క్య జయసింహుని నాటినుండీ అనువంశికంగా వ్యవహరిస్తున్న బిరుదులు. ఆ చాళుక్య దండయాత్రల్లో పాల్గొన్న సామంతులూ, సేనాపతులు కూడా పశ్చిమ చాళుక్యరాజుల బిరుదులు వాడుట సర్వసాధారణ విషయము. పశ్చిమ చాళుక్య సోమేశ్వరుడు వేంగీచాళుక్య వీరవిజయాదిత్యునకు పగవాడుకాడు. చక్రకూట సామంత రాజకుటుంబాల్లో ఒకరు పశ్చిమచాళుక్యుల కాశ్రితులుకాగా మరొకరు చోళుల కాశ్రితులు. చోళులు, రాజరాజనరేంద్రుడు పశ్చిమ చాళుక్య, వీరవిజయాదిత్యులకు శత్రువులు.

## ప్రతిష్ఠాత లెవరు ?

వాసుకీరవిసోమేశ్వర ప్రతిష్ఠాత లెవరో తెలియక ఒక సందేహాన్ని యిచ్చాను.

తురగా వారా సమస్య పరిష్కరించినట్లుగా మేనమామ పోలికలు చెప్పేరకంగా ప్రతిష్ఠాత చక్రకూట సోమేశ్వరుడనే నిర్ధారణ చేశారు. ఈ చక్రకూటేశ్వరుడు ప్రతిష్ఠించినట్లు వేసిన (?) శాసనం ఆలయశిథిలాల్లో మరుగైనదన్నారు. అది సంభవమా ? ఆలయానివన్నీ శిలాశాసనాలు భద్రంగానే ఉన్నాయి. ఈ ఒక్క శాసనం మరుగైపోయినదంటే చిన్నప్పుడు చదివిన కథ—దాచబెట్టిన ఇనుము ఎలుక లెత్తుకుపోయా యన్నట్లుంది. తామ్రశాసనం లిఖింపజేశాడు; అదిశిథిలం అయ్యింది—అని తురగావారంటే కొంతగా కొంత కావచ్చు ననుకోవచ్చును.

క్రీ. శ. 11 వ శతాబ్దంలో అంతకు ముందు జరిగిన ప్రతిష్ఠాపనల వైనం శాసనాలుగా అనేక దేవాలయాల్లోలేవు. ఇందులో కొన్ని ఆలయాలు శిథిలం కాలేదు, కాగా నేటివలె ఫలానావారు శంకుస్థాపన చేశారు, ప్రారంభోత్సవం జరిపారు అన్నంత 'రెడీమేడ్' శిలాఫలకాల కాలంకాదది. ప్రతిష్ఠచేసిన శాసనాలు కొన్ని సందర్భాల్లో వేరొక తావున లభించినవైనం ఉంది.

శాసనాధారం లేనిచోట దేవుని పేరు బట్టే ప్రతిష్ఠాత లెవరో ఊహించాల్సిందే.

వీరులు విజయచిహ్నంగా ప్రతిష్ఠించినచోట అమ్మవారి ప్రతిష్ఠాపన అసాధారణం. వేంగీ రాజరాజ కలిదిండి యుద్ధంలో కర్ణాటకుల జయించి ప్రతిష్ఠించినది—కేవల రాజరాజేశ్వరునే. కొల్లేరు గోకర్ణలంకలో నున్నది గోకర్ణేశ్వరుడు మాత్రమే. అమ్మవార్లు తర్వాతికాలాన ప్రతిష్ఠింపబడిన విగ్రహాలు. ఇదే దక్షారామ భీమేశ్వరుని సందర్భంలో గూడా జరిగెను. అచట మొదట మాణిక్యేశ్వరి (దంతేశ్వరి) లేదు.

ఉభయ గోదావరిజిల్లాల్లో మాగాణి కోస్తా ప్రాంతాల్లో ధవళ శివలింగా లెక్కువగా ఉన్నాయి. తాడేపల్లిగూడెం తాలూకా గణపవరం (పద్మినీపురం)లో గూడా స్వర్ణేశ్వర ప్రతిష్ఠాత లెవరో తెలియదు.

జుత్తిగలోనేగాదు—వేంగీలో ఎక్కడ ప్రతిష్ఠించినా ప్రతిష్ఠాతలు వేంగీశ్వరులైయ్యుండాలే గాని దండయాత్రచేసి, దగ్ధంచేసి వెళ్లిపోయిన వీరులుగాదు.

కళింగ రాజులైతేనేమి చోళ, కర్ణాటక హితులైన వారేమి వేంగీ విజయానంతరం వేంగీశ్వరుల దైవాలకే ఆరాధవలు, అందుకు ఏర్పాట్లు (చాలా శాసనాధారం) చేసి వెళ్లారేగాని విజయచిహ్నంగా ఏ ప్రతిష్ఠాపన చేయలేదు. చేది యశఃకర్ణ దేవుడుగూడా ఆంధ్రాధీశు నంతటి వానిని జయించి భీమేశ్వరుని గొల్చి వెళ్లాడు. ఈ ఆంధ్రాధీశ్వరుడు సమరైకభైరవ ఇమ్మడి కీర్తి వర్మ (క్రీ. శ. 1061—2). తూర్పు గోదావరిలో రాజధాని. తండ్రి వీరవిజయాదిత్యుడు వేరొక రణ రంగంలో నుండగా, వచ్చిన చేదిరాజు నెదిరించి, విక్ర మించి వీరస్వర్గ మొందెను.

అదీగాక — దేవతాప్రతిష్ఠాతలు ఆలయ నిర్మాణం కావాలంటే నేటిలా అతిత్వరలో జరిగేపని కా దానాడు. కొన్ని సంవత్సరాలైనా పట్టవచ్చును. చక్రకూట సోమేశ్వరుడు జుత్తిగలో ప్రతిష్ఠాపన చేశాడన్నా, ఆలయ నిర్మాణం చేశాడన్నా వేంగిలో అతడెంతకాల మున్నాడు? తురగావారే చెప్పాలి.

ఉభయగోదావరుల మాగాణిప్రాంతాల్లో 'సోమే శ్వర' నామధేయంగల శివలింగా లెక్కువగానే ఉన్నాయి. దక్షారామం—కాకినాడ బస్సుదారిలో సోమేశ్వరం అనే గ్రామంకూడా ఉంది. సోమేశ్వరులందరూ ఎవరి పేరిటి వారు? ప్రతిష్ఠాత లెవరు ?

మంత్రి భీముడు, రాజు విష్ణువర్ధన రాజ మార్తాండ విజయాదిత్యుడు, హితుడు త్రైలోక్యమల్ల సోమేశ్వరుల పేరిట ప్రతిష్ఠితమైవదనేది నా వాదం. సమర్థించుకోడం జరిగివుంటే అప్పుడే మరింత వ్రాసి ఉండేవాడిని. జుత్తిగ లింగాన్నే (ఎప్పటినుండో తెలియదు) ఘుశ్మేశ్వర జ్యోతిర్లింగం అంటున్నారు. అదేపేరుగల శివలింగం మహారాష్ట్రలో ఉందనే వాడిని.

వేంగీ చాళుక్యులు సోమవంశీయులు. వంశం పేరిట సోమేశ్వరు డన్నారని ఎందుకనుకోరాదు? వీర విజయాదిత్యునికి చిరకాలం హితుడు త్రైలోక్యమల్ల సోమేశ్వరుడు. అతని తండ్రి జైనుడు. భార్య సుగ్గమ్మ కారణంగా శైవుడాయెను—ఇద్దరి సంతానం ఈ సోమేశ్వరుడు. ఈ రాజుపేరిటిదనే ఇంకా వ్రాసిఉండే వాడిని.

వీరవిజయాదిత్యునికి పశ్చిమగోదావరి బలమైన కేంద్రం. తల్లి ఆచంట మండలేశ్వరుడైన తెలుగు చోడుని తనయ కాబట్టీ, అత్తిలినాడూ, దుతిక సీమా ఆచంటకు రాజధానికన్నా దగ్గర కాబట్టి వీరవిజయాదిత్యునికే ప్రతిష్ఠాపకునిగా ముద్రవేసి ఉండేవాడిని.

రాజులు మారినప్పుడు మాన్యాలు, మండలాధి పత్యాలు మారినట్లే దేవునిపేర్లూ మారడం చరిత్రలో ఉంది. జుత్తిగలో వాసుకీరవిసోమేశ్వరు డనేపేరు ఏనాటిదో తెలియదు. అది కరవాలభైరవ మండప శాసనకాలంనాటి కున్నది. మొదటి శక్తివర్మ శాస నంలో పేర్కొన్న పూర్వం 'సలికేశ్వరనామ మహేశ్వ రాలయ' మన్న దీ 'దుతిక' వాసుకీరవిసోమేశ్వరుడై యుండునా? సలికేశ్వరునిలో చాళుక్యం విస్పష్టం.

కలి విష్ణువర్ధన, నరేంద్ర మృగరాజు విజయా దిత్యుడు (క్రీ. శ. 799—839) 12 సంవత్స రాలు వివిధ రణరంగాల్లో పోరి పొందిన 108 విజయాలచిహ్నంగా 108 శివలింగాలు ప్రతిష్ఠించిన వైన మున్నది. అందీ జుత్తిగ లింగ మొకటై యుండునా?

నేను 'నాగకుల' భీముని సందేహిస్తే తురగా వారు చక్రకూట వంశపు'నాగ' నిర్ణయించారు. నేను త్రైలోక్యమల్ల సోమేశ్వరుని సంబంధం నిర్ధారణ చేసివుంటే ఆ రాజుసేనాని ధారావర్షుని దండించిన నాగవర్మనూ పేర్కొని ఉండేవాడిని.

వేంగీ ధవళేశ్వర లింగ ప్రతిష్ఠాతలెవరో— వారే జుత్తిగ దేవుని ప్రతిష్ఠాతలయ్యుందురు కాని వారికీ 'వాసుకి' ఎలా అంటింది?

జుత్తిగ శాసనాల్లో కాకతి రుద్రమ్మ భీరం చాళుక్యవీరభద్రుని మంత్రి విష్ణువు 'వాసుకి' ప్రతిష్ఠిత మన్నాడు.

పాముగూర్చి విశ్వవ్యాప్తంగా అనేక ఆరాధనలు ' విశ్వాసాలు వుండుట అతిప్రాచీనమైన (చారిత్రకంగా) సుమేరియన్ల నాటినుండీ ఉంది. ఆకాశంపై తేజః పుంజాల్లో గూడా కాల్పనికంగా పాముల జూచారు.

## జుత్తిగ దేవుని ప్రతిష్ఠాత—చక్రకూటేశ్వరుని వేంగీ విజయం?

జుత్తిగ శాసనాల్లో గూఢస్తని (నేడు గోస్తని, గోస్తనది) నాడు జీవనది. 'కరవాలభైరవ మండపం' సచిత్ర వ్యాసంలోనే వ్రాసాను. జీవనదులన్నీ పవిత్రం — అన్నిటినీ గంగ (గోదావరీ, వంశధార) అన్నారు. పోతే గిరిజనుల్లో గంగలో జలకమాడి గర్భం దాల్చి (సద్యోగర్భ)న కథలున్నట్లే చారిత్రక కర్ణాటక గాంగుల (జాహ్నవేయులు) చరిత్రలో రాణి గంగలో స్నానంచేసి గర్భిణి యైనట్లున్నది. నీరు, సృష్టి, గర్భరక్షణాది సందర్భాలు, సర్పప్రాధాన్య విశ్వాసాలు విశ్వవ్యాప్తంగా ఉన్నాయి. పుణ్యక్షేత్రాల్లో కోనేరుల్లో స్నానం చేయడం సంతానార్థుల ఆచారం నేటికీ ఉంది. పల్నాటివీరభారతంలో బ్రహ్మనాయుని భార్య ఐతమ్మ సంతానార్థియై చేసినపనుల్లో నాగతటాకాల్లో స్నానంచేయటం ఒకటి. కాశ్మీర్ ప్రాంతాల్లో (అనంతనాగ్) అదే పావిత్ర్యం ఉంది. నీటికీ—నాగ్‌కూ అంత సంబంధం ఉంది.

జుత్తిగ వద్ద (నత్తారామేశ్వరంలో గూడా) గూఢస్తని పవిత్రోదకం నమ్మకంలో పాము (వాసుకి) పేరులో చేరియుండెనా?

మరో సందర్భం. వేంగీశ్వరులలో రాజ నారాయణ దానార్ణవు (శక్తివర్మ, విమలాదిత్యుల తండ్రి)ని జంపి క్రీ. శ. 10 వ శతాబ్ద్యంతంలో చోళ సైన్య సహాయంతో శక్తివర్మ జయించేవరకు వేంగిశ్వరుడు జటాచోడభీముడు. తెలుగు చోళుడు. రాయలసీమనుంచి (కర్నూలు) వచ్చిన మేటి వీరుడు. అతని పాలనాకాలాన్నే వేంగీ చాళుక్యాభిమానులు ఆంధ్ర దేశము ఇరువదియేడు సంవత్సరము లనాయకముగా నుండెననిరి. ఇతడే కరికాలచోడ బిరుదాంచితుడు— మరో పేరు 'చోళత్రిణేత్రు'డని. సూర్య వంశీయుడు. అసాధారణ యోధుడు. ఇటు శ్రీకాకుళమునుండి చెంగల్పట్టు వరకూ ఏకచ్ఛత్రాధిపత్యం వహించిన కలియుగభీముడు. ఈతడు చోడత్రినేత్రుడు, కరికాల చోడుడు. రాయలసీమ ప్రాంతాల్లో నేటికి మూడవ కన్ను చూపుటకు దేవుని ఫాలతలాన లొత్త ఏర్పరిచి అందొక కెంపు ఉంచే ఆచారం ఉంది. తణుకు తాలూకా జుత్తిగ లింగానికీ, తాడేపల్లిగూడెం తాలూకా గణపవరంలోని శివలింగానికి నొసట లొత్త ఉంది. పూర్వం అందు కెంపు (మాణిక్యం) ఉంచేవారు. త్రిలోచన రూపగుణ ప్రదర్శన మిది. శివుని రౌద్రగుణ ప్రకటన. ఈ లింగాల ప్రతిష్ఠాత 'చోళత్రినేత్రు' డయ్యుండునా? ఇవన్నీ చక్రకూటేశ్వరుడు జుత్తిగలో వాసుకీరవిసోమేశ్వర ప్రతిష్ఠాత అన్నటువంటి మేనమామ పోలికల వంటివి.

జుత్తిగ దేవుని ప్రతిష్ఠాత లెవరో నిర్ణయించే బాధ్యత చరిత్ర పరిశోధకులది.

---



# ‘శ్రీ భగవానువాచ’

## శ్రీ పి. కేశవరెడ్డి

### 1

బజారువీధిలో జరుగుతున్న వింతలూ విడ్డూరాలను చూస్తుంటే రామదాసుకు గంటలు క్షణాల్లాగ దొర్లిపోగలవు. కాని ప్రస్తుతము అతనికి ప్రతి క్షణమూ ఒకయుగంలాగ విలువైనది. అందుకే అతడు పేవ్‌మెంటుమీద చకచక నడుస్తున్నాడు.

ఇక రెండు రోజులలో అతని కూతురు పెళ్ళి పీటమీద కూర్చోనున్నది. కన్యాదాతగా అతడు నిర్వర్తించవలసిన బాధ్యతలు అనేకము లున్నాయి. ఆ బాధ్యతలలో మొదటిది పెళ్లికి కావలసిన ఆర్థిక స్తోమతను సమకూర్చుకోవడం. బడిపంతులుగా పనిచేస్తూ రిటైర్యైయ్యేనాటికి రామదాసు బ్యాంకులో నిలువ చేయకలిగిన మొత్తం నాలుగువేలు మాత్రమే. బ్యాంకు అకౌంటును నాలుగువేలుదాక పెంచటానికి అతనికి ముప్పైఏండ్లు పట్టింది. ఆ మొత్తంలోని ప్రతిపైసా తన కష్టార్జితమే. తన కష్టార్జితం యావత్తును కూతురుపెళ్లికి వినియోగించాలన్నది అతడు చాలా ఏళ్ళక్రితం సంకల్పించుకొన్న ఆశయం. కూతురుపెళ్ళి ఈనాటికి కలసివచ్చింది. రామదాసు తన బ్యాంకు అకౌంటును పైసలతోసహా తీసేసుకున్నాడు.

ఓవర్‌బ్రిడ్జిమీద నడుస్తూ కుడిచేత్తో చొక్కాజేబును తడివి చూసుకున్నాడతడు. నాలుగు వేల రూపాయలతో జేబు బరువుగావున్నది.

అతనికి క్యాష్‌బ్యాగ్‌తో తిరిగే అలవాటు లేదు. యేడాదిక్రితం ఒకానొక స్థానికసంస్థ నడుపుతున్న లాటరీ టికెట్టును రూపాయపెట్టి కొన్నాడతడు. ఆ లాటరీలో విలువైన క్యాష్‌బ్యాగ్ ఒకటి ప్రయిజుగా వచ్చిందతనికి. ఆ సంచి శ్రేష్ఠమైన జంతుచర్మంతో సీమలో తయారుచేయబడి దిగుమతి అయిందట. ముచ్చటైన డిజైన్‌తో అది చాలా అందంగా ఉండేది. ఐనా క్యాష్‌బ్యాగ్‌ను చంకన యిరుకించుకొని బస్టాండులో, రైల్వేస్టేషనులలో నిలుచోవాలంటే అతనికి అదోలాగ ఉండేది. ఒకకొయ్యపెట్టెలో దానిని పడేసి చాలారోజులు మ్రగ్గనిచ్చాడు. ఇటీవల జీవితభీమాఏజెంటుగిరి వెలగబెడుతున్న తన పూర్వవిద్యార్థి ఒకడు పెళ్లి చేసుకుంటూ ఉంటే ఈ క్యాష్‌బ్యాగ్‌ను తీసుకెళ్లి ఆ పెళ్లికొడుక్కు ప్రెజెంటేషన్‌గా ఇచ్చుకున్నాడు రామదాసు.

క్యాష్‌బ్యాగ్ కాదుగాని, చిన్న మనీపర్సును తీసుకువెళ్లే అలవాటు రామదాసుకు కద్దు. కానీ ఉదయం గ్రామంనుండి బయలుదేరుతున్నపుడు చొక్కాజేబులో పర్సుఉన్నది లేనిది తను చూసుకోలేదు. పెళ్లివారింట హడావిడికి తక్కువా? ఆ హడావిడిలో బయలుదేరుతున్నపుడు అతనికి పర్సు తీసుకోవాలన్న స్పృహ లేకపోయింది. బ్యాంకులోనుండి తీసిన రూపాయనోట్లను అలాగే జేబులో వేసుకున్నాడతడు.

కుడిచేతి వేళ్ళతో జేబును రొమ్ముకేసి అదిమిపెట్టాడు రామదాసు. ఐనా జేబు కొట్టవచ్చినట్లు ఉబ్బెత్తుగా కనిపిస్తోంది.

తనచొక్కా ముతకనూలులో నేయబడినదైనందుకు అతడు సంతోషించాడు. అలాకాక ఆ చొక్కా ఏ టెర్లిన్ బట్టతోనో తయారు చేయబడిఉంటే జేబులోని రూపాయనోట్లు ప్రస్ఫుటంగా బయటకు కనిపించి బజారువీధిలోని జేబుదొంగలను రా రమ్మని

పిలిచిఉండేవి. అతని ముసలి ప్రాణాలకు ఉచ్చులు బిగించి ఉండేవి.

తన ప్రక్కలను వొరుసుకుని నడుస్తున్న గొట్ట్యాంపాంటు వాడిని అనుమానంగా వోరకంట చూస్తూ నడకవేగం హెచ్చించాడు రామదాసు. ఆ గొట్టంపాంటువాడు ముసలాయనను చాటు చేసుకుని అవతలవైపు పేవ్‌మెంటుమీద నడుస్తున్న పడుచు దాన్ని అనుసరిస్తున్నాడు. వాడిదృష్టి ముసలాయన జేబుపైన ఏ పరిస్థితిలోను పడదు.

రామదాసుమాత్రం కళ్లకు రంగుటద్దాలు తగిలించుకొని హైరానపడి పోతున్నాడు. అతనికి బజారు వీధంతా జేబుదొంగల మయమై పోయినట్లనిపిస్తోంది. వాళ్లంతా కామరూపులై ఎనిమిదిదిక్కుల నుండి తన జేబును కొట్టడానికి పొంచిపొంచి వస్తున్నట్లు భ్రమిస్తున్నాడు. అతనికళ్లు నిలకడలేకుండా కదులుతున్నాయి. అతనిదేహం చిరుచెమటకు లోనవుతూంది. అతనిమనస్సు భయ సందేహాలకు ఆలవాలమై పోతూంది.

రోడ్డుమీద కార్లు రేచుల్లాగ పరిగిడుతున్నాయి. సమయం ఆరుగంటలయిందని సూచిస్తూ సైరన్ మ్రోగడం ప్రారంభించింది.

ఊరిలో ఉండిఉంటే ఈపాటికి రామదాసు కరణంగారితో కలిసి చెఱువు గట్టుమీద షికారుకు బయలుదేరి ఉండేవాడు. శ్రీ వీరబ్రహ్మంగారి మఠంలో ఏడాది కొకసారి జరిగే దీపారాధనను చూడడానికి క్రమం దప్పక వెళ్ళుతూంటాడు—కరణం. మఠంలో తాను కన్నదీ విన్నదీ ఇతరులకు చెప్పడంలోనే కరణంగారు తన జీవితాన్ని వెళ్లబుచ్చేస్తూంటాడని రామదాసు అనుమానం. వాహ్యాళి వెళ్లిన ప్రతిసాయంత్రం మఠాన్ని గురించిన విశేషాలతో రామదాసును ఊదరగొడుతుంటాడతడు. 'ఎన్ని అద్భుతాలు! ఎన్ని మహిమలు!! ఏదని చెప్పను పంతులూ, ఏడుతరాల క్రితం ఒకనాడు బ్రంహంగారు వేపపుల్లతో దంతధావనం చేసుకొని ఆ పుల్లను పెరట్లో గ్రుచ్చాడట. అది పెరిగి పెద్దదై మహావృక్షమైయింది. ఆ — చెట్టులోని పుల్లలతో రోజూ దంతధావనం చేసుకున్నవాడిని ఏరోగమూ సమీపించదు' అన్నాడు కరణం ఒకనాటి సాయంత్రం.

'ఒక బ్రంహంగారి చెట్టేమిటి. వేపపుల్ల— అది ఏ చెట్టులోనిదైనా ఆరోగ్యదాయకమే. వేపపుల్లలో అమృతం ఉన్నదని వేదాలలో పేర్కొనబడింది!!' అన్నాడు రామదాసు.

కరణంగారు రామదాసువైపు గుర్రుగా చూస్తూ, 'మహానుభావుల లీలలను శంకించడమేగాని నమ్మడం చాతరాదు గదా నీకు' అన్నాడు.

సైరన్ మ్రోత ఆగింది. వీధిదీపాలన్ని దిగ్గున వెలిగాయి. మొట్టమొదటి సారిగ దీపాన్ని చూడగానే దానికి నమస్కరించడం రామదాసుకు అలవాటు. కానీ తను ప్రస్తుతం జనసమ్మర్దమైన వీధిలో నడుస్తుండడంవల్లనైతేనేమి తన పంచప్రాణాలు గ్రామంలో పెళ్లిసందడిలో అలరారే ఇంటిపైనే లగ్నమై ఉండడంవల్లనైతేనేమి సదరు చిల్లర అలవాటును అతడు—ఉల్లంఘించాడు.

తనను గ్రామానికి చేరవేసే రేణిగుంట రైలు అరున్నరకే స్టేషన్‌ను వదలుతుందని అతనికి చప్పున స్ఫురించింది. స్టేషను చేరడానికి ఇంకా మైలు దూరానికిపైగా నడవాలి. 'ఇలా నడచివెళ్లడం కన్న రిక్షా కట్టించుకుని వెళ్లడం మంచిదేమో' నని ఆలోచించసాగాడు రామదాసు.

రెండు కరెంటు స్తంభాలమధ్య, పేవ్‌మెంటు మీద అతడు నిల్చున్నాడు. అప్పుడే దీపంపురుగులు దీపంచుట్టూ ముసురుకుంటున్నాయి. ఆ పురుగులను కబళించడానికి చీకటిలో ఎక్కడో బల్లిఒకటి నక్కిఉంటుందను కున్నాడతడు. నాలుగువేల రూపాయల రొక్కంతో ఒంటరిగా రిక్షా ఎక్కడం సబబైన పని కాదనిపించసాగిం దతనికి. 'ఆ రిక్షావాడు స్టేషనుకు ఇదే దగ్గరదారి అంటూ రిక్షాను ఒకచీకటి సందులోకి పట్టించవచ్చు. ఈలవేసి తన తోడుదొంగను

తప్పించుకోవచ్చు. వాళ్ళిద్దరూ కలసి తన జేబును కొల్లగొట్టి తనను చితకబొడచి మునిసిపాలిటీ వారి మురుగు కాల్వలోకి నెట్టవచ్చు?

అతని కిరువైపుల ఉన్న విద్యుద్దీపాలు అతని తాలూకు నీడలను రెండింటిని సృష్టిస్తున్నాయి. ఆ నీడలను చూస్తూ కాసేపు ఆలోచించా డతడు. 'ఇలా ఆలోచిస్తూ ఉంటే ఆ చివరిరైలు కూడా తప్పిపోవచ్చు. దాంతో తా నీరాత్రి తలదాచుకోడానికి ఏసత్రానో లేక ఏపార్కునో లేక మూడవతరగతి ప్రయాణీకుల వైటింగ్‌హాలునో ఆశ్రయించవలసి ఉంటుంది. అప్పుడు చితకపొడవబడిన తనదేహం మునిసిపాలిటీ వారి మురుగుకాలువపాలుగావడానికి ఎక్కువ అవకాశాలుంటాయి.' చివరకు రిక్షాను పిలువడానికే నిశ్చయించుకున్నా డతడు.

ఆతడా నిర్ణయాన్ని తీసుకొన్న ఐదు నిమిషా లకుగాని రిక్షా లభించలే దతనికి. ఆట్టే బేరమాడ కుండా రిక్షాలో కూర్చొన్నా డతడు.

స్టేషను రోడ్డులో స్సైతం షాపులు, హోటళ్ళు, సినిమా థియేటర్లు పుష్కలంగానే ఉన్నాయి. కాని ఈ రోడ్డు బజారువీధిఉన్నంత సందడిగాలేదు. ఈ రోడ్డులోని గంభీరత రామదాసు మానసంలో ఒకింత ఉత్సుకత కలగజేసింది. ప్రతి హోటలుముందు జనం గుంపులుగుంపులుగా చేరి ఉన్నారు. వాళ్ళు హోటలువారి రేడియో చెపుతున్న వార్తలను తదేకదీక్షతో వింటున్నారు. వాళ్ళంత శ్రద్ధగా వింటున్న వింతలేమిటో తెలుసుకోవా లనిపించి దతనికి. కాని దాన్నిగురించి వాకబు చేస్తూ వుంటే రైలు అందదేమోననిపించి ఊరుకొన్నా డతడు. తాను కర్నాటక సంగీతాన్ని మాత్రం అంతశ్రద్ధగా వినగలడు. గ్రామంలోని యువకులు రచ్చబండమీద ట్రాన్సిస్టర్లును పెట్టి క్రికెట్ కామెంటరీని ఊపిరి వదలకుండా వింటూఉంటారు.

రోడ్డు ఏటవాలుగా ఉండటంవల్లనైతేనేమి, రోడ్డుమీద రద్దీ తక్కువగా ఉండటంవల్లనైతేనేమి రిక్షా మంచి స్పీడుతో పరుగెత్తసాగింది. ఇరు వైపుల చూపులు సారిస్తూ, రథంమీద నగరసందర్శ నార్థం బయలుదేరిన మహారాజులాగ కూర్చున్నాడు రామదాసు.

స్టేషను రోడ్డులోని ప్రతి మూడు షాపులలో ఒకటి బ్రాందీషాపు. లోపల వరుసలు వరుసలుగా అమర్చిఉన్న సీసాలు, అద్దాలద్వారా రోడ్డుమీద వున్న వారికి కనిపిస్తున్నాయి. అవి ప్రస్ఫుటంగా, ఆకర్ష ణీయంగా కనిపించేందుకు రంగు రంగుల దీపాలు వాని మీదకు ఫోకస్ చేసివుంచారు.

ఈ షాపులు ఆవిర్భవించడాన్ని మొదటిసారిగా చూసిన కరణంగారు, 'పంతులూ, ధర్మగోవు మూడు కాళ్ళు విరిగిపోగా వొంటికాలిపై నడుస్తూ ఉందని అందరూ అంటారుగాని నా కందులో ఏమాత్రం నమ్మకంలేదు' అంటూ రచ్చబండమీద రామదాసు ప్రక్కన చోటు చేసుకుంటూ కూచున్నాడు.

'ఏం. ఇప్పుడేమయింది?' అని అడిగాడు రామ దాసు, బహుశః ఇతడు కిస్తీ వసూళ్ళలో దొంగలెక్కలు రాశాడని రివిన్యూఇన్‌స్పెక్టరు నిందమోపి ఉంటా డని ఊహిస్తూ.

'అలా వెళ్ళి చూడవయ్యా. జనం కల్లు సారా లను మంచినీళ్ళలాగ తాగేస్తున్నారు. ఇకమీదట దేశం మీద మద్యనిషేధం ఉండరాదని చట్టంవేశారట. ఆ చట్టంప్రకారం ఆ దిక్కుమాలిన ద్రవపదార్థాలను తులసితీర్థంలాగా కళ్ళ కద్దుకొని త్రాగాలట. ధర్మ గోవు ఇంకా నడవట మేమిటయ్యా —సమాధి చేయ బడిందిగాని.' అనిచెప్పి ఆయాసం ముంచుకురాగా ఇంచుక ఆగాడు కరణం.

'మద్యపానం సృష్ట్యాదినుంచీ ఉన్నదేలేవయ్యా. దాని ప్రాముఖ్యతను చాటడానికి శాసనాలను వెయా ల్సిన అవసరమేమీ లేదు' అన్నాడు రామదాసు నింపాదిగా.

'ఏమిటయ్యా! సృష్ట్యాదినుంచి ఉండేది? మద్యపానం మహావ్యసనమని వేదాలు, ఉపనిషత్తులు చాటుతున్నాయి కావా.' అన్నాడు కరణం.

మేతకై అడవికివెళ్లి తిరిగివచ్చిన ఆలమంద కాలిగిట్టలతో రేపిన దూళినిమాస్తూ అల్లంత దూరానఉన్న మధ్యవయస్కు డొకడు వీరిద్దరి వాగ్వా దానికి శ్రోత అయ్యాడు.

రామదాసు కరణంగారి వైపు తిరిగి, 'కరణం గారూ! మీకు తెలియదేమోగాని—మన పూర్వులచే హేయమని, పాపమని ఛీకొట్టబడిన వ్యవస్థలు నేటి నాగరికతా ప్రపంచానికి శిరోధార్య మవుతున్నాయి' అన్నాడు.

'అలా కావడం శోచనీయంకాదా?' అన్నాడు కరణం.

'ఎంతమాత్రం కాదు. నలుగురికి ప్రయోజన కారికాని వ్యవస్థ కాలక్రమాన సమూలంగా నశించి తద్వ్యతిరేకంగా పనులు జరగడం తథ్యం. పురాణ కాలంలో శుక్రాచార్యుడు మద్యం సేవించినవారు పతితు లౌతారని శపించి ఉండవచ్చు. తనకూతురు పడుతున్న వ్యధవల్ల జనించిన తాత్కాలికోద్రేకంలో అతడలా శపించాడేగాని, అతనివాక్కును రానున్నతరాలవారు మన్నించ నవసరంలేదు.' అన్నాడు రామదాసు.

'మ్మరే అంతేగదా' అన్నాడు శ్రోత మరి కాస్త దగ్గిరగా జరుగుతూ.

కరణంగారు విసురుగాలేచి 'ఏం మనిషి వయ్యా నువ్వు. వేదాలు చదివానంటావు భగవద్గీత పారాయణ చేస్తానంటావు. ఇంకా బుద్ధి కుదర లేదు నీకు. నీ బడిలో చదువుకున్నవాళ్లు శుద్ధ వెధవలుగా తయారుకావడం ఖాయం' అంటూ తుండుగుడ్డను దులిపి భుజాన వేసుకొని వెళ్లిపో యాడు.

రామదాసు పురాణాలు చదివాడు. వేదామృతాన్ని గ్రోలాడు. భగవద్గీతను పారాయణం చేశాడు. అతనికి దైవచింతన కద్దు. పాపభీతికద్దు. అంతేకాదు అతడు మారుతున్న ప్రపంచాన్ని ఒకకంట గమనిస్తున్నాడు. కాలానుగుణ్యవర్తనలో అతడు వెనుకంజ వేయ లేదు. తనకు సంతోషాన్నిస్తూ ఎదుటివారికి హాని కలిగించని వ్యవస్థ ఏదైనాసరే—మతము, ఆచారము అంగీకరించినా మానినా—అనుసరణీయమేనని అతని నమ్మిక.

'బాబయ్యా అగ్గిపెట్టె ఉందా?' అనడిగాడు రిక్షావాడు.

'లేదురా అబ్బీ ఎందుకూ?' అనడిగాడు రామదాసు. బండిని రోడ్డుప్రక్కగా ఆపి క్రిందికి దిగుతూ, 'లైటు ముట్టించుకోవాలి. ఇంక రెండు ఫర్లాంగులలో పోలీసుఠాణావుంది. లైటులేకుండా వెళ్లితే నాకొడుకు అటకాయిస్తాడు' అన్నాడు రిక్షా కుర్రాడు. బీడి ముట్టించుకోవడానికై అగ్గిపెట్టె అడిగాడేమో ననుకున్నాడు రామదాసు. అలా అను కుని, 'ఈ దిక్కుమాలిన బీడీలు నీకెందుకురా అబ్బి, అసలే నీ ఆరోగ్యం అంతంతమాత్రంగా వుంది. ఈ బీడి, సిగరెట్లు కాన్సరు కలగచేస్తాయని డాక్టర్లు అంటున్నారు.' అంటూ ఓ సలహా పారేద్దామను కున్నాడు. అతడా సలహా ఇచ్చివుంటే రిక్షాకుర్రాడు 'ఆ డాక్టర్లు అలా అంటూనే రోజుకు అరడజను సిగరెట్టుపాకెట్లు ఖాళీ చేస్తుంటారు. దానికే మంటావు' అని అడిగి వుండేవాడు. ఆ ప్రశ్నకు రామదాసు నిరుత్తరుడై గుక్కిళ్లు మింగుతూ ఉండవలసి వచ్చేది.

రోడ్డుప్రక్కన సినిమాటాకీసు ముందున్న బడ్డీవద్ద రిక్షా కుర్రాడు అగ్గిపెట్టెను కొంటు న్నాడు. ఆ టాకీసు నిర్మాణ మేపాటిదోగాని లోపల నడుస్తున్న చిత్రం తాలూకు సంభాషణలన్నీ ప్రస్ఫు టంగా వీధిలోకి వినబడుతున్నాయి. అసలది సినిమా టాకీసేమిటి? నిన్న మొన్నటిదాక అది రైసు మిల్లుగా ఉండేది. యజమానికి మిల్లు ఏమాత్రం గిట్టుబాటుగా ఉండేదికాదు. దాంతో అతడు లోప లున్న యంత్రాన్ని తీసేసి గోడలకు రంగుల పెయింట్లు పూసి మరిన్ని వెంటిలేటర్లు, ద్వారాలు కొట్టించి నెలతిరిగేలోపల దాన్ని సినిమాటాకీసుగా తీర్చిదిద్దాడు.

టాకీసులోకి ఇవాళ క్రొత్తపిక్చరు వచ్చి

నట్టుంది. టాకీసు ముందర రంగురంగుల కాగితాల తోరణాలు రెపరెప లాడుతున్నాయి. టాకీసు ముందున్న పొగడచెట్లలో అమర్చబడి ఉన్న రంగు రంగుల నియాన్ దీపాలు మినుకు, మినుకు మంటు న్నాయి. చెక్కలతో చేయపడిన నాయకుని ముప్పై అడుగుల విగ్రహం ఠీవిగా నిల్చునిఉంది. అతని మెడలోని ఘనమైన పూలహారం అతని అభిమాన సంఘంవారు సమర్పించుకొన్న కానుకయి ఉంటుంది. తొలిప్రదర్శన ప్రారంభమయేముందు పూజావిధు లొనరించి అభిమానసంఘంవారు పగులకొట్టిన గుమ్మడికాయ తాలూకు బద్దలు ఇంకా నాయకుని పాదాలవద్ద పచ్చిగా పడివున్నాయి.

అగ్గిపెట్టెతో తిరిగి వచ్చాడు రిక్షావాడు. 'గాంధీవీధిలో మునిసిపాలిటీ దీపాలకు ఫ్యూజుపోయి మూడునెలలైనా పట్టించుకొనే నాథుడులేడు. రిక్షా ఒకటి లైటులేకుండా కనబడితే మాత్రం లైసెన్సు పీకేస్తామని, అపరాధం వసూలు చేస్తామని నానారకాల గోల పెడతారు!' అంటూ అగ్గిపుల్లగీచి లైటు వెలిగించా డతడు.

రిక్షా పరిగిడుతూవుంటే చలిగాలి రివ్వున రామదాసు ముఖంమీదకి వీచసాగింది. అతని ఊరు వైపుగా వెళ్లే ఆఖరుబస్సు ఐదుగంటలకే వెళ్లి పోయింది. ఇక అతడు ఊరుచేరడానికి ఆరున్నరగంట లకు బయలుదేరే రైలొక్కటే శరణ్యం. రిక్షాను మరికొంత వేగంగా పరిగెత్తించమని చెపుదామను కొన్నాడు. కాని అచ్ఛాదనలేని రిక్షాకుర్రాడి వీపు అప్పటికే చిరుచెమటకు లోనైఉండడం చూసి ఊరు కున్నాడు.

పోలీసుస్టేషను సమీపించగానే కుర్రాడు కావా లని బెల్లు గణగణ మ్రోగించాడు. స్టేషనుముందు ఒంటి కాలుమీద నిల్చునిఉన్న పోలీసు బెల్లువిని తలెత్తి చూసి, రిక్షాలైటు ఉండడంవల్ల చేసేదిలేక ఊరు కొన్నాడు. కుర్రాడు అలా ముందుజాగ్రత్త తీసుకో నట్లైతే ఈ పాటికి పోలీసువాడు విజిలు వూదుతూ వచ్చి తోడేలులాగ రిక్షాను కబళించి వుండేవాడు. లైసెన్సు నంబరు చెప్పమని, స్టేషనులోకి నడవమని బెదిరించి వుండేవాడు. కుర్రాడు తాను రైసుమిల్లు టాకీసులో రెండవఆట చూడడానికై ఉంచిన చిల్లర డబ్బులను జేబులోంచి తీసి అతడిచేతిలోపోసి తన ప్రయాణం కొనసాగించి వుండేవాడు. పోలీసు అదే పనిగా నవ్వుతూ చిల్లర డబ్బులను జేబులోపోసు కొని తనస్థానంలోకివెళ్లి నిల్చొని ఉండేవాడు.

తెల్లటి గౌను ధరించిన నర్సులు పావురాల్లాగ పేవ్‌మెంటుమీద నడచి వస్తున్నారు. వాళ్ల ఉనికిని బట్టి ఈ పరిసరాలలో ఏదో ఆస్పత్రిఉందని ఊహించ వచ్చు. బాండేజి కట్టబడిన కళ్లతోవస్తున్న రోగు లనుబట్టి అది కంటిజబ్బులను నయంచేసే ఆస్పత్రి అనికూడా గ్రహింపవచ్చు. స్టేషనురోడ్డు నేతాజీ రోడ్డును కలిసే కూడలివద్ద నెలకొనివుంది నేత్ర చికిత్సాలయం. అది కేంద్రప్రభుత్వంవారి ఆధ్వ ర్యాన నడపబడుతున్నదని దానిముందు రాయబడివుంది. స్టేషను రోడ్డులోని కట్టడాలలోకెల్ల అందమైనది ఈ ఆస్పత్రి భవనమే.

భవనంమీద సగానికి దించబడివున్న జాతీయ పతాకాన్ని చూడగానే ఉలిక్కిపడ్డాడు రామదాసు. 'జరగ రానిదేదో జరిగిపోయింది.' దేశనాయకు డెవడో కాలం చేసినట్లున్నాడు. అందుకేకాబోలు స్టేషను రోడ్డు పొడవుగా జనం, హోటళ్ల ముందు గుంపులు గుంపులుగాచేరి వార్తలను వింటున్నారు' అను కున్నాడు రామదాసు. స్వర్గాన్నలంకరించి ఉన్న ఆ పుణ్యాత్ముడెవరో తెలుసుకోవాలన్న ఉబలాటం అతనిలో అధికం అవసాగింది. పెళ్లి సంబరాలను సమకూర్చుకోవడంలో మునిగి ఉన్నందున గత రెండు దినాలుగ అతడు పేపరు చూడడంగాని, రేడియో వి డంగాని జరగలేదు. అంతకు క్రితం మంత్రివర్గంలో ఎవ్వరుగాని రోగం రొచ్చులతో తీసుకుంటున్నట్లు జ్ఞాపకంలేదు. అందరూ సంపూర్ణారోగ్యంతో వుండి విదేశయాత్రలలో, పుట్టినరోజు పండుగలలో జరుపు కుంటూ ఉండినవారే.

'అబ్బీ. ఉడిపిహోటలుముందు కాస్త ఆగు' అన్నాడు రామదాసు ముందుకు వంగుతూ.

ఏటవాలు రోడ్డుమీద గాలిపాటు తోడురాగా ద్విగుణీకృతమైన వేగాన్ని ఒక్కసారిగ అపుచేయడానికి రిక్షా కుర్రాడికి మనస్కరించలేదు. 'ఎందుకూ ఏదైనా కొనాలా?' అనడిగాడు వాడు రిక్షా తొక్కుతూనే. ఈలోగా రిక్షా ఉడిపి హోటలుని దాటేసింది.

'దేశనాయకులెవరో పోయినట్లున్నారు. కాస్త కనుక్కుందామని' అన్నాడు రామదాసు.

'దేశనాయకుడు పోయినవిషయం నీకెలా తెలుసు? కూర్చునే కలలు గంటున్నావా ఏమిటి?' అనడిగి అతనిని విసిగించలేదు కుర్రాడు. వాడు అలా అడిగిఉంటే రామదాసు చిరాకుతో, 'ఆగమంటే ఆగకుండా చొప్పదంటు ప్రశ్నలు వేస్తావేం' అంటూ అరచివుండేవాడు.

రిక్షా ఒక కిళ్లీ కొట్టుముందు ఆగింది. కొట్టుముందు బెంచిమీదున్న ట్రాన్సిస్టరు వార్తలు చెప్పడం ముగించి, విషాద సూచకమైన సంగీతాన్ని వినిపిస్తూఉంది. ట్రాన్సిస్టరు చుట్టూ గుమిగూడిఉండిన జనం వెనుదిరిగి నలువైపులకు చెదిరిపోతున్నారు. వాళ్లంతా హాస్యరసప్రధానమైన చిత్రాన్ని అప్పుడే చూసివచ్చినట్లుగ ప్రసన్న వదనులై ఉన్నారు. కొందరు వెడనవ్వులను, కొందరు చిరునవ్వులను వొలకబోస్తున్నారు. వాళ్ళలో ఏ ఒక్కరి ముఖంలోనూ విచారరేఖలు లేశమాత్రమైనా కానరావు.

ట్రాన్సిస్టరు ముందు సైకిలు నానుకుని నిల్చునిఉన్న యువకుని ఉద్దేశించి, 'అబ్బాయ్, ఏమిటి రేడియోలో విశేషాలు?' అనడిగాడు రామదాసు.

'ఆఁ— ఏముంది. మహానాయకుడు జపాను నుంచి తిరిగివస్తూ అరగంటక్రితం అకస్మాత్తుగ విమానంలోనే మరణించారట. అదే విశేషం.' అన్నాడు యువకుడు, సైకిలు హాండిలుకు బిగించిఉన్న అద్దంలో చూసి తన క్రాపును సరిచేసుకుంటూ. అద్దంలో అతనినీడ అందంగా కనిపించిందేమో అద్దాన్ని చూస్తూ సన్నగా ఈలవేశాడతడు.

పైజమా తొడుక్కుని బెంచిమీద కూర్చుని ఉన్నతను ట్రాన్సిస్టరును వొడిలోకి తీసుకుని, 'చచ్చినవాడెలాగూ చచ్చాడుగాని, ఇవాళ్టి సినిమా పాటల ప్రోగ్రాంను కాన్సిలుచేసి ఈ బోరు సంగీతాన్ని వినిపిస్తున్నారు. దీంతోబాటు జనమంతా ఏడవాలని వాళ్ల ఉద్దేశం కాబోలు' అంటూ సిలోన్ స్టేషనును ట్యూన్ చేశాడు.

మహానాయకుని 'మరణాన్ని గురించి మరికొన్ని వివరాలు తెలుసుకోవాలని ఉంది రామదాసుకు. ఆ నాయకుని ఆకస్మిక మరణానికి గల కారణాన్ని రేడియోవారు చెప్పలేదా?' అనడిగాడతడు.

ఒక దేశ నాయకుని మరణాన్ని గురించిన వివరాలను తెలుసుకోవడానికి ఇంతగా ఉబలాటపడుతున్న రామదాసును పిచ్చివాడిని చూసినట్లు చూశారు అక్కడున్న కొద్దిమంది జనం.

బెంచిచివర కూర్చుని ఉన్నతడు తన సిగరెట్టుకున్న మసిని షోగ్గా రాలుస్తూ, 'వేరేకారణ మేముంటుంది. ఇలాంటివారికి రాసిపెట్టిందల్లా ఒకేచావు. గుండె ఆగి చావడం. ఇప్పుడదే జరిగింది. ఇంకా వివరాలు కావాలంటే తొమ్మిదిన్నర గంటలకు ప్రసారమయ్యే వార్తలువిను. లేకపోతే రేపు పేపరు చదువు.' అన్నాడు.

'వాకబు చేసింది చాలు. ఇక వెడదామా?' అన్నట్లు అతనివైపు చూశాడు, రిక్షాకుర్రాడు. 'ఇక వెళ్లవోయ్' అంటూ సర్దికూర్చున్నాడు రామదాసు.

స్టేషనురోడ్డులో ఎత్తైన భవనా లన్నింటిమీద సగానికి దించబడిన జాతీయపతాకాలు కనబడుతున్నాయి. సగానికిదించబడి ఉన్నాగాని, అవి ఉల్లాసంగా రెప రెప లాడుతున్నాయి. మహానాయకుని మరణంపట్ల సంతాపం వెలిబుచ్చడం వాటికి ఇష్టంలేనట్లుంది' అనుకున్నాడు రామదాసు. చలిగాలి తాకిడికి అతని ముసలిశరీరం సన్నగ జలదరించ

సాగింది. ఇక కొన్నిగంటలలో మంచు కురవడం ప్రారంభమవుతుంది. అప్పుడు మంచు బరువుకు జాతీయపతాకాలు, రైసుమిల్లు టాకీసు ముందున్న కాగితపు తోరణాలు రెపరెపలాడడం మానివేస్తాయి.' అనుకున్నాడతడు.

**స్టేషనుముందు రిక్షా ఆగింది. రిక్షాకుర్రాడు** క్రిందికిదిగి సీటుమీద ఉండిన ఎర్రటిటవలును తీసి ముఖంమీదున్న చెమటను తుడుచుకున్నాడు. ఎడమ చేతో జేబును అదిమి పట్టుకుని జాగ్రత్తగా కిందికి దిగాడు రామదాసు. చిల్లర డబ్బులనుతీసి వాడిచేతిలో పెట్టి స్టేషనులోకి నడిచాడు.

౨

రేణిగుంట రైలు బయలుదేరడానికి యింకా పదినిమిషాల వ్యవధివుందని ప్లాట్‌ఫారం మీదున్న గడియారం సూచిస్తోంది తనను యింత తొందరగా స్టేషనుకు చేరవేసిన రిక్షాకుర్రాడిని మనసులోనే అభినందించాడు రామదాసు. వాని సహాయం లేకుంటే అతడింకా రైసుమిల్లు టాకీసు ముందు నడుస్తూండేవాడు. తీరా అతను స్టేషను చేరేసరికి రైలు బయలుదేరడానికి సిద్ధంగా వుండేది. పెట్టెలన్నీ ప్రయాణీకులతో క్రిక్కిరిసి వుండేవి. అతడు పెట్టెలోకి యెక్కడానికి ప్రయత్నించగా వాళ్ళు, 'జాగాలేదు, జాగాలేదు' అంటూ కాట్లకుక్కల్లాగ అరచి తరిమేసి ఉండేవాళ్ళు. చివరకు గార్డు పచ్చ జండా చూపుతుండగా అతడు సాహసించి ఓ పెట్టెలోకి ఎక్కగలిగి ఉండేవాడు. అక్కడున్న నలుగురిని బతిమాలుకుని ఫుట్‌బోర్డుమీద నిలుచుకోవలసివచ్చేది. అలా నిలుచుకోలేక అతని ముసలినడుము విలవిల్లాడిపోయేది.

బుకింగ్‌వద్ద జనం లేకపోవడం చూసి సంతోషము ఆశ్చర్యము జమిలిగా కలిగాయతనిలో. బుకింగు దగ్గర ఎనిమిదిబారల క్యూ ఉండడం పరిపాటి. క్యూలో ఉన్న ప్రతి ఒక్కడు తన వెనకనున్నవాడి డొక్కలో మోచేతులతో పొడుస్తూ ఉంటాడు. 'ఇవాళ రేణిగుంట రైలు లేటుగా బయలుదేరుతుందని ప్రకటించి ఉంటారు. అందుకే ప్రయాణీకు లెవరూ బుకింగుదగ్గర కానరావడంలేదు.' అనుకున్నాడు రామదాసు.

అతడు బుకింగువద్ద నిల్చున్నాడు. లోపల ఒక బట్టతల మనిషి పెద్దఫైలులో యేదో రాసుకపోతున్నాడు. సీలింగునుండి వ్రేలాడుతున్న విద్యుద్దీపం అతని బట్టతలమీద ప్రతిఫలిస్తూండగా చూస్తూ చాలాసేపు నిలుచున్నాడు రామదాసు. అతడెంతకూ తలెత్తక పోవడంతో విసుగనిపించిందతనికి. కుడిచేతి చూపుడు వ్రేలితో బుకింగు వద్దనున్న కొయ్యఫలక మీద చప్పుడు చేశాడు, రామదాసు. చప్పుడు విని బట్టతల పైకి లేచింది.

'రేణిగుంట రైలు యివాళ లేటుగా బయలుదేరుతుందాండీ' అనడిగాడు రామదాసు.

బట్టతల మనిషి ముఖం చిట్లించి చూచి 'ఎంక్వయిరీ అవతలి వైపున ఉందండీ' అన్నాడు. 'క్షమించండి' అంటూ ప్రక్కకు తప్పుకున్నాడు రామదాసు. బట్టతలమనిషి కోపంతోలేచి, కిటికీ కర్కశంగా కొయ్యఫలకను దించేశాడు.

ఎంక్వయిరీలో ఒకటికి రెండు బట్టతలలు మెరుస్తున్నాయి. వారిద్దరి చేతుల్లో కోకాకోలా బాటిల్సు వున్నాయి. ఇందాక వాళ్ళిద్దరూ ఒకరి కొకరు చక్కలిగింతలు పెట్టుకున్నారేమో గాని— యిద్దరూ పగలబడి నవ్వేస్తున్నారు. నవ్వుతుండగా వారి విశాలమైన బొజ్జలు విపరీతంగా కదలుతున్నాయి. ఆ పోకిళ్ళను చూచి వారి చేతులలోని ద్రవరాజంపై యించుక అనుమానం వేసింది రామదాసుకు. వాళ్ళ వికటాట్టహాసాలకు పైన తిరుగుతున్న పంకావూడి క్రిందపడినా పడవచ్చు అనుకున్నాడతను.

కిటికీ కవతల యెవరో మానవాకారం నిల్చొని వున్నట్లు గ్రహించారు వాళ్ళు. ఒకతను ముందుకు వంగి 'యస్‌ప్లీజు' అన్నాడు.

'ఇవాళ రేణిగుంటరైలు లేటా?' అంటూ యిందాకడిగిన ప్రశ్న మళ్ళీ అడిగాడు రామదాసు.

'లేటేమీ కాదు. ఇవాళ రైలు రాలేదు. ఎప్పుడు వస్తుందో తెలియదు'అన్నాడతను. రామదాసు గుండెలో రాయి పడింది.

కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళి ప్లాట్‌ఫారం మీదున్నబెంచీమీద కూలబడ్డాడతడు. రోజూ ఆపాటికి రైలులోని పెట్టెలన్నీ ప్రయాణీకులతో కిటకిట లాడుతూండేవి. బయలు దేరడానికి రైలు కూతవేసినప్పుడు లోపలనున్న తిరుపతి ప్రయాణీకులు 'గోవిందా—గోవిందా' అంటూ అరచేవారు. రైలు బయలుదేరాక వాళ్ళంతా రాగయుక్తంగా భజనలు ప్రారంభించేవారు. ఆ ఘోష భరించలేక రామదాసు కిటికీగుండా తల బయటపెట్టి 'అబ్బబ్బ దేశంలో జనాభా తగ్గించడానికి ఒకటే మార్గం వుంది. మే మాసంలో తిరుపతిపైన ఒక బాంబు వేస్తేసరి — జనాభాతగ్గి ఊరుకుంటుంది' అనుకునేవాడు.

దేశజనాభా ప్రశక్తి వచ్చినప్పుడల్లా కరణంగారు ఓ చోద్యం చెప్పేవాడు. 'శ్రీ మహావిష్ణువు వీరబ్రహ్మం అవతారాన్ని చాలించి వీరవసంతరాయులుగా జన్మించనున్నాడు. వీరవసంతరాయుల ప్రభావానికి పాపులంతా నశించిపోతారు. ఏడూళ్ళకు ఒక్క ఊరు, ఏడు మందలకు ఒకమంద మిగులుతుంది, అన్నాడొకసారి కరణం. అప్పుడు రామదాసు 'ఐతే నీ విషయమేమిటి ? నువ్వు పాపులలో లెక్కా ? పుణ్యాత్ములలో లెక్కా ?' అనడిగాడు. మచ్చలేని తనను అనుమానిస్తున్న రామదాసుపై రుసరుస లాడుతూ, 'నా విషయ మెలావున్నా, నువ్వుమాత్రం రౌరవ నరకాలపాలు కావడం తథ్యం' అంటూ శపించాడు కరణం.

రామదాసు తలపట్టుకుక్కూర్చున్నాడు. తను ఈ రాత్రి గ్రామంచేరడం కలలోని వార్త. ఈ రాత్రిని ఇక్కడనే వేగించడమన్నది తాను కలలోనైనా ఊహించలేని సాహసం. ఈ పట్టణంలో అతని బంధుమిత్రు లెవ్వరూ లేరు. అతని పూర్వ విద్యార్థులు కొందరు ఈ పట్టణంలోనున్న కళాశాలలో చదువుకుంటున్నారు. కాని వాళ్ళు హాస్టలులో ఉంటూ బుద్ధిగా చదువుకునే బాపతుకాదు. పట్టణం శివార్లలో ఉన్న ఓ మురికిపేటలో గది అద్దెకు తీసుకుని ఉంటున్నారట. ఈ అపరాత్రివేళ వెదుకుతూ వెళ్ళి ఆ గదిని కనిపెట్టడం చాలకష్టం. తీరా వెళ్ళినా వాళ్ళు తనను ఉచితరీతిని ఆదరిస్తారన్న నమ్మకం కూడా లేదు. ఓ సారి కరణంగారు వైద్యం చేయించుకునేందుకై ఈ పట్టణం వచ్చినప్పుడు ఓ కుర్రాడు తారసపడ్డాడట. కుశలప్రశ్నలయిన తరవాత కరణంగారు, 'అబ్బాయ్. ఈ భుజంమీద వాళ్ళేదో దిక్కుమాలిన ఇంజక్షన్ నేశార్రా. అప్పటినుంచి తలతిరుగుతూంది. నన్ను కాస్త నీ గదికి తీసుకెళ్ళు. కాసేపు పడుకుంటేగాని కుదుటబడేటట్టు లేదు' అనడిగాడుట. దాంతో ఆ కుర్రాడు పచ్చివెలగకాయ తిన్నవాడిలాగ ముఖంపెట్టి ఎట్టకేలకు కరణంగారిని తన గదికి తీసుకెళ్ళాడట. ఆ గదిలో తానుచూసిన పరిశుభ్రతను గూర్చి కరణంగారు ఎక్కువగా చెప్పలేదు గాని, అల్మారాలో అతనికి కనిపించిన రిబ్బను ముక్కలు, రబ్బరుగాజులు, ఆడపిల్లలు తలలో చెక్కుకునే పిన్నులు — వగైరాలు అతణ్ణి చాల కలవరపరిచాయట.

ప్లాటుఫారం దాదాపు నిశ్శబ్దంగా ఉంది. ఆ చివరనున్న ఇంజను ఆవిరి వదులుతూ ఒకసారి మూలిగి మళ్ళీ ఊరుకుంది. సిలిరంగుబట్టలు ధరించిఉన్న పోర్టను ఒకడు స్తంభానికి చేరగిలబడి కునికిపాట్లు పడుతున్నాడు. 'తనకు లభించవలసిన కూలిడబ్బులు పోయినందున ఆత డీపూట భోజనంచేసి ఉండడు' అనుకున్నాడు రామదాసు. తమ ప్రయాణాలు ఇట్లా అయిపోయినందుకు విచారిస్తూ అటూ ఇటూ తిరుగుతున్నారు—అక్కడున్నకొద్దిమందిప్రయాణీకులు.

సమయం ఏడుగంటలయినట్టు గడియారం

సూచిస్తూంది. రామదాసుకేమీ పాలుపోలేదు. అతని మెదడంతా కలగాపులగంగా ఉంది. ఏ నిర్ణయాన్నీ తీసుకోకుండా లేచి బయటకు నడిచాడతడు.

ప్రయాణాన్ని రద్దుచేసుకున్న ప్రయాణీకులు ఇంటిముఖం పడుతున్నారు. రామదాసు ఉద్దేశ్య రహితంగా నడుస్తున్నాడు. అతని నడక అసంకల్పిత ప్రతీకార చర్యలాగ ఉంది.

నిర్జనంగా ఉన్న పార్కులోనున్న రేడియో అవిరామంగా ఏడుపుసంగీతాన్ని వినిపిస్తూంది. మహానాయకుని మరణంపట్ల సంతాప సూచకంగా సృష్టించబడిన కృత్రిమమైన నిస్తబ్దత, నిస్తేజత పట్టణాన్ని ఆవరించింది. వీధులలోని షాపులన్నీ మూయబడి ఉన్నాయి. తలుపులకు ఇంతింత తాళాలు వ్రేలాడుతున్నాయి. రోడ్లమీద వాహనాలు నడవడం లేదు. ఫాక్టరీలు, కార్ఖానాలు మూయబడి ఉన్నాయి గనక వాతావరణం నిశ్శబ్దంగా ఉంది. ఈ వాతావరణం స్మశానాన్ని తలపింప జేస్తూంది. అతని కాళ్ళలోని కొయ్యచెప్పులు టక్కు టక్కుమని శబ్దం చేస్తూ నిశ్శబ్దాన్ని కొంతవరకు తొలగిస్తున్నాయి. ఆ చెప్పులను కరణంగారు బ్రహ్మంగారి మఠంవద్ద కొని రామదాసుకు కానుకగా ఇచ్చాడు. జనపనార సంచి నుండి చెప్పులజతను తీసి రామదాసుకు అందిస్తూ, 'వీటిని కళ్ళకద్దుకుని తొడుక్కో. నీకోసం ప్రత్యేకంగా పట్టుకొచ్చాను. చందనపు చెక్కతో చేసినవి.' అన్నాడు కరణం. అతనికి కృతజ్ఞతలు చెప్పకోవడానికి బదులుగా చెప్పులను వాసనచూసి, 'మరి వాసన రావడం లేదే' అన్నాడు రామదాసు. అతని కృతఘ్నతకు కరణంగారు నొచ్చుకుని, 'నీ ముక్కు పుచ్చిపోయిఉండాలి. లేకపోతే నీకు చందనపుచెక్క అంటే ఏమిటో తెలియకుండానైనా ఉండాలి. అవిమాత్రం అమోఘంగా వాసన నిస్తున్నాయి' అన్నాడు.

విద్యుద్దీపాలు ప్రసరిస్తున్నంతమేర తప్ప పట్టణాన్ని కారుచీకటి క్రమ్మివేసింది. ఆ చీకటిలో ఉన్నట్టుండి చింపిరి జుత్తువాడొకడు ప్రత్యక్షమయ్యేవాడు. వాడు చారలబనీను, మోకాలిమీదకు మడిచిన పాంటును ధరించి ఉండేవాడు. రామదాసు గుండె గుభేలుమనేది. అతని రోమాలన్నీ నిక్కబొడుచుకునేవి. అరికాళ్లలో చెమటలుపోసేవి.

'జయలక్ష్మీ కేఫ్' అన్న తాటికాయలంతేసి అక్షరాలను చూడగానే అతనిలోని ఆకలిపురుగు ఫీంకరించింది. మధ్యాహ్నమెప్పుడో బ్యాంకు కెదురుగావున్న ఆదేదో హోటలులో ఇన్ని మెతుకులు కొరికాడతడు. ఆ తిండి అతనికి బొత్తిగా సయించలేదు. ఇంట్లో ఉన్నప్పుడతడు ఒక్క కొత్తిమీర పచ్చడితోనే బ్రేవ్ మని త్రేన్పుగలిగేట్టు తినగలిగే వాడు. కొత్తిమీర పచ్చడి అంటే అతనికి ప్రాణం. కూతురునికని భార్య కన్నుమూయగానే అతడు వంటనేర్చుకోవడం మొదలు పెట్టాడు. కూతురు పెరిగి పెద్దదయేంతవరకు అతడు స్వయంపాకాన్నే భుజించాడు. ఆరంభంలో చాల కష్టపడ్డాడు. అన్నం చిమిడిపోయేది. కూరలు కషాయంలాగ తయారయ్యేవి. అవి అలా పాడైపోయినప్పుడు అతడు కరణంగారింటికెళ్లి శుభ్రంగా భోంచేసేవాడు. ఒక్కొక్కసారి అతడు వంటచేయడంలో నిమగ్నుడై వున్నపుడు కరణంగారు లోపలికొచ్చి మంచంమీద కూర్చునేవాడు. అతడు చూస్తుండగా పొయ్యిముందు కూర్చోవడానికి రామదాసుకు సిగ్గుగా ఉండేది. అది గమనించి కరణంగారు, 'ఈ కాలం మగవాడు వంటచేయడంలో చిత్రమేమీ లేదు లేవయ్యా. హోటళ్లలో తయారయ్యే వంటకాలన్నీ మగాళ్లు తయారుచేసినవే' అనేవాడు. రామదాసు పొంగు వార్చుతుండగా కరణంగారు రాగయుక్తంగా ఒక తత్వాన్ని పాడి, 'ఆడది దేశాన్ని పాలిస్తుందని, మగవాడు వంటింటి పాలవుతాడని అన్నాడే గురుడు. గురునివాక్కు పొల్లుపోదు' అనేవాడు. క్రమంగా రామదాసు పాకశాస్త్రంలోని లోతుపాతులన్నీ వొంటబట్టించుకున్నాడు. ఇటీవల ఒకనాడు అతని వంటకాన్ని పొయ్యిమీదుండగానే రుచిచూసిన కరణంగారు, 'పంతులూ గత జన్మంలో నువ్వెప్పుడో నలమహారాజువై ఉంటావయ్యా, పాకశాస్త్రంలో అరితేరినవాడవై పోతున్నావు. ఇలాంటి వంటకాలను

మా ఆవిడ కాపురానికొచ్చిన కొత్తలో కొన్నాళ్లు చేసి పెట్టేది.' అంటూ, ఇంత కొత్తిమీర పచ్చడిని అల్యూమినియం పాత్రలోవేసి పట్టుకు పోయేవాడు.

'జయలక్ష్మీ క్రేఫ్' లో అడుగు పెట్టాడు రామదాసు. బల్లలమీదున్న ఈగలు ఝుమ్మని లేచి దూరంగా ఉన్న బల్లలమీద సర్దికూర్చున్నాయి. వాటి అతిథి మర్యాదకు సంతసిస్తూ అవి ఖాళీచేసిన బల్ల ముందు కూర్చున్నాడు రామదాసు. పరిసరాల నొక సారి కలయజూశా డతడు. కౌంటరుమీద శ్రీ వేంకటే శ్వరుని పటం వ్రేలాడుతూంది. ఎన్నిసంవత్సరాల క్రితం ఫ్రేము కట్టారోగాని, లోపలికి నీళ్లు డిగి బొమ్మ సగానికి తడిసిపోయింది. కౌంటరు ప్రక్కన వున్న రేడియో ఏడుపు సంగీతాన్ని వినిపించకుండా ఉండడం రామదాసుకు నచ్చింది. గోడకు వ్రేలాడు తున్న కాలెండర్లలో సినిమా తారలు, దేవతలు వివిధ కోణాలలో కనిపిస్తున్నారు. రైసుమిల్లు టాకీసు ముందు కనిపించిన నాయకుని ముఖాన్ని రెండు మూడు కాలెండర్లలో గుర్తించగలిగాడు రామదాసు. 'ఇతగాడి చిత్రాలకు ఈ పట్టణంలో మంచి ఆదరణ లభించేట్టుగా ఉంది.' అనుకున్నాడతడు. హోటలును కలయజూసిన తరవాత, 'మధ్యాహ్నం బాంకుముందున హోటలులో లభించిన భోజనానికన్న మెరుగైన భోజనం ఇక్కడ లభించేట్టులేదు. వేడిగా లభిస్తే ఏదైనా ఇంత ఉపాహారం ఆరగించడంమంచి' దనుకున్నా డతడు.

ఇంతలో ఒకతడు కొచ్చిన్‌మార్కు ముఖం వేసుకుని వచ్చి రామదాసు ముందు నిలబడ్డాడు.

'వేడిగా ఏమున్నాయి?' అనడిగాడు రామదాసు.

'ఏమీలేదు, ఎనిమిద గంటలకే సర్వింగు ఆపు చేసేశాం, ఇవ్వాళ మహానాయకుడు చనిపోయారు గనుక హోటలు కట్టెయ్యాలని ఉత్తరువు లొచ్చాయి' అన్నాడు సర్వరు.

రామదాసుకు తల దిమ్మదిరిగి పోయింది. 'గ్లాసెడు మంచినీళ్లు తెచ్చిపెట్టు. తల తిరుగు తూంది.' అన్నాడతడు.

'మంచినీళ్లకేం భాగ్యం. కాని ఆ తాగేదేదో లోపలికొచ్చి తాగు. నువ్విక్కడ కూర్చుని తాగడం రోడ్డుమీదనుండి ఎవరైనా చూస్తే మా పీకలమీది కొస్తుంది.' అంటూ లోనికి దారితీశాడు సర్వరు.

వంటగదిగా పేర్కొనబడే ఆ భాగం మసిబారిన గోడలతో, సగం కుళ్లిన ఆహారపదార్థాల వాసనతో చాల అసహ్యంగా ఉంది. నేలమీద పరచిన చిరిచాపమీద నడివయస్కు డొకడు వెల్లకిల పడుకుని భీకరంగా గుర్రుపెడుతున్నాడు. కుంభాకారంగా ఉన్న అతని పొట్టమీద చెమట బిందువులు జారుతున్నాయి. ఇద్దరు సర్వర్లు చెంచాలతో ఇత్తడి పాత్రమీద దరువులు వేస్తూ సినిమాపాటలు పాడుతున్నారు.

సర్వరు అందించగా నాలుగుగ్లాసుల నీళ్లను గడగడ తాగేడు రామదాసు. అంతమాత్రానికే అతనికి త్రేన్పు వచ్చింది. గడ్డంమీద జారిపడిన నీటిచుక్క లను తుడుచుకుంటూ వెలుపలి కొచ్చాడతడు. అతని క్షుద్బాధ తాత్కాలికంగా శాంతించింది. తరువాత చేయదగిన కార్యాన్ని గురించి ఆలోచిస్తూ మళ్లీ ఒక బల్లముందు కూర్చున్నాడతడు.

కౌంటరులో గున్న ఏనుగులాంటి మనిషి కూర్చుని ఉన్నాడు. అతని ప్రక్కన స్టూలుమీద ఒక బక్కపలచటి మనిషి ఉన్నాడు. వాళ్లిద్దరూ విచార వదనాలతో ఏదో మాట్లాడు కుంటున్నారు. 'గున్న ఏనుగు హోటలు మేనేజరు కావచ్చు. బక్కపలచటి మనిషి హోటలుకు కావలసిన సరకులను సరఫరాచేసే వ్యాపారి కావచ్చు' అనుకున్నాడు రామదాసు.

గున్నఏనుగు భారంగా నిట్టూర్చి, 'ఇలా అవుతుందని నేనుమాత్రం కల గన్నానా. ఐదువందల రూపాయల విలువచేసే పిండివంటలు తయారు చేయించాను. తీరా వంటకాలన్నీ పొయ్యిమీదనుండి దిగగానే వాళ్లొచ్చి హోటలు కట్టెయ్యండ్రా అంటూ మొత్తుకున్నారు' అన్నాడు.

బక్కపలచటి వ్యక్తి స్టూలుమీద బొమ్మ లాగా కదులుతూ 'నాయకుడు చచ్చినంతమాత్రాన

జనాలను ఇన్నివిధాలుగ ఆరడి పెట్టడంలో ఏమిటి ఉద్దేశం?' అనడిగాడు.

'అతని మరణంపట్ల సంతాపాన్ని ఈ విధంగా తెలియజేయాలిట' అన్నాడు గున్నఏనుగు.

'ఆ—నా బొందకాదూ. సంతాపం మనిషిలో తనంతటది పుట్టాలిగాని బలవంతంగా కలగజేస్తారా వీళ్లు' అంటూ ఈసడించాడు బక్కపలచటి వ్యక్తి.

'అదిగదా పాయింటు' అనుకుంటూ తలపంకించాడు రామదాసు.

తామాడుకుంటున్న మాటలను శ్రద్ధగా అలకిస్తున్న రామదాసుపై ఇంచుక వాత్సల్యం కలిగింది గున్నఏనుగుకు.

'ఏ ఊరన్నా మంది?' అనడిగాడతడు.

'మాది ఒంటిల్లండీ' అన్నాడు రామదాసు.

'ఒంటిల్లా—అదెక్కడ?' అనడిగాడు గున్న ఏనుగు.

'అదేనండి — చంద్రగిరికోట మొగదలవున్న ఊరు.' అన్నాడు రామదాసు.

'ఓహో అదా. ఐతే నువ్వేదో పనిమీద ఈ పట్నణం వచ్చి మహానాయకుడి పుణ్యమా అంటూ ఇక్కడే చిక్కుబడి పోయావన్నమాట' అన్నాడు బక్కపలచటి మనిషి.

'నేనిక్కడకు ఎప్పుడు వచ్చినా రేణిగుంట రైలులో తిరిగి వెళ్లిపోయేవాడిని. కాని ఇవాళ కుదరలేదు. నాకేమీ పాలుపోవడంలేదు' అన్నాడు రామదాసు.

'ఏం చేస్తాం. చచ్చింతరవాత గూడ మనగోడు పోసుకుంటారీ నాయకులు. అన్నా, నువ్వీరాత్రిని గడపటానికి ఇక్కడే పడుకుంటానంటే నాకేం అభ్యంతరం లేదు.' అన్నాడు బక్కపలచటి మనిషి.

రామదాసు ఆలోచనలో పడ్డాడు. నాలుగువేల రూపాయల రొఖ్ఖంతో తా నీరాత్రి ఇక్కడ గడపబూనడం తన ముసలిప్రాణాలకు ఎంతవరకు శ్రేయస్కరం—అన్న తర్కానికి లోనయ్యిందతని మెదడు. డబ్బుకోసం నానాగడ్డికరచే ఈ మేనేజరు మాటవిని డబ్బుకు మొహం వాచిపోయిన సర్వర్లమధ్య తను పడుకుంటే ఇంకేమన్నా ఉందా? మహాకాయుడైన వంటవాడు అర్ధరాత్రి లేచి తన జేబును దోచుకుని, తనమెడను పట్టుకొని కోడిని నులిమినట్లు నులిమెయ్యగలడు. తన కాళ్లుచేతులను విరిచి రేపు ఉదయం వంటచెరుకుగా వాడుకోగలడు.

'ఏమిటి ఆలోచిస్తున్నావు? మా సర్వర్లు రాత్రి తెల్లవార్లు సినిమాపాటలుపాడి నీకు నిద్రాభంగం కలిగిస్తారనా? అలాంటి దేమీలేదు. పడకలు వేశారంటే వాళ్లు కుంభకర్ణుడిని తలపింపజేస్తారు' అన్నాడు గున్నఏనుగు.

'అబ్బే. నే నాలోచిస్తున్నది అదిగాదు. మా యింటి సంగతులను గురించి ఆలోచిస్తున్నాను. ఎల్లుండి నా కూతురికి పెళ్లి. నేనువెళ్లి చేయాల్సిన పనులు చాలాఉన్నాయి. ఆహ్వాన పత్రికలను పంచిపెట్టడంకూడ పూర్తికాలేదు.'

'సరేలే. కన్యాదాత అన్నపిదప లక్ష బాధ్యతలుంటాయి. నాకు తెలియదా. ఐనా నువ్వేం మనిషివయ్యా, సాక్షాత్తు కడుపునబుట్టిన బిడ్డ పెళ్లికూతురు కాబోతూవుంటే నువ్విక్కడ దేవులాడుతున్నావు.'

'ఏమిటి చెయ్యడం. రెక్కలు గట్టుకుని ఇంట్లో వాలాలనివుంది నాకు. కాని ప్రయాణ సౌకర్యాలు మృగ్యంగా ఉన్నాయి.'

'ఆ—ఏమిటయ్యా అంత మృగ్యంగా ఉండేది? ఉద్దేశ్యం గట్టిగా ఉంటే మార్గాలు లక్ష లభిస్తాయి. ఒక్కపని చెయ్యి. స్టేషనురోడ్డు వెంబడి ఇలా వెళ్లితే నేతాజీరోడ్డు తగులుతుంది. అక్కడ కుడివైపుకు తిరిగి నేతాజీరోడ్డు వెంబడి నాలుగు ఫర్లాంగులు నడిస్తే ఓ పెట్రోలుబంకు కనిపిస్తుంది. ప్రతిలారీ పెట్రోలు పోసుకోవడనికై

అక్కడ ఆగుతుంది. చోటివ్వమని ఒక డ్రైవర్ని బతిమాలుకో. బస్సు చార్జీకన్న రూపాయి అదనంగా ఇస్తాననిచెప్పు ఎక్కించుకుంటారు.' అన్నాడు మేనేజరు.

'నిజంగా లారీవాళ్లు ఎక్కించుకుంటారా?' అనడిగాడు రామదాసు బల్లమీదనుండి లేస్తూ. మేనేజరు కల్పించిన ఆశతో అతనికళ్లు మిలమిల మెరుస్తున్నాయి.

'లారీవాళ్లు మాత్రం మనుషులు కారా ఏమిటి? ఖాళీవుంటే తప్పకుండా ఎక్కించుకుంటారు. వెళ్లి ప్రయత్నించి చూడు.' అన్నాడు మేనేజరు. 'చాలా మంచిమార్గం చెప్పారు. మీమేలు మర్చిపోను. వస్తాను.' అంటూ బయటకు నడిచాడు రామదాసు.

'ఈమధ్య లారీవాళ్లకు తాగుడు ఎక్కువయింది; ఎందుకైనా మంచిది. నీ జాగ్రత్తలో నువ్వుండు. లారీలోకి ఎక్కేముందు డ్రైవరు పెగ్గు వేశాడో లేదో కనుక్కొని మరీ ఎక్కు' అంటూ అరిచాడు బక్కపలచటి మనిషి.

ఆ పాటికే రామదాసు రోడ్డుమీద చరచరా నడుస్తున్నాడు. ఆపద్బాంధవుడిలాగ తారసపడి తనకు కర్తవ్యాన్ని సూచించిన హోటలు మేనేజరుకు అతడు మనసులోనే జోహారు లర్పించుకున్నాడు. మేనేజరు ఆ సలహాయివ్వి సహాయపడకుండా వుంటే రామదాసు తలదాచుకోవడానికి తప్పనిసరిగా ఆ హోటలునే అంటిపెట్టుకోవలసి వచ్చేది. రెండు బెంచీలను జతచేసి వాటిమీద అతడు పడుకొని ఉండేవాడు. రాత్రి గడిచే కొద్దీ వంటగదిలోనుండి కుళ్లువాసన వడ్డనశాలలోకి వ్యాపించి అతనిముక్కుపుటాలను బద్దలు చేసి ఉండేది. సర్వర్లు బల్లలమీద దరువులువేస్తూ నాసిరకం సినిమాపాటలు పాడుతూ తనను నిద్రపోనివ్వి ఉండేవారుకారు. వారలా ఆడిపాడి అలసిపోయి ఏ అర్ధరాత్రికో నిద్రపోయి ఉండేవారు. అప్పుడు రామదాసుకూడ నిద్రపోవటానికి ప్రయత్నించి ఉండేవాడు. నాలుగువేల రూపాయల లాఖం జేబులోవుండగా అతనికి ఒకపట్టాన నిద్రవచ్చి ఉండేదికాదు. ఉదయంనుండి తిరుగుతూ అలసి ఉండడంవల్ల క్రమంగా అతనికి మైకంలాంటి నిద్ర క్రమ్మిఉండేది అప్పుడు మహాకాయుడైన వంటవాడు అతనిపై దాడి ప్రారంభించి ఉండేవాడు.

## 3

పదినిమిషాల నడకతో పెట్రోలుబంకు చేరుకున్నాడు రామదాసు. పెట్రోలుబంకు ఆవరణం విద్యుద్దీపాల వెలుగుతో పట్టపగలుగా వుంది. అక్కడ ఒకేలారీ నిల్చునిఉంది. దానిముందు 'శ్రీ బాలాజీ లారీ సర్వీసు' అని రాసివుంది. కాబిన్‌లో దీపం వెలగటంలేదు. డ్రైవరుకోసం చుట్టూ చూశాడు రామదాసు. ఎక్కడా అతని ఆచూకీలేదు.

అక్కడకు వచ్చే శకటాలను పెట్రోలుతో నింపేకుర్రాడు దీపంక్రింద కూర్చుని సినిమాపాటల పుస్తకాన్ని చూస్తున్నాడు అతడా పుస్తకాన్ని కూడి కూడి చదువుతున్న తీరునుబట్టి అతని అక్షర పరిజ్ఞానం కొద్దిపాటిదని తెలుసుకోవచ్చు. రాగయుక్తంగా పాడడానికి అతడు చాల శ్రమిస్తున్నాడు. ఆ పాటలు బహుశ ఇవాళ రైసుమిల్లుటాకీసులో ఆడుతున్న సినిమాలోనివై ఉండవచ్చు—అనుకున్నాడు రామదాసు.

ఈ పెట్రోలుబంకు స్వంతదారుడు గాబోలు—అల్లంతదూరాన ఈజీచైరులో సుఖాసీనుడై ఉన్నాడు. మల్లుధోవతి, జుబ్బా ధరించిన అతడు చాల ఠీవిగా ఉన్నాడు. అతని కిరువైపుల ఇద్దరు బక్కమనుషులు కరటకదమనకుల్లాగ కూర్చుని అతడు చెబుతున్నదానికి తలలూగిస్తున్నారు. ఇలాంటి పెట్రోలుబంకులు అతనికి ప్రతిటౌనులోనూ ఒకటి రెండు ఉంటాయి. అవి ఎలా నడుస్తున్నాయో పరిశీలించేందుకై అతడిలా పరతెంచి వచ్చివుంటాడు—అనుకున్నాడు రామదాసు.

బస్టాండులో పనిచేసే కుర్రాళ్లు కొందరు పాతబడి చిరిగిపోయిన లారీటైరు నొకదానిని

దొర్కించుకొచ్చి దానికి నిప్పంటించి చలికాచుకోవడం ప్రారంభించారు. వాళ్ళ శరీరాలమీదున్నవన్నీ చిరుగు పాతలు. కాలుతున్న టైరుచుట్టూ వారు వలయా కారంగా కూర్చున్నారు. వాళ్లు చలిబాధకు తాళలేక ఏవో ఒకటి తగలబెడుతూ రాత్రి గడిపేస్తారు. రాత్రంతా మంటలముందు కూర్చుని ఉండడంవలన వారి కడుపుల్లో త్రిప్పటం ప్రారంభమవుతుంది. ఉదయం ఏదైనా తింటే వమనమైపోతుంది.

కాలుతున్నటైరు విపరీతమైన పొగలను క్రక్కుతూంది. దానివాసన నలుదిక్కుల వ్యాపిస్తూ వుంది. పొగను తప్పించుకుంటూ లారీ చాటుకు నడిచాడు రామదాసు. కాబిన్‌లో లైటు వెలిగింది. వెంటనే తలుపుకూడ తెరుచుకుంది. లోపలినుండి దృఢకాయుడైన యువకుడొకడు కిందకి దిగాడు. అతడు కాబిన్‌లో పడుకుని కొన్నిగంటల తరబడి నిద్ర పోయినట్లున్నాడు. అతడు నిద్రలో కార్చిన చొంగ చెంపమీద కనిపిస్తూంది. దిగగానే అతడు వికృతంగా నోరుతెరిచి ఆవులిస్తూ వొళ్ళు విరుచు కున్నాడు. వొళ్ళు విరుచుకుంటున్నప్పుడు విపరీతంగా పొంగిన కండరాలను చూసి ఇతడు 'వొట్టిచేతులతో పులులను ఎదిరించి చంపగలడు' అనుకున్నాడు రామదాసు. ఆ దృఢకాయునిముందు గువ్వలాగ నిల్చున్నా డతడు. అతనిని పలకరించడం ఒకవిధమైన సాహస కృత్య మనిపించిం దతనికి. ధైర్యం కూడగట్టుకుని 'బాబూ, ఈ లారీ ఎటెళ్ళుతుంది ?' అనడిగా డతడు.

'ముందుకి' అన్నాడు దృఢకాయుడు.

'ఫరవాలేదు. ఈ వజ్రకాయుడుకూడ జోకు చెయ్యగలడు. వొళ్ళు బండలాగున్నా గుండెలో మెతక దనమున్నట్లుంది' అనుకున్నాడు రామదాసు.

'అది కాదు. ఏ రూట్‌లో వెళ్ళుతుందీఅని' అన్నాడు రామదాసు వినయంగా.

'తిరుపతికి వెళ్ళుతుంది. ఏం?' అనడిగాడు తలుపును ధణాల్మని మూస్తూ.

మా వూరు ఆ దార్లోనే ఉంది. అర్జంటుగా నేను ఊరెళ్ళాలి. మీ లారీలో కాస్తంత—'

రామదాసును మధ్యలోనే ఆపుతూ, 'నాకేమీ తెలియదు. నేని లారీలో క్లీనరును మాత్రమే. అదిగో డ్రైవరు వస్తున్నాడు. అతడినే అడుగు' అన్నాడతడు.

రామదాసు వెనక్కు చూశాడు. ఒక ఆజాను బాహుడు పెద్దపెద్ద అంగలువేస్తూ వస్తున్నాడు. సిగరెట్టుపొగను గుప్పుగుప్పున వదులుతున్నాడు. విద్యుద్దీపం అతని వెనకగా ఉండటంవల్ల అతని ముఖం కనిపించలేదు రామదాసుకు. అతడు ఇంజన్‌ను సమీపించినప్పుడు కాబిన్‌లోని వెలుతురు అతని ముఖంమీద పడింది. అతనికొక కన్నులేదు. కన్ను ఉండవలసిన స్థానంలో లోతైనగుంటవుంది. సిగరెట్టును చివరి సారిగా పీల్చి మిగిలిన ముక్కను నేలకేసికొట్టి కాబిన్ లోకి ఎక్కబోయాడతడు.

'బాబూ' అని పిలిచాడు రామదాసు వెనక నుండి.

ఒకకాలు ఫుట్‌బోర్డుమీదవుంచి చేత్తో ఇనుప వూచను పట్టుకునివున్న డ్రైవరు వెనకకుతిరిగి, ఏమి టన్నట్లు కళ్లెగురవేశాడు.

'నేనుఅర్జంటుగా ఊరెళ్ళాలి. మీలారీలో కాస్తంత చోటిచ్చారంటే మీ ఉపకారం జన్మలో మరిచిపోను' అన్నాడు రామదాసు.

'ఏవూరు మీది?' అనడిగాడు డ్రైవరు.

'ఒంటిల్లని—చంద్రగిరికోట మొగదలఉంది.'

'సరె. లోపలికెక్కు. లారీ తిరుపతివరకు వెళ్ళు తుంది. ఈలోగా నీకు ఇష్టమైనచోట దిగవచ్చు' అంటూ కాబిన్‌లోకి ఎక్కాడు డ్రైవరు. ఇనుప ఊచను ఆధారంగా చేసుకుని అత ణ్ణనుసరించాడు రామదాసు. డ్రైవరు స్టీరింగుముందు కూర్చుని, 'ఇలా కూర్చో'అంటూ తన ప్రక్కనున్న సీటుమీద ఎడమచేత్తో చరిచాడు. తనకూ డ్రైవరుకూ మధ్య బెత్తెడు ఖాళీస్థలాన్ని వదలి కూర్చున్నాడు రామదాసు.

డ్రైవరు ఇంజన్‌ను స్టార్టుచేయబోయి ఆగి

'ఇంతలో వీడేమయ్యాడు' అంటూ తల బయటపెట్టి 'మస్తాన్' అంటూ అరిచాడు.

'ఆ-వస్తున్నా, నువ్వు ఇంజన్‌ను స్టార్టుచెయ్యి.' అంటూ క్లీనరు కంఠం మునిసిపాలిటీవారి కాలువ గట్టుమీదనుండి వినిపించింది.

ఓ ఐదురూపాయలనోటును తీసి డ్రైవరు చేతిలో పెట్టబోయాడు రామదాసు.

'ఇదెందుకు ?' అన్నట్టు ముఖకవళికలతో ప్రశ్నించాడు డ్రైవరు.

'చార్జి బస్సుల్లో ఐతే నాలుగు రూపాయలు తీసుకుంటారు. ఒకరూపాయి అదనంగా ఇచ్చుకుంటున్నాను.' అన్నాడు రామదాసు అతని ముఖంలోకి చూస్తూ.

రామదాసు చేతిని వెనక్కు తోసేస్తూ డ్రైవరు, 'వద్దులే. ఉంచుకో. నేను డబ్బుకోసం నిన్ను ఎక్కించుకోలేదు. నువ్వు లేకుంటే ఏ తాసిల్దారో, సబిన్‌స్పెక్టరో ఆ సీటులో కూర్చుని దిలాసాగా ప్రయాణం చేసి ఉండేవారు. ఏదో నీలాంటి ముసలాడికి సహాయపడితే ఇంతపుణ్యమన్నా దక్కుతుంది.' అన్నాడు.

రామదాసుకు చాల సంతోషమయింది తానీ పట్టణంలో జేబుదొంగల బారినుండి తప్పించుకోవడమే గాక ఎనభైమైళ్ళదూరాన ఉన్న తన స్వగ్రామాన్ని కానీఖర్చులేకుండ చేరగలుగుతున్నాడు. అందుకు దోహదం చేస్తున్న డ్రైవరు దేవుడిలా కనిపించాడతనికి.

'మీ లారీలో తాసిల్దార్లూ, సబిన్‌స్పెక్టర్లు తరచు ప్రయాణం చేస్తుంటారా ?' అనడిగాడు రామదాసు.

'అయ్యో అయ్యో అదేం అడుగుతావు. దారి పొడవునా వాళ్ళు 'మమ్మల్ని రాచి రంపాన బెట్టేస్తారనుకో. వారు కోరిన స్పీడులోనే బండిని నడపాలి. ఒక్కోసారి వాళ్ళకోసమని రూట్‌కూడ మార్చుకోవలసి వస్తుంది. ఇక వాళ్ళున్నంతసేపు మేము సరదాగా మాట్లాడుకోలేము. కనీసం బీడీ కాల్చుకునే స్వేచ్ఛ కూడవుండదు' అంటూ ఆగి సిగరెట్టు వెలిగించుకున్నాడు డ్రైవరు.

కొద్దినిమిషాలలోనే రామదాసుకు డ్రైవరుపైన ఆత్మీయత ఏర్పడింది. కొన్ని సంవత్సరాలుగా అతనితో పరిచయమున్నట్లు అనిపించిందతనికి. అరమరికలు లేకుండ ఆతడు మాట్లాడే పద్ధతి రామదాసుకు నచ్చింది.

రామదాసు కాబిన్ నొకసారి కలయజూశాడు. డ్రైవరు కాళ్ళవద్ద ఒక ప్లాస్టిక్‌సంచిలో పూలు, పళ్ళు, ఓ జాకెట్‌గుడ్డా వున్నాయి. వాటినతడు తన భార్యకోసం తీసుకెళుతున్నాడేమో ననుకున్నాడు రామదాసు.

'ఆ పూలూ అవీ నీ భార్యకోసమా?' అనడిగాడు రామదాసు. తన ప్రశ్నకు డ్రైవరు సిగ్గుపడుతూ, పెదవులపై చిరునవ్వులు పులుకుపులుకుమని తప్పించుకుంటూఉండగా, 'అవును. ఆ పూలంటే మా ఆవిడకు చాల ఇష్టం' అంటాడనుకున్నా డతడు.

డ్రైవరు సిగరెట్టుపొగను నిర్లక్ష్యంగా వదులుతూ, సైడుమిర్రరుగుండా తన నీడను చూసుకుంటూ, 'ఏం. మగాడు ఒక్క ఆడదానికి మాత్రమే పూలు తీసుకెళ్ళాలా?' అనడిగాడు.

ఆ సమాధానంతో రామదాసు నిరుత్సాహపడ్డాడు. 'పెళ్ళానికే తీసుకెళ్ళాలని రూలు లేదనుకో. అక్కచెల్లెళ్ళకుకూడ తీసుకెళ్ళవచ్చు' అన్నాడతడు.

'అంతేనా ఇంకెవరికోసమూ తీసుకెళ్ళకూడదా?' అన్నాడు డ్రైవరు.

తానొక పెద్దఇరకాటంలో పడిపోయినట్టు ఫీలయ్యాడు రామదాసు. 'ఇంతకూ నీకు పెళ్ళయిందా లేదా?' అనడిగాడతడు. అలా అడుగుతున్నప్పుడు

'నేనతని వ్యక్తిగతవిషయాలలోకి మరీ చొచ్చుకుని పోతున్నానేమో' అనుకున్నా డతడు.

డ్రైవరు సిగరెట్టుకున్న నుసిని రాలుస్తూ, 'పెళ్ళిగిళ్ళి మనకు జాన్తానై. ఎవరో మహాను భావుడు సెలవిచ్చినట్టు—బజారులో పాలు పుష్కలంగా లభిస్తుండగా ఆవునుకొని పోషించే బాధ్యత నెత్తినేసుకోవడం శుద్ధఅవివేకం' అన్నాడు.

ఆ సంభాషణను మరి పొడిగించదలచుకోలేదు రామదాసు.

ఇంతలో సైరన్ మ్రోగింది. డ్రైవరు సిగరెట్టును నోట్లో పెట్టుకోబోతూఆగి, 'చూశావా? గంట అప్పుడే తొమ్మిదయింది. ఈపాటికి నేను పాకాలనైనా దాటుకుని ఉండాల్సింది. ఈ నాకొడుకు ఉన్నాడు చూశావూ—పొద్దస్తమానం ఈ కాబిన్‌లో పడి నిద్రపోతాడు. బయలుదేరేటప్పుడు ఎక్కడికో ఉడాయిస్తాడు, అక్కడెక్కడైనా తగలడ్డాడేమో కాస్త చూడు' అన్నాడు.

రామదాసు కిటికీవారగ జరిగి తల బయట పెట్టి చూశాడు. క్లీనరు మునిసిపాలిటీ కాలువ గట్టుమీదనుండిలేచి పంట్లాము బొత్తాములు పెట్టుకుంటూ వస్తున్నాడు.

డ్రైవరు ఇంజన్‌ను స్టార్టుచేస్తూ, 'త్వరగా నడిచి రారా సైతాన్' అన్నాడు. అతిలాఘవంగా కాబిన్‌లోనికి గెంతి తలుపేసుకున్నాడు. 'దారిలో టీకొట్టునడిపే ముండదగ్గర గంటలకొద్దీ గడిపే స్తావుగాని నేనొక నిమిషం ఆలస్యంచేస్తే నెత్తిన నోరుపెట్టుకుని అరుస్తావు.' అంటూ తలుపువారగా కూర్చున్నాడతడు.

అతనిమాటలను డ్రైవరు వినిపించుకోలేదు. ఇంజన్‌ను స్టార్టు చేస్తూ తనముందున్న మీటలను చూడడంలో నిమగ్నుడై ఉన్నాడతడు. పెద్దగా చప్పుడుచేస్తూ ఇంజను స్టార్టయింది. ఇంజనుల నుండి వెలువడిన 'పొగ' కాలుతున్నరబ్బరు తాలూకు పొగతోకలిసి ఆకాశానికెగిసింది. బావ్‌బావ్ అంటూ హారన్ మ్రోగించాడు డ్రైవరు. అదివిని చలికాచుకుంటున్న కుర్రాళ్ళు వెనుదిరిగి చూశారు. హెడ్ లైట్లను ఆన్ చేశాడు డ్రైవరు. సూటిగ పడుతున్న వెలుతురును భరించలేక కళ్ళుచిట్లిస్తూ చేతులడ్డం పెట్టుకున్నారు వాళ్ళు. వారిమధ్యనున్న లారీటైరు దాదాపు పూర్తిగ కాలిపోయింది. మిగిలివున్న రాత్రి దేన్ని తగలబెడుతూ వేగించడమని వాళ్ళు తర్కించుకుంటారు. అందరూకలిసి హైరోడ్డులోని బెల్లం మండీల వద్దపడిఉన్న చిరిగిన గోనెసంచులను సేకరించి తగలబెడతారు. లేక టాంక్ రోడ్డులోని మామిడికాయల మండీ వెనకనున్న గడ్డిని ప్రోగుచేసి తగలబెడతారు' అనుకున్నాడు రామదాసు.—

లారీ బయలుదేరింది. నేతాజీరోడ్డుమీద రద్దీ బాగ తగ్గిపోయింది. ఎదురుగ వస్తున్న బస్సులను కార్లను తొలగదోసుకుంటూ సాగుతూంది లారీ.చూస్తుండగానే పట్టణం శివార్లలోకి వచ్చేసింది.

నదివొడ్డున ఉన్న చక్కెర ఫాక్టరీని చుట్టుకుని, రైల్వేగేటును దాటుకుంది లారీ. చక్కెర ఫాక్టరీ ఇవాళ పనిచేయడంలేదు. మామూలు రోజులలో ఫాక్టరీ చూడడానికి కన్నులపండుగగా ఉండేది. లారీలకొద్దీ సమర్పింపబడే చెరకును చిరునవ్వులతో స్వాహాచేస్తూ అప్పుడప్పుడు సగం పట్టణానికి వినిపించేట్లుగ త్రేన్చుతూ మదగజంలాగ నిల్చుని ఉండేది. లారీ ఫాక్టరీని చుట్టివస్తున్నప్పుడు పులిసిన చెరకుపాల సువాసన తియ్యగ మత్తుగ నాసాపుటాలను తాకింది. 'ఈ ఫాక్టరీ ఆవరణలో మంచం వాల్చుకుని, ఈ సువాసన పీలుస్తూ పడుకోవడం ఎంతహాయి. అందుకే చెరకుపాలను అమృత మన్నారు' అనుకున్నాడు రామదాసు. అతడు ఉపాధ్యాయుడుగా పనిచేస్తూ ఉండిన రోజులలో పిల్లలను బడికిపంపే రైతులు ప్రతియేటా బెల్లం ముద్దలను, చెరకుగడలను కానుకగా అతనికి సమ

ర్పించుకునేవారు. ఆ చెరకుగడల నతడు చాల మక్కువతో ఆరగించేవాడు. ఇప్పుడతని దంతాలు చాలవరకు ఊడిపోయాయి. మిగిలివున్నవికూడ పటిష్ఠంగాలేవు. 'చెరకుపాలను ఆస్వాదించే యోగం తనకికలేదు. దానికి దంతపుష్టిగల యువకులే అర్హులు' అనుకున్నాడు రామదాసు తనకిరువైపుల ఆసీనులైవున్న రక్తం పొంగే యువకులకేసి చూస్తూ.

వారిద్దరిమధ్య రామదాసు రెండు పర్వతాల మధ్య గులకరాయిలాగ వొదిగిపోయాడు. అప్పటికే క్లీనరు నిద్రలోకి జారుకున్నాడు. 'ఇతడు ఆకారంలోనేగాదు అలవాట్లలో సైతం కుంభకర్ణుడే' అనుకున్నాడు రామదాసు. రోడ్డుమీది ఎగుడుదిగుళ్లమీద లారీ పరుగిడుతున్నపుడు వాటి కనుగుణంగా క్లీనరువొంటిమీది కండరాలుకూడ కదులుతున్నాయి. తన లావాటి పెదిమలమీద వాలిన ఈగను తోలడానికై క్లీనరు నిద్రలోనే చేతిని విసిరాడు. ఆ చేతివేళ్లు రామదాసు ప్రక్కలకు తగిలి విపరీతంగా బాధపెట్టాయి. 'అవి వ్రేళ్లుకావు. స్టీలు కడ్డీలు' అనుకుంటూ కొంచెం డ్రైవరువైపు జరిగాడు రామదాసు.

లారీ పట్టణ మునిసిపాలిటీ సరిహద్దులను దాటుకున్నది. ఇప్పుడు రోడ్డుమీద దీపాలులేవు. హెడ్‌లైట్లు ప్రసరిస్తున్నంత మేరతప్ప గాఢాంధకారం అలుముకుని ఉంది. రోడ్డు కిరువైపుల కొబ్బరిచెట్లు బారులుతీరి నిల్చునిఉన్నాయి. అవి గాలిపాటుకు తలలూగిస్తుండడం చీకటిలో లీలగ కనిపిస్తూంది. కొబ్బరితోటను చుట్టిఉన్న కంచెలో మిణుగురు పురుగులు ఎగురుతున్నాయి. 'అవి మానవుని ఆశల్లాగ విచ్చలవిడిగ అసంఖ్యాకంగా ఎగురుతున్నాయి.' అనుకున్నాడు రామదాసు.

కాబిన్‌వెనక అమర్చిఉన్న చతురస్రాకారపు రంధ్రంగుండా ఒకసారి వెనక్కు చూశాడతడు. పట్టణాన్ని వదిలి లారీ చాలదూరం వచ్చేసింది. చీకటి సముద్రంలో పట్టణం తెప్పలాగ తేలుతూంది. పట్టణంలో విద్యుద్దీపాలు నక్షత్రాలవలె మినుకు మినుకుమంటున్నాయి.

జేబు గుర్తుకువచ్చి ఉలిక్కిపడ్డాడు రామదాసు. అప్రయత్నంగా అతనిచేయి పైకివెళ్లి జేబును తడివింది. జేబు సురక్షితంగా ఉంది. 'హమ్మయ్య' అని తృప్తిగా నిట్టూరుస్తూ పైకి చూశాడతడు. కాబిన్‌పైన నీలిరంగు నియాన్‌బల్బు వెలుగుతూంది. దానిక్రింద వ్రేలాడుతున్న పటంలో శ్రీ కృష్ణభగవానుడు అర్జునునకు గీతోపదేశం చేస్తున్న చిత్రం ఉంది. దాని కిరువైపుల లక్ష్మీసరస్వతుల పటాలున్నాయి. తనను సురక్షితంగా గ్రామానికి చేర్చమని ఆ పటాలలోని దేవతలను మనసులోనే ప్రార్థించసాగాడు రామదాసు.

'ఏమిటి ఆ పటాలకేసి ఒకటే చూస్తున్నావు?' అన్నాడు డ్రైవరు.

డ్రైవరు తననే గమనిస్తున్నాడని గ్రహించిన రామదాసు ఉలిక్కిపడ్డాడు. 'అతనిదృష్టి జేబుపైన పడలేదుగదా' అనుకున్నాడు రామదాసు. ఆ ఆలోచన వచ్చినప్పుడు అతని వొళ్లు సన్నగా కంపించింది తనలోని కంగారును అణచిపెట్టుకుంటూ, 'ఆ పటాలు ఎంత ముచ్చటగా ఉన్నాయో చూడు. పావలా డబ్బులు పెట్టి పూలుకొని వాటికివేస్తే ఎంత బాగుండును' అన్నాడతడు.

చేతిలోని సిగరెట్టుపీకను బయటకు విసిరివేసి 'నాకంత దైవభక్తిలేదు. ఆయుధపూజనాడు మాత్రం వాటి కిన్నిపూలుతగిలించి ఇంత గంధం చల్లిస్తాను' అన్నాడు డ్రైవరు.

'సహజం. కుర్రవయసులో మనిషికి దైవభక్తి కుదరకపోవడం చాల సహజం.' అన్నాడు రామదాసు, ఏదో స్వగతం చెప్పుకుంటున్నట్లు.

'చూడగా నువ్వేదో గుడిలో పూజారిలాగ ఉన్నావే' అన్నాడు డ్రైవరు. అలా అంటున్నప్పుడు అతని పెదాలమధ్య మెరిసిన చిరునవ్వును దాచుకోవడానికి అతడు ప్రయత్నించలేదు.

'నాకు దేవునిమీద నమ్మిక కద్దు గాని నేను పూజారినికాను.' అన్నాడు రామదాసు.

'మరి.'

'ఖటివంతుడుగా పనిచేస్తూ ఇటీవలే రిటైరయ్యాను.'

'పాపం. రిటైరైపోయావుగూడా నన్నమాట.' అన్నాడు డ్రైవరు. సైడు మిర్రరుద్వారా వెనకవచ్చే బస్సును చూస్తూ లారీని కొంచెం ఎడమవైపుగా పోనిచ్చి సైడుఇచ్చాడు డ్రైవరు. హారన్ మ్రోగిస్తూ ప్రక్కనుంచి దూసుకుపోయింది బస్సు. లారీని మళ్లీ నడిరోడ్డుమీదకు తెచ్చి, 'రిటైరయ్యేనాటికి ఏ మాత్రం వెనకేశావేమిటి?' అనడిగాడు.

'హో నాలుగువేలు బాంకులో వేశాను. అమధ్య ఒక స్వంతఇల్లు కొన్నాను. ఇన్నాళ్లుగ శ్రమించి నేను సంపాదించిన స్థిరచరాస్తులు ఇవే.' అన్నాడు రామదాసు.

'ఇహనేం. ఆ నాలుగువేలు తింటూ శేషజీవితాన్ని గడిపెయ్యగలవు'

'ఎలా వీలవుతుంది. ఆ నాలుగులో మూడు వేలు పోసి మా అమ్మాయికి సంబంధం తెచ్చాను. మిగిలినవెయ్యి పెళ్లిఖర్చులకు సరిపోతుంది.'

'మా అమ్మాయి అంటే—నీ కూతురా?'

'అవును. ఆమె నాకు ఒక్కగానొక్క కూతురు. ఆమె పెళ్లిని వీలయినంత వైభవోపేతంగా చేయాలనుకున్నాను. అందునిమిత్తం ఇరవై ఏళ్లుగ పైసాకు పైసా కూడబెడుతూ వచ్చాను'.

'ఈ రోజులలో అమ్మాయిలకు సకాలంలో పెళ్లిళ్లు చేయగలగడం గొప్ప అదృష్టం. ఇంతకీ అల్లుడేం చేస్తున్నాడు. ఏదైనా ఉద్యోగమా?'

'బి. యె. పాసై ట్రెయినింగయ్యాడు. తిరుపతి దేవస్థానంలో ఉద్యోగం చేస్తున్నాడు. చాలా బుద్ధిమంతుడు. ఆ వినయ విధేయతలను చూసినవారంతా నా కూతురి అదృష్టానికి మురిసిపోతున్నారు.'

'ఏమిటంతగా పొగిడేస్తున్నావు. ఇల్లరికం వస్తానన్నాడేమిటి?'

'అబ్బే. వాడికి చచ్చేంత అభిమానం. పెళ్లి కాగానే పెళ్లాన్ని తీసుకుపోతాడు. అప్పుడే దిగువ తిరుపతిలో ఒకఇల్లు బాడుగకు మాట్లాడిపెట్టాడు కూడ.'

రోడ్డుమీద కారొకటి ఎదురు వస్తూంది. స్పీడు తగ్గించి సైడుయిచ్చాడు, లారీడ్రైవరు. హెడ్ లైట్లను ఆపుచేసి మళ్లీవేశాడు. కారు లైట్లుకూడ రెండుసార్లు ఆగి మళ్లీ వెలిగాయి. ఇద్దరుడ్రైవర్లు లైట్లతో ఏదో చిత్రమైన భాషలో మాట్లాడుకుంటున్నా రనిపించింది రామదాసుకు. కారు శరవేగంతో లారీని వొరుసుకుంటూ దూసుకుపోయింది కారు నడుపుతున్న నవనాగరిక యువతి ముఖం క్షణకాలం మెరిసి మాయమయింది.

డ్రైవరు స్టీరింగును గిర్రునతిప్పి లారీని రోడ్డుమీదికితెచ్చి, సైడుమిర్రరుద్వారా వెనకవెళుతున్న కారు నొకసారిచూసి, 'ఈ ఆడవాళ్లకు డ్రైవింగును గురించి ఓనమాలు తెలియవు. వీళకు లైసెన్సు ఇచ్చినవాడి నరాలి.' అన్నాడు.

'ఏం, ఇప్పుడేం జరిగింది.?'

'నేను తగు జాగ్రత్తలో ఉండబట్టి సరిపోయింది. లేకపోతే జరగాల్సిందంతా జరిగేదే. రోడ్లమీద జరిగే కారు ప్రమాదాలు తొంభైశాతం ఇలాంటి ఆడవాళ్లవల్లనే జరుగుతాయి'.

కోపంతో డ్రైవరుముఖం జేవురించింది. కొందరు కోపమొస్తే వాళ్లూ పై తెలియకుండా చిందులేస్తారు. మరికొందరు అకస్మాత్తుగ మౌనముద్ర వహించి పాములాగ బుసలుకొడతారు. డ్రైవరు రెండవతరగతికి చెందినవాడు.

నల్లటి తారురోడ్డును మింగేస్తూ పరుగిడుతూంది లారీ. వాగులను వంకలను దాటుతూంది. డ్రైవరు దృష్టి రోడ్డుమీద ఆనివుంది. ఇంజను నుండి వస్తున్న వేడివల్ల చలి తోచడంలేదు. క్లీనరు మెత్తగ గుర్రుపెడుతున్నాడు.

దూరంగా రోడ్డుప్రక్కన ఒక పెట్రోమాక్సు దీపం వెలుగుతూ కనిపించింది ఆ దీపంలో ఏమిమాహాత్మ్యంఉందోగాని, దాన్ని చూడగానే కుతకుత లాడుతుండిన డ్రైవరుముఖం పువ్వులాగ విచ్చుకుంది. లారీ వేగంకూడ రెట్టింపయింది. సైడు

మిర్రర్‌లో చూస్తూ ఒకచేత్తో జుత్తును మీసాలను సవరించుకున్నాడు డ్రైవరు.

కళ్ళుమూసి తెరిచేలోగ ఓ టీకొట్టు ముందాగింది లారీ. ఆ కొట్టులోనే పెట్రోమాక్సుదీపం వెలుగుతూంది టీ బాయిలర్ ముందొక 'చిన్నది', నిల్చునిఉంది. రోడ్డుమీద ఆగిన లారీని చూడగానే, ఆమె చేస్తున్నపనిని వదిలిపెట్టి కొంగుకు చేతులు తుడుచుకుంటూ బయటికొచ్చింది.

డ్రైవరు ఇంజనును ఆపుచేసి. 'మస్తాన్' అంటూ పిలిచాడు. గురక ఆగిందికాని క్లీనరు కళ్ళు తెరవలేదు. కాళ్ళవద్దపడిఉన్న, పొడవాటి ఇనుపకడ్డీని తీసుకుని క్లీనరుడొక్కలో పొడిచాడు డ్రైవరు. 'ఇది మరీ మోటుసరసం' అనుకున్నాడు రామదాసు. అతని ప్రక్కటెముకలు ఒకటి రెండు విరిగి ఉండవచ్చునని కూడ అనుకున్నాడతడు. క్లీనరు గుహలాగ నోరు తెరచి ఆవులించడం ప్రారంభించాడు.

'ఆవులించిందిచాలుగాని దిగిరా. ఇన్ని టీనీళ్లు ముఖాన కొట్టుకుందువుగాని' అన్నాడు డ్రైవరు.

'క్లీనరుతో సరళంగా మాట్లాడరాదని వేదాలను ముట్టి ప్రమాణం చేసినట్లున్నాడీ డ్రైవరు' అనుకున్నాడు రామదాసు.

డ్రైవరు కిందికి దిగి, ప్లాస్టిక్ సంచిని తీసుకుంటూ, 'పెద్దాయనా, నువ్వుకూడ దిగిరా. ఇక్కడ తప్పితే ఈ రోడ్లో మరెక్కడా టీకూడ దొరకదు' అన్నాడు.

'నాకు కాఫీ—టీలు అలవాటులేదుబాబూ. మీరువెళ్ళి తాగిరండి. నే నిక్కడే ఉంటాను' అన్నాడు రామదాసు.

డ్రైవరు కొట్లోకి వెళ్ళగానే 'చిన్నది' అతని చేతిలోని సంచిని తీసుకుంది. తరవాత వాళ్ళిద్దరు మాట్లాడుకుంటూ తలుపుతీసుకుని గదిలోకి వెళ్లారు. వారి వెనక గదితలుపు మూసుకుంది. బెంచిమీద కూర్చుని విస్తర్లు కుట్టుతూఉండిన ముసలాయన వెళ్ళి టీ బాయిలర్‌ముందు నిలుచున్నాడు.

క్లీనరు ముసలాయన్నడిగి ఓ చెంబెడునీళ్ళు సుకుని ఇవతలికి వచ్చాడు. నిద్రమత్తు వదిలేలాగ ముఖం కడుక్కుని నోట్లో నీళ్ళుపోసుకుని పుక్కిలించి ఉమిశాడు. ఈలోగా ముసలాయన టీ తయారు చేశాడు. ఆ టీని చప్పరిస్తూ బెంచిమీదపడిఉన్న వార్తాపత్రికను చూడసాగాడు క్లీనరు.

లారీ ఆగిఉండడంవల్ల చలిగాలి ప్రక్కలనుంచి కాబిన్‌లోనికి వీచసాగింది. కాని ఇంజనునుండి వేడి తరంగాలుగా వ్యాపిస్తుండడంవల్ల, ఆ చలిగాలులు రామదాసును అంతగా బాధించలేదు.

మూడు బస్సురోడ్లు కలిసే కూడలివద్ద నెలకొనిఉంది టీకొట్టు. టీకొట్టు కెదురుగ రోడ్డు కవతల టూరింగ్‌టాకీసు ఉంది. అది మైనపుపట్టల తోను, కొబ్బరాకు తడికలతోను కప్పబడివుంది. చలికి గడగడలాడుతూ సినిమా చూస్తున్న ప్రేక్షకులపట్ల పిసరంత సానుభూతి కలిగింది రామదాసుకు. చిన్నవాడు రామదాసు పైకప్పులేని టాకీసులలో తరచు సినిమాలు చూసేవాడు. ఆ సినిమాలకు చెందిన కరపత్రాలలో, 'విశ్రాంతి సమయమునకుముందు వర్షము వచ్చిన యెడల టిక్కెట్టు డబ్బు వాపసు ఇవ్వబడును' అని షరా ఉండేది. సినిమాకు వెళ్లేటప్పుడు తాను విధిగా గొడుగును తీసుకెళ్లేవాడు. వేసవిరోజులలో మొదటి తరగతి ప్రేక్షకులందరికి చేతి విసనకర్రలను టాకీసు మేనేజరు ఇచ్చేవాడు. కాని రామదాసు ఎప్పుడూ మొదటితరగతి టికెట్టు కొని ఎరుగడు. మూడవ తరగతి టికెట్టుకొని మెత్తని ఇసుకలో కూర్చొని వేయించిన వేరుసెనగ పప్పులను వొడిలో పోసుకుని తింటూ సినిమా చూసేవాడు. తెరమీద నటీనటులు చెప్పే ప్రతిమాటకు అతడు పగలబడి నవ్వేవాడు. అతని చుట్టూఉన్న ప్రేక్షకులు కథలో లీనమైపోయి ఉంటారుగనుక, అల్లరిచేసినప్పుడు అతనిని మందలించేవారు. ఒక్కోసారి అతడు విపరీతంగా నవ్వడం వల్ల పలకమారి ఊపిరి తిరగకుండా దగ్గువచ్చేది. అప్పుడతని ప్రక్కన కూర్చొనిఉన్న ముసలమ్మ గొంతుమీద తడుతూ, 'బయటికెళ్ళి కాసిని మంచి నీళ్ళు తాగిరా, నాయనా. కుదుటబడుతుంది' అనేది.

టీ తాగడం ముగించి క్లీనరు తిరిగొచ్చాడు. తనస్థానంలో కూర్చుంటూ, 'అబ్బబ్బ, బయట ఏం చలి! ఏం దోమలు! ప్రాణం ఆర్చుకుపోతూంది'

అన్నాడు. క్లీనరుతో బాటు డ్రైవరుకూడ రాక పోవడం రామదాసుకు నిరుత్సాహాన్ని కలిగించింది. లారీ వెంటనే బయలుదేరా లనిపిస్తూం దతనికి.

'డ్రైవరు ఎక్కడున్నాడు?' అనడిగాడతడు సీటుమీద అసహనంగా కదులుతూ.

'ఇందాక టీ కొట్లో కనిపించిన దానితో కలిసి లోపల సరసాలాడుతున్నాడు. ఇంకోగంటలో గాని తెమిలిరాలేదు' అన్నాడు క్లీనరు, తలకు మఫ్లరు చుట్టుకుంటూ.

'కుండ బద్దలుకొట్టినట్టు మాట్లాడడంలో వీళ్ళిద్దరూ ఒకరికొకరు సాటి' అనుకున్నాడు రామదాసు.

'ఆవిడకు మొగుడూ ఎవరూ లేరా ఏమిటి?' అనడిగా డతడు.

'మొగుడితో ఓ రెండేళ్ళు కాపురంచేసి ఇటీవలే ముండమోసింది. అదో—అక్కడ టీ కలుపుతున్నాడు చూశావూ—ముసలినక్క — వాడే దాని తండ్రి. బలే టెక్కుడు. నిన్నమొన్నటిదాక ఈ అంగడిముందు ఈగలుకూడ వాలేవికావు. అంగడి అలా దివాలా తీసిపోతుండగా ముసలోడికి బలే ఐడియా వచ్చింది. అత్తారింట్లోఉన్న విధవ కూతురిని తీసుకొచ్చి అంగడిలో కూర్చోబెట్టాడు. అప్పటినుండి ఈ అంగడిలో వ్యాపారం మూడుపువ్వులారుకాయలుగా సాగుతూంది' అన్నాడు క్లీనరు. అతడు పైకిలేచి ఫస్ట్ ఎయిడ్ బాక్సును తెరచి అందులోనుండి సిగరెట్ పాకెట్టును తీసుకున్నాడు. ఆ పెట్టెలో ఇంకా స్పానర్లు, మరలు మొదలైన పరికరాలు చాల ఉన్నాయి.

టూరింగ్ టాకీసులో విశ్రాంతి సమయాన్ని సూచిస్తూ బెల్లు మ్రోగింది. ప్రేక్షకులు ఔట్ పాసులు పుచ్చుకుని బయటకొచ్చారు. వాళ్లు రోడ్డు దాటుకుని కాఫీ టీలకోసం అంగడిలోకి జొరబడ్డారు. ముసలాయన తన హస్తలాఘవాన్నంతా చూపుతూ వారినందరినీ సమాధాన పరుస్తున్నాడు. ఒకచేత్తో టీలు అందిస్తూ మరోచేత్తో చిల్లరడబ్బులు తీసి ఖాళీ న్యూట్రిన్ డబ్బాలో పడేసుకుంటున్నాడు.

సినిమాటాకీసు తాలూకు వాల్‌పోస్టరొకటి టీ కొట్టు ముందు అతికించబడి ఉంది పదేళ్ల కుర్రాడొకడు ఒకచేత్తో జారిపోతున్న నిక్కరును ఎగలాగుకుంటూ మరోచేత్తో బొగ్గు తీసుకుని నాయికి ముఖాన మీసాలు దిద్దుతున్నాడు. మీసా లుండవలసిన తీరును గురించి మరో కుర్రసన్యాసి సలహా లిస్తున్నాడు. సినిమా టాకీసువారు ఆ వాల్‌పోస్టరును టీ అంగడివారిరక్షణక్రింద వదిలిఉంటారు. కుర్రాళ్ల చిలిపిపని టీ కలుపుతున్న ముసలాయన గ్రహించలేదు. అతను కళ్లకు ధరించిఉన్న దళసరి అద్దాలనుబట్టి అతనికి దృష్టిలోపమని తెలుస్తూంది. అతనిస్థానంలో ఆ 'చిన్నది' గనక ఉండి ఉంటే ఈ పాటికామె కుర్రాడి భరతం పట్టిఉండేది. చేతిలోని టీ ఫిల్టరును అలా పడేసివచ్చి కుర్రాడి రెక్కపుచ్చుకుని వీపుమీద ఒకటిచ్చి ఉండేది. దాంతో కుర్రాడు నిక్కరును వదిలేసి రెండు చేతులతో కళ్ళు నులుముకుంటూ ఏడుపు ప్రారంభించి ఉండేవాడు. ఆమె వాడిముందు కూర్చుని వాడి పాదాలమీద పడి చిన్ననిక్కరును పైకిలాగికట్టుతూ, 'వెధవ, తాటి మానులా సగానికి పెరిగావు. నిక్కరు కట్టుకోవడం తెలియదుగాని ఆడవాళ్ళ బొమ్మలకు మీసాలేస్తావా?' అంటూ గదమాయించి ఉండేది.

ఈపాటికామె డ్రైవరు కౌగిట్లో కరగిపోతూ ఉంటుంది ప్లాస్టిక్‌సంచిలోని పూలు ఆమె సిగ నలంకరించి ఉంటాయి. ఆ పూలతోబాటు ఆమె వొళ్ళు గూడ నలిగిపోతూఉంటుంది. తను తెచ్చిన పళ్లను ఆమెచేత కొసరికొసరి తినిపించి ఉంటా డతడు.

మెల్లగ తలుపు తెరుచుకుంది. డ్రైవరు వెలుపలికొచ్చాడు. చీర సవరించుకుంటూ అతని ననుసరించింది 'చిన్నది' అతడు కాబిన్‌లో కూర్చుని ఇంజన్ స్టార్టుచేస్తూ, 'నే వెళ్లిరానా' అన్నాడు.

జడను రొమ్ములమధ్య పడేసుకుని చెదిరిన జుత్తును సవరించుకుంటూ, 'వెళ్లిరా' అందామె.

హెడ్‌లైట్లు వెలిగాయి లారీ బయలుదేరింది. ఎదమీదున్న పెద్దబరువు తీసేసినట్టు ఫీలయ్యాడు రామదాసు. డ్రైవరును ఇంత తొందరగా వదిలిపెట్టిన టీకొట్టు చిన్నదానికి మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకున్నాడు

(సశేషం)

# తెలుగు నవలలో సమకాలీన జీవనం

## డా. అక్కిరాజు రమాపతిరావు

తెలుగులో మొట్టమొదటి సాంఘిక నవల సత్యవతీ చరిత్రం. దీన్ని వ్రాసింది వీరేశలింగంపంతులు. సామాజికసమస్యలను ప్రతిబింబింపజేసి తగిన పరిష్కార మార్గాలనుకూడా చూపారు పంతులుగా రీ నవలలో. సమకాలీన సాంఘికవ్యవస్థలోని లోపాలను ఇంత చక్కగా వ్యక్తీకరించిన నవలలు తెలుగులో ఆట్టే వెలువడలేదంటే అతిశయోక్తికాదు. నవౌలికంగా వెలువడ్డ తొలి తెలుగు సాంఘిక నవల ఇది. ఇది వ్రాయటానికి పూర్వమే వీరేశలింగంగారు రాజశేఖరచరిత్రమన్న నవల వ్రాసినా, అది ఒకానొక ఇంగ్లీషు నవల ఇచ్చిన ప్రేరణతో, దాని కనుసరణంగా వ్రాసింది కాబట్టీ, చారిత్రక వాతావరణమూ, అభూతకల్పనలూ దానిలో ఉన్నాయి కాబట్టీ అది సాంఘిక నవలల్లో మొదటిది కాలేదు. అయితే నాటి సమాజంలో పాతుకొనిపోయిన, మూఢాచారాలను, ఛాందసాలను, దుర్మార్గాలను, రాజశేఖరచరిత్రంలోకూడా పంతులుగారు ప్రతిబింబింపజేసి విమర్శించకపోలేదు.

సమకాలీన జీవనాన్ని యథాతథంగా నవలకు ఇతివృత్తంగా స్వీకరించినవారిలో, వీరేశలింగమే ప్రథముడు కావటం, ఆయన గొప్పతనాన్ని ఇంకోసారికూడా చెప్పుకోటానికి ఉపకరిస్తుంది. తెలుగుదేశానికి సభ్యతను, సంస్కారాన్ని అలవరచిన మహనీయుడు, పూజ్యుడు వీరేశలింగం పంతులు. తెలుగుదేశంలో అభ్యుదయ సాహిత్యానికి వికసనం వీరేశలింగంగారితోనే ప్రారంభమైంది. అభ్యుదయ సాహిత్యయుగ ప్రవర్తకుడు వీరేశలింగంపంతులే. సంఘంలో లేమినీ, లేకితనాన్ని, స్వార్థపరత్వాన్ని, కుక్షింభరత్వాన్ని, అసమానతలను, ఆయన తీవ్రంగా నిరసించాడు. అన్యాయమనేది ఏరూపంలోఉన్నా, ఎక్కడవున్నా తీవ్రమైన ఆవేశంతో, రూపుమాపేందుకు, వాచా, కర్మణా పాటుపడ్డాడు.

క్రిందటి శతాబ్దపు ఉత్తరార్థంలో, ఆంధ్రదేశంలోని సుందరము, సుసంపన్నము అయిన కోనసీమ ప్రాంతాన్ని, కథావస్తువుగా స్వీకరించి, సమకాలీన జీవనాన్ని, చక్కగా రూపొందించాడు సత్యవతీ చరిత్రంలో వీరేశలింగంపంతులు. ఆడవాళ్లు చదువుకోకపోయినందువల్ల, సంఘంలో కలిగే అనర్థాలను, ఇంత చక్కగా విప్పిచెప్పే నవల, ఇంకొకటి ఇటువంటిది, ఇంతవరకూ కూడా రాలేదంటే, ఈనవల గొప్పదనం ఎలాంటిదో తెలుసుకోవచ్చు. అయితే స్త్రీవిద్య అనేది ఇప్పుడొక సాంఘిక సమస్య కాదు. ఏది ఏమైనా నేటి సామాజిక సమస్యలను పంతులుగారిలా బలంగా చిత్రించగలవాళ్లు కనపడటం లేదు. నేడు నవల రచనలోసాధించిన పరిణితి దృష్ట్యా చూస్తే వీరేశలింగంగారి నవలల్లో శిల్పం కాని ప్రౌఢికాని కనపడవు. అయినా సామాజిక సమస్యలను విశ్లేషించి చూపటమే కాకుండా, అవి సాధించిన ప్రయోజనాన్ని కూడా, అనంతర కాలంలో రచనలు సాధించలేదేమోనంటే, ఎవరికీ అన్యాయం చేసినట్టుకాదు. ఆధునికమైన భావాలను మన్పటము, అన్యాయాన్ని, అనాగరికతను, దరిజేరనివ్వకపోవటమూ, సాహిత్యం చేయాల్సినపని. చాలా మట్టుకు ఆపనిని వీరేశలింగంగారి రచనలు నెరవేర్చాయి. ఈతొలి సాంఘిక నవల, దేశంలో బాగా ప్రాచుర్యాన్ని పొందింది. ఇందులోని కథానాయిక సత్యవతిపేరును, అటు తరువాత శిష్టులంతా తమ ఇళ్లలో ఆడబిడ్డలకు పెడుతూ వచ్చారు. ఇంతకన్నా సాహిత్యం సాధించదగ్గ ప్రయోజనం ఏముంది?

అటు తరువాత చిలకమర్తి వ్రాసిన సాంఘిక నవలల్లోకూడా, సమకాలీన జీవన పరిస్థితులను బాగా చిత్రించా డాయన. రామచంద్రవిజయమన్న నవల వీరేశలింగంగారి రాజశేఖర చరిత్రాన్ని దృష్టిలో పెట్టుకొని అంతకన్నా శిల్ప సమన్వితంగా వ్రాసిన నవల. మధ్యతరగతి కుటుంబాల జీవనస్థితులు, పల్లెటూళ్ళలో బడిపంతుళ్ళ స్థితిగతులు, అప్పటి ఆచార వ్యవహారాలు, వేశ్యల ప్రాబల్యం, పూటకూళ్ళ ఇళ్ళలో జరిగే వ్యవహారాలు చిలకమర్తి యీ నవలలో చిత్రించారు.

ఇంచుమించుగా తెలుగునవల పుట్టి వంద సంవత్సరాలైంది. మొట్టమొదటిదశలో, చారిత్రకేతివృత్తాలు, సంఘ సంస్కరణేతివృత్తాలుగల నవలలే వెలువడేవి. అటుపిమ్మట వంగసాహిత్యప్రభావము, ఆంగ్లేయ సాహిత్యంలోని కాల్పనికోద్యమప్రభావము, బాగా ఆకర్షకాలు కాగా, అపరాధ పరిశోధకనవలలు, వీరరసప్రధానమైన సాహసప్రణయోదంతాలు, కథా వస్తువులైనాయి. విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి పుట్టింతరవాత, గడిచిపోయిన చరిత్రను తిరిగి జ్ఞాపకంచేసి, జాతీయాభిమానాన్ని రగుల్కొలిపేందు కన్నట్టుగా, చారిత్రక నవలలు ఎక్కువ సంఖ్యలో వెలువడ్డాయి. స్వాతంత్ర్యోద్యమం ఇలాంటి చారిత్రక వీరగాథలకు బాగా ప్రేరణ నిచ్చింది.

అటు పిమ్మట ప్రపంచవ్యాప్తంగా వివిధ దేశాల్లోవచ్చిన ఉద్యమాలు, విప్లవాలు—అవి సాధించిన ఫలితాలు మూలంగా ఎన్నోమార్పులు కలిగాయి. రెండు ప్రపంచయుద్ధాలు వచ్చాయి. పారిశ్రామిక యుగప్రభావము, శాస్త్రీయ విజ్ఞాన పురోభివృద్ధి పాతవ్యవస్థను, పాత విలువలను పూర్తిగా తారుమారు చేశాయి. హేతువాద దృష్టి ప్రబలింది. ఆంగ్లేయ సాహిత్యప్రభావం బాగా బలపడింది. దేశీయ సాహిత్యరీతుల్లో వ్యావసాయిక వ్యవస్థ క్రమంగా పారిశ్రామిక వ్యవస్థగా రూపాంతరం చెందుతున్న క్రమ పరిణామంలో, ఆర్థిక వ్యవస్థకూడా పూర్తిగా రూపాంతరం చెందింది. ఉద్యోగావకాశాలు పెరగటమూ, చదువుకోవటమనేది ప్రతేక్యంగా సంఘంలో ఒక వర్గం వారికే పరిమితం కాకపోవటమూ, పట్టణాల అభివృద్ధి, ప్రయాణ సౌకర్యాలు వృద్ధికావటమూ, ఉమ్మడి కుటుంబ వ్యవస్థ కాలానుగుణ్యంగా మారి పోవటమూ మొదలైనవన్నీ సాహిత్యంపై తమప్రభావాన్ని చూపాయి. నవలకూడా యీ ప్రభావానికి లోనైంది. సంఘంలో బ్రతకటానికి తింటానికి, ఉంటానికి ప్రతిఒక్కరికీ సమానమైన అవకాశాలుండాలనీ, సాంఘికమైన అసమానతలు పనికిరావనీ, అంటరానితనం దురాచారమనీ, మాలపల్లివంటి నవలలు నిరూపించాయి. చీమలు పెట్టేపుట్టలు పాముల ప్రాపైనట్టుగా, సంఘంలో శ్రమించేది ఒకడున్నూ ఆ శ్రమ ఫలితాన్ని అనుభవించేది మరొకడున్నూగా చెలామణి అవుతున్న దుర్మార్గాన్ని రూపుమాపాలనే సామ్యవాద పంథా, బాగా బలాన్ని పుంజుకొన్నది. అయితే సంఘంలో వస్తూవున్న, వచ్చిన మార్పులన్నీ సాహిత్యంలో, అందునా స్వాతంత్ర్యానంతరం సాహిత్యంలో ప్రతిబింబించలేదు. కథల్లోను, నవలల్లోను, సామాజిక స్వరూపాన్ని వివరించే ప్రయత్నం కొంతవరకు కొనసాగిందనే చెప్పాలి. గుడిపాటి వెంకటచలంగారిలాంటి వాళ్ళు, అనూచానంగా వస్తూవున్న సామాజిక వ్యవస్థలోని లోపాలను, రచనలద్వారా తీవ్రంగా విమర్శించారు. అయితే ఆయన విమర్శించినవి సామాజిక సమస్యలుకాక వ్యక్తిపరమైన సమస్యలు. వ్యక్తికూడా సమాజంలో అంతర్భాగమేకాబట్టి, వైయక్తికమైన సమస్యలుకూడా సంఘపరమైనవే అని వాదించవచ్చు కాని, సామాజికమైన అవసరాలకు వ్యక్తిగత సంబంధమైన స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలకు, అంతరం వుంటుందని గ్రహించాలి. చలంగారు సాధించదలచుకొన్నది సాహిత్యం ద్వారా ఏమీ సాధించలేకపోయారనే చెప్పాలి. అయితే సంఘంలో స్త్రీ పురుషులకు మధ్యఉండే సమస్యల స్వరూపాన్ని బాగా అవగతం చేసుకొనేందుకు ఆయన రచనలు కొంతవరకు తోడ్పడకపోలేదు. స్త్రీ చదువుకోవాలనీ, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను పొందాలని, బుద్ధిమంతులైన వారందరూ చలంకన్నా ముందుగానే ప్రచారం చేశారు.

ఉదాహరణలు కావాలంటే రాజారామ్మోహనరాయలను, వీరేశలింగంపంతుల్ని చూపవచ్చు.

స్వాతంత్ర్యానంతరం తెలుగు సాహిత్యంలో నవల చాలా ప్రాచుర్యానికి వచ్చింది. బహుళ సంఖ్యలో నవలలు వెలువడ్డాయి. నవల, కథానిక, పొందిన ప్రాచుర్యాన్ని—మరే ఇతర సాహిత్యశాఖా పొందలేదనే చెప్పాలి. అయితే ఈ నవలల్లో సమకాలీన జీవనం ఎంతవరకు ప్రతిబింబిస్తున్నది అన్నవిషయం విచారణీయం. స్వాతంత్ర్యంరాకపూర్వమే తెలుగులో ఎక్కువ సంఖ్యలో నవలలు వ్రాసినవాళ్లలో విశ్వనాథ సత్యనారాయణగారు, అడివిబాపిరాజుగారు ముఖ్యులు. విశ్వనాథ నవలలు సమకాలీన సామాజిక స్వరూపాన్ని ప్రతిబింబించేవికావు. ఆయన నవలలన్నీ చాలావరకు అతివాదాలు. అపవాదాలు. బాపిరాజుగారు—నారాయణరావు, కోనంగి, జాజిమల్లి మొదలైన సాంఘిక నవలను వ్రాసినా, ఆయనగారి నవలల్లో భావనాజగత్తు, సాంఘిక సమస్యల స్వరూపాన్ని అధఃకరిస్తూ వుంటుంది. లలితకళలు, శిల్పం, సంగీత సాహిత్యాలు మొదలైనవాటి విస్తృతపరిజ్ఞానంవల్ల ఆయన నవలల్లో కవిత్వధోరణినే బాపిరాజుగారు ఎక్కువగా ప్రవేశపెట్టేవారు. అందువల్ల ఆయనగారి నవలల్లో భావనా ప్రపంచం ఎక్కువా, వాస్తవికప్రపంచం తక్కువా కనపడేవి.

గోపీచంద్ వ్రాసిన 'అసమర్థుని జీవయాత్ర', జి. వి. కృష్ణారావుగారి 'కీలుబొమ్మలు', బుచ్చిబాబు రచించిన 'చివరకు మిగిలేది' తాత్వికదృక్పథంతో వ్రాసిన నవలలు. ఈ నవలల్లో సమకాలిక సమాజ స్వరూపం కొంతవరకు కనపడకపోదుగాని, వైయక్తికమైన సమస్యలకే ప్రాధాన్యం ఎక్కువగా కనపడుతుంది. సామాజిక పరిణామవాదాల్లో వ్యక్తిపాత్రను గూర్చి బాగా విశ్లేషించి చూపే ప్రయత్నం ఈ నవలల్లో కనపడుతుంది. సాంఘికవ్యవస్థలో బలంగా నిలిచిపోయిన దృక్పథాలు, వాటి అంతర్ బాహ్య సత్వాలు, పాశ్చాత్య సంస్కృతిద్వారా, ప్రాచీనమైన వ్యవస్థలో వచ్చినమార్పు, రావలసినమార్పు, తాత్విక దృక్పథంతో ఈ నవలల్లో విశ్లేషించి చూపే ప్రయత్నం చేశారు రచయితలు.

రాచకొండ విశ్వనాథ శాస్త్రిగారి నవల, 'అల్పజీవి' సామాజిక సమాహార స్వరూపాన్ని, అందులో అంతర్భాగమైన వ్యక్తి మానసికప్రపంచాన్ని మనోవైజ్ఞానిక విశ్లేషణంద్వారా చూపేప్రయత్నం చేశారు. ఒక వ్యక్తి తాలూకు మనోబహిఃప్రపంచాలలోని కల్లోలాలు, అతడి వ్యక్తిత్వాన్ని ఏ విధంగా దిద్ది తీరుస్తాయో, పరిస్థితుల ప్రభావము, అతృప్త వాంఛలు, వ్యక్తితాలూకు మానసిక, శారీరక నడవడులను ఏవిధంగా ప్రభావితంచేస్తాయో ప్రయోగాత్మకంగా ఈనవలలో పొందుపరిచారు. అయితే ఈ నవలలో సమకాలీన జీవనం ఆంశికమాత్రంగానే కనపడుతుంది. మేధావులనే ఆకర్షించే నవ లనుకోవాలి ఇది. సామాన్య పాఠకుడికి, సామాజిక సమస్యల స్వరూపం, ఈనవలవల్ల అవగాహనఅయ్యే ఆస్కారం లేదు. వస్తువుకన్నా శిల్పానికి ఇందులో ప్రాధాన్యం ఎక్కువ.

ఉప్పల లక్ష్మణ రావుగారు రచించిన 'అతడు—ఆమె' అన్న నవలలో సాంఘిక సమస్యల స్వరూపము సమకాలీన జీవనము, విస్తృతంగా కనపడతాయి. చాలా సూటిగా, సాఫీగా, స్పష్టంగా సాగిపోయే శైలి యీనవలలోని ఆకర్షణ. అచ్చమైన తెలుగునుడికారమూ, పరిణితి చెందిన సామాజిక, రాజకీయ, సిద్ధాంతాల అవగాహన, ఈనవలను గొప్పనవలను చేస్తున్నాయి.

స్వాతంత్ర్యానంతరం, చెప్పుకోదగిన విశేషం; రచయిత్రులెందరో నవలలు వ్రాయడం. ముప్పై నలభై సంవత్సరాలక్రితం, మహిళలు ఇంత ఎక్కువగా సాహిత్యవ్యాసంగానికి పూనుకోలేదు. పత్రికలు చదివేవారి సంఖ్య బాగా వృద్ధికావడంతో, రచయితల సంఖ్యకూడా బాగా పెరిగింది. అయితే ఈ రచనల్లో సమకాలీన సాంఘిక జీవనాన్ని, సామాజిక సమస్యల స్వరూపాన్ని చూడవలెనని ఆశించి ప్రయోజనంలేదు. అపరిణితమైన ఊహాలోకము అయథార్థ

మైన సంఘటనలు, హఠాత్సంభవాలు, కథా వస్తువులుగా వుంటాయి. ఎంతకాలం క్రితమో చెల్లిపోయిన సాంఘిక వ్యవస్థను చిత్రించటానికి పూనుకోవటమూ, నాటకీయమైన ధోరణి, తమకు తెలియని, తాముసంచరించని, పైఅంతస్తు లేహ ఆడుగు పొరల జీవితాల సాంఘికవ్యవస్థను వర్ణించబోవడము, గృహచ్ఛిద్రాలు, భార్యాభర్తలపట్ల అపోహలు అనుమానాలు, అత్తగారి సాధింపులు ఇంకా యీ కాలంలో కూడా కోడంట్రికమూ, పెళ్ళికాక ముందే గర్భధారణ, ఆ తరువాత ప్రేమికుడు ప్రేమికురాలిని దిగవిడిచి మోసగించటము. సాంఘిక దుష్టశక్తులతో ఆ అబల వొంటరిగా పోరాడటమూ, ఆత్మహత్య లేదా పశ్చాత్తాపమూ, ఇన్నీ మూసపోసిన సన్నివేశాలు, రచనల్లో కనపడుతూనే ఉన్నాయి. ఎంతకాలంక్రితం పోయిందో జమీందారీ వ్యవస్థ, అయినా ఒక జమీందారు వుండటమూ, ఆయనకు కొందరు కూతుళ్ళు, ఇంకా కొందరు కొడుకులు, వాళ్ళ అతిశయాలు, యీ వృత్తాంతాలు సినిమాల్లాగా చెల్లుబడికావటమూ, ఆ రచయిత్రులు లేదా రచయితలకు గొప్పపేరుప్రఖ్యాతులు, సాహిత్య పరిషత్తుల గుర్తింపులూ రావడమూ, సమకాలీన సాహిత్య స్వరూపంగా కనపడుతున్నది.

సమాజంలోను, సాహిత్యంలోను కూడా ప్రధానంగా ఇప్పుడు రెండు ధోరణులున్నాయి. ఒక ధోరణి సామాన్యప్రజలను, అజ్ఞానంలోను, అవివేకంలోను, ఉంచాలనే బలమైన ప్రయత్నంతో కూడుకొన్నది. రెండోవర్గం ధోరణి ప్రజల్లో అమితమైన అశాంతిని, ఉద్రేకాన్ని, చిత్తవిభ్రమాన్ని కల్పించాలనేది. ఈ రెండు ధోరణులవల్లా సామాన్యప్రజలకు సుఖశాంతులు కలగవు. ఎక్కువగా కష్టపడేది, నష్టపడేదికూడా ఎప్పుడూ సామాన్యప్రజలే. ఒక్కకలకనగానే తెల్లవారదన్నట్లు, ఒక్కవిప్లవంద్వారాను, ఒక్కతిరుగుబాటు ద్వారాను, ఒక్కరక్తపాతంద్వారాను, పావన నవజీవన బృందావనం రూపొందుతుం దనుకోవడంలో అర్థం లేదు. అయితే విప్లవం, తిరుగుబాటు, మార్పు శాశ్వతంగా కొనసాగుతూ వుండవలసిందేననటం, కొందరి స్వప్రయోజనాలను సాధించటానికి, కొందరిని గొప్పవాళ్ళను చేయటానికీమాత్రమే ఉపకరిస్తుంది.

మనిషి మారందే, మనిషి మనిషిని సమ్యగవగాహనతో అర్థంచేసుకోందే, ఎన్ని సామాజిక పరిణామాలు వచ్చినా, ఎన్నినినాదాలు వచ్చినా, నీతులు వల్లించినా ప్రయోజనంలేదు. ఏభై సంవత్సరాల క్రితం సంఘంలో అవాంఛనీయమైన ధోరణులెన్నో వుండేవి. ఆడవాళ్ళు చదువుకోకూడదనటం, చిన్నతనంలోనే పెళ్ళి చెయ్యాలనటం, మగవాళ్ళతో సమానంగా ఆడవాళ్ళు నవసమాజ నిర్మాణంలో భాగస్వామ్యం వహించకూడదనటం మొదలైనవి. వాటన్నిటిని అధిగమించాము. స్వతంత్రంవస్తే, సమత, సౌహార్దం, సౌభ్రాతృత్వంతోకూడిన సమాజం రూపొందుతుందనుకొన్నాము. కాని యీ ఇరవైమూడు సంవత్సరాలలో ఏమైంది? పెట్టుబడిదారీ వ్యవస్థ బలాన్ని పుంజుకొన్నది. అవినీతి పెరుగుతున్నది. క్లబ్బులలో విలాసజీవితం గడిపేవర్గం వృద్ధిచెందుతున్నది. తాగుబోతుతనం ఎక్కువైంది.

ప్రజాస్వామిక వ్యవస్థలో, పాలకులలో సామాజిక న్యాయాన్ని అనుశాసించే శ్రద్ధాసక్తులు, శక్తిసామర్థ్యాలు, సన్నగిల్లినప్పుడు, అనేకమైన వికృతధోరణులు, విపరీతధోరణులు, సంఘంలో పుట్టుకొనివస్తాయి. నీతిబలంలేని పురోహితులవల్ల మతం పాడైపోయినట్లుగా, నిజాయితీలేని పాలకులవల్ల సాంఘిక వ్యవస్థలో హెచ్చుతగ్గుల అంతరాలు ఎక్కువై అవాంఛనీయమైన పరిణామాలు వస్తాయి. ఫలితం, అశాంతి, అరాచకం, ఆందోళన—అలజడి. ప్రస్తుతం నడుస్తున్న చరిత్ర ఇది.

అయితే ఈ అవగాహన రచయితలలో చాలవరకు లేదేమో ననిపిస్తున్నది. మన తెలుగు నవలల్లో సామాజిక స్వరూపాన్ని శక్తిమంతంగా చిత్రిస్తున్న

ధోరణి ఇప్పుడు ఎక్కువగా కనిపించటం లేదు. గత కాలంలోనూ, లేకపోతే ఊహలకు రెక్కలు కట్టుకొని విహరిస్తున్నారు రచయితలు. కాలక్షేప ధోరణితో వెలువడ్డ ఇంగ్లీషు నవలలను దృష్టిలో పెట్టుకొని వాటికి అనుకృతులుగా, అయథార్థ సన్నివేశాలను కల్పనలను, సృష్టిస్తూ నవలలు రచిస్తున్నారు కొందరు అన్నప్రథకూడా వినపడుతున్నది. అయితే పల్లెటూళ్లను ప్రభావితం చేస్తున్న రాజకీయ పరిస్థితులు, కులతత్వాలు, ఎన్నికలు, నగరజీవనంపట్ల ఆకర్షణలు, కథావస్తువులుగా స్వీకరించి, కొందరు నవలలు ఇటీవల వ్రాశారు. ఆ నవలలు కోరిన ప్రయోజనాన్ని సాధించాయనే చెప్పాలి. ఈ నవలల్లో సామాజిక స్వరూపమూ, సమకాలీన జీవనమూ బాగా ప్రతిబింబితమైనాయి. ఇటీవల ఏ సాహిత్య ప్రక్రియ లోనూ వెలువడనంత అధిక సంఖ్యాకంగా నవలలు వెలువడుతున్నాయి. ఇప్పటి సాంఘిక సమస్యలను రాజకీయ వాతావరణాన్ని చిత్రించే నవలలు యువ తరం వాళ్లు వ్రాస్తూనే వున్నారు. పత్రికలు రెండు మూడు నవలలను ధారావాహికంగా ఎప్పుడూ ప్రకటిస్తూనే వున్నాయి. రచయితలకు నవలలు వ్రాయాలనే ఉత్సాహంకూడా పత్రికాధిపుల, ప్రచురణకర్తల, ప్రోత్సాహంవల్ల ఇనుమడిస్తూవున్నది. అయితే వీటన్నిటా ఆలోచనను రేకెత్తించే నవలలుమాత్రం చాలా తక్కువ గానే వస్తున్నాయని చెప్పాలి. సమకాలీన జీవనానికి అతీతంగా, ఏకాలంలోను, ఏదేశంలోను, సాహిత్యం వుండటానికి వీలులేదు. సామాజిక పరిణామాలనుబట్టే సాహిత్యాభిరుచులు, సాంఘికావసరాలు రూపొందుతుంటాయి. కొంతలో కొంత ఈసత్యాన్ని మనం తెలుగు నవలలోకూడా చూడవచ్చు. పాఠకులలో వివేచనాశక్తి పెరిగి, ఉత్తమ సాహిత్యాభిరుచులు పెంపొందినదాకా అసంతృప్తి కరమైన పరిస్థితులు తప్పవు. దానికి ప్రజల్లో విద్యావిజ్ఞానాలు, వివేకమూ పెంపొందాలి. దీనికి దేశరాజకీయాలు, సామాజిక స్వరూపమూ దోహదంచేయాలి. అప్పుడే మంచి సాహిత్యము, దానికితగ్గ ఆదరణా దేశంలో వృద్ధి పొందుతాయి.

---



# సాహితీ జగతి

## శ్రీ 'చే. రా.'

**1971** జనవరి 'భారతి'లో గ్రంథ విమర్శలు శీర్షికకింద శ్రీ కాళూరి హనుమంత రావుగారి 'సాహితీ జగతి' అనే పుస్తకానికి నేను చేసిన సమీక్ష ప్రకటించబడింది. అందులో కొన్ని విషయాలు శ్రీ హనుమంతరావుగారికి నచ్చలేదు. వారు 1971 మార్చి నెల భారతిలో నా అభిప్రాయాలను కొన్నిటిని విమర్శించారు. అందువల్ల సమాధానం చెప్పుకోవాల్సిన బాధ్యత నా మీద ఉంది.

గ్రంథ విమర్శలకు ఒక లిఖితమైన నిబంధనావళి లేదు. గ్రంథంలో మంచి చెడ్డలను పాఠకులకు తెలియజెప్పటమే స్థూలంగా విమర్శకుడి బాధ్యత అని అంతా అంగీకరిస్తారు. దూషణలకు దూరంగా ఉంటూ గ్రంథాన్ని గురించి తనకు తోచిన అభిప్రాయాలను విమర్శకుడు నిర్భయంగా చెప్పాలని నా మతం. ఇందులో 'ఆధిక్యదృష్టికి', 'దర్జా'కి ప్రసక్తి లేదు. ఒక గ్రంథాన్ని, ఆ గ్రంథంలో వ్యక్తమయ్యే గ్రంథకర్త ప్రతిభనీ, దృక్పథాన్ని అంచనావేసే అధికారం విమర్శకుడికి ఖచ్చితంగాఉంది. ఇట్లా అంచనా వెయ్యటం గ్రంథకర్తకన్నా విమర్శకుడు అధికుణ్ణి అని అనుకోవటంవల్లకాదు. 'ప్రౌఢవ్యాకర్తకి మంచి పరిశీలనఉందిగాని, సూత్రరచనలో నేర్పులేదు'అని ఎవరైనా రాశారనుకోండి. ఇట్లా రాయటానికి విమర్శకుడు ప్రౌఢవ్యాకర్తకన్నా గొప్పవాణ్ణిఅని అనుకోనక్కర్లేదు. అట్లా అనుకున్నాడని అనటానికి మనకిది సాక్ష్యంకూడా కాదు. కొన్నిసాహిత్య సిద్ధాంతాల్ని విమర్శించేటప్పుడు చూపిన హేతువాదదృష్టిని భాషను గురించి రాసేటప్పుడు శ్రీ హనుమంతరావుగారు చూపించలేదని నే నభిప్రాయపడ్డాను. అందువల్ల వారి హేతువాదదృష్టి పరిమితమన్నాను. ఇట్లా అంటానికి సమీక్షకుడికి లైసెన్సు ఉందనుకుంటున్నాను. ఇందులో శ్రీ హనుమంతరావుగారికి భేదాభిప్రాయం ఉండవచ్చు. పత్రికల్లో సమీక్షలకు పరిమితులను నిర్ణయించవలసింది గ్రంథకర్తలు కాదని నా అభిప్రాయం.

ఈ వ్యాసంలో ముందు సాహిత్యవిషయాల్ని ప్రస్తావించదల్చుకున్నాను. తరవాత అవసరమనుకుంటే భాషను గురించి వారి సందేహాల్ని గూడా ప్రస్తావిస్తాను.

'ప్రపంచంలో అన్నీ మారుతున్నాయి. కాని శాశ్వతమైనది, స్థిరమైనది, సార్వజనికమైనది సాహిత్యం: ఇది సర్వమతాలకూ, సకల శాస్త్రాలకూ అతీతమైనది' అని శ్రీ హనుమంతరావుగారు సాహిత్య ప్రయోజనము (పేజీ 112) అనే వ్యాసంలో అన్నారు. 'సాహిత్యమంతా తాత్కాలిక సంఘాభ్యున్నతికి ఉపయుక్తమై తీరాలనటం...చాలా హ్రస్వదృష్టి, సంకుచితాభిప్రాయం' అని కూడా రాశారు. దీని ఆధారంతో సమకాలపు సంఘప్రయోజనానికి ఉద్దేశించిన సాహిత్యంమీద వారికి చిన్నచూపు ఉన్నదని అభిప్రాయపడ్డాను. సర్వకాలాలకు ఒకేరకమైన సంఘప్రయోజనం ఉండదు. ఇక్కడ 'తాత్కాలిక' శబ్దార్థాన్ని గ్రహించటంలో ఎవరూ భ్రమపడే అవకాశం లేదు. ఇట్లా కాలనిబద్ధమైన ప్రయోజనాని ఆశించిన సాహిత్యం ఉత్తమసాహిత్యం కాకుండాపోదు. ఒక సాహిత్యం సంఘప్రయోజనాల్ని అనుసరించి మారుతుందని, ఇది కూడా శాశ్వతమూ స్థిరమూ కాదని నేను చెప్పదల్చుకున్నది. మారదనుకోవటం 'రొమాంటిక్ భావన' అన్నాను. శ్రీ హనుమంతరావుగారు 'ఇటువంటి మహాప్రయోజనంకల సాహిత్యాన్ని అల్పమైన తాత్కాలిక సంఘప్రయోజనానికి మాత్రమే ఉద్దేశించాలనడం దేవుడు ప్రత్యక్షమైతే

మోక్షం కోరుకోనకుండా నూరురూపాయలనోటు ఇమ్మని అడగడంవంటిది'అనికూడా రాశారు. ఇక్కడ 'అల్పమైన తాత్కాలిక సంఘ ప్రయోజనం'అన్న మాటలు కూర్పుకు రెండర్థాలు సాధ్యమవుతై. 1. తాత్కాలికసంఘ ప్రయోజనం అల్పమైనది. 2. తాత్కాలికసంఘ ప్రయోజనాల్లో కొన్ని అల్పమైనవి అని. ఇందులో నేను మొదటి అర్థాన్నే గ్రహించాను. రెండో అర్థం గ్రహించాలేమో తెలీదు. రెండో అర్థాన్నే గ్రంథకర్త ఉద్దేశిస్తే నాకు పేచీలేదు. కాని అట్లా ఉద్దేశించినట్లు నాకు బలమైన సాక్ష్యం దొరకలేదు.

'ఎవరి జీవితంలో విశేషంఉండి అది పరీక్షితమవుతుందో వారి కథ కావ్యేతివృత్తం కాజాలుతుంది అని నేను ఇతివృత్త లక్షణాన్ని చెప్పాను' అని శ్రీ హనుమంతరావుగారు మార్చినెల భారతిలో రాశారు. అంతేకాదు. 'సామాన్యుడి జీవితంలోనూ సంఘర్షణ ఉంటుందని అంగీకరించటానికి హనుమంతరావుగారికి అభ్యంతరమేమిటో నా కర్థంకాదు'అని జనవరి భారతిలో నేను రాసినదానికి 'నాకేమీ అభ్యంతరంలేదు. ఉన్నట్లు నేనా వ్యాసంలో వ్రాయనూలేదు'అని కూడా రాశారు మార్చినెల భారతిలో. దీనికి నేనేమీ వ్యాఖ్యానించను. వారి పుస్తకంలో వాక్యాలు కొన్ని ఎత్తి చూపుతాను. వాటి అర్థనిర్ణయాన్ని 'రచయితనూ, సమీక్షకుడినిమించిన విద్యావివేకసంపన్నులైన పఠితలకే, వదిలేస్తాను. ఇక వారి వాక్యాలు గమనించండి.

'రాముడు, దశరథుడు...వీళ్ల జీవితాలలో జరిగిన ప్రచండసంఘర్షణలు ఆఫీసు ఉద్యోగులు, వారి భార్యలు, కూలీలు మొదలైన సాధారణ మానవులలో ఏర్పడడానికి అవకాశం తక్కువకదా!' (పేజీ 118).

'నేటి యాంత్రికమైన జీవితంలో మనిషిలో కథానాయకుడు కాగల గాంభీర్యం ఉండడంలేదు.' (పేజీ 119).

'Antony మరణంలో ప్రదర్శితమైనంతటి జీవితపులోతు, సైనికుని మృతిలో ప్రదర్శితంకాదు' (పేజీ 123).

'నేటి సమాజంలో మనిషి వ్యక్తిత్వం పరిపూర్ణంగా వికసించి అతని విశిష్టత బహిర్గతంకాగల అవకాశాలు అంతగాలేవు. కనుకనే నేటి మనిషికి ప్రాయశః కథానాయకుడు కాగల శక్తి క్షీణించింది.'

కలకత్తా సముద్రతీరాన ఉందనటం Factual mistake అని, దానికీ కల్పనకు తేడా ఉందనీ, మొదటిది సమర్థనీయంకాదనీ నా విమర్శలోఅన్నాను. అది సాహిత్యకారుడి అజాగ్రత్తను సూచిస్తుంది. అది పరిహరణీయం అని నా అభిప్రాయం. జాగ్రత్తగల పాఠకులు తప్పకుండా దాన్ని గమనిస్తారు. ముళ్లపల్లె, మర్రిచెట్టు కథవేరు. ప్రసిద్ధ ప్రదేశాలనుగురించి తప్పుగా రాయటం సాహిత్యకారుడు చెయ్యగూడని పని. 'దంపతులు విశాఖపట్నంలో చార్మినార్‌ని దర్శించారని, ఒక విద్యార్థి హైదరాబాదులో స్టీమరెక్కి బెజవాడ, వెళ్లాడని' ఎవరైనా రచయిత రాస్తే నేను హర్షించలేను. ఏ 'వెలుగు'లో చూసినా అది నాకు సమర్థించ తగినంతగా కనపడటంలేదు.

'ఆంధ్రకవితా సరస్వతికి బరువు నగలు' అనే వ్యాసంలో యతిప్రాసలు కవితా రచనకు ప్రతిబంధకాలని శ్రీ హనుమంతరావుగారు ప్రతిపాదించారు. ఆ విషయాన్ని నా విమర్శలో ప్రస్తావించాను. దానితో నాకు భేదాభిప్రాయంలేదు. వారు చూపిన ఉదాహరణలు కన్విన్సింగ్‌గా ఉన్నై. ఇంతకన్నా దాన్ని గురించి పట్టించుకోవాల్సింది ఏముంది? అయితే గణాలూ ఛందస్సు విషయమే గనుక, ఇవిమాత్రం ప్రతిబంధకాలు కావా? అని అడిగాను. యతిప్రాసల్నిగురించి చెప్పిన రచయిత గణాల్నిగురించికూడా ప్రస్తావిస్తే బాగుండేదని దానిభావం. సమీక్షకుడు గ్రంథంలో ప్రతిపాదించిన విషయాలతోపాటు, వాటికి దగ్గరిసంబంధంఉన్న విషయాల్ని ప్రస్తావించవచ్చు. నిజానికట్లా చెయ్యాలి కూడా. ఇంగ్లీషులో అట్లాంటి సంప్రదాయంఉంది. ముఖ్యంగా Professional Journals లో తరచుగా సమీక్షకు లీ పని చేస్తుంటారు. శ్రీ హనుమంతరావుగారు తమ విమర్శలో విమర్శకులు, సమీక్షకులు చెయ్యాల్సినపనులనుగురించి, చెయ్యగూడని పనులను గురించి రెండుమూడుచోట్ల ప్రస్తావించారు. సమీక్షకులకు వారు సూచించిన limitations తప్పకుండా

పాటించవలసినవిగా నాకు తోచదు. గ్రంథవిమర్శల పరిధి వారనుకునేంత సంకుచితంకాదు.

శ్రీ శ్రీ కవిత్వాన్ని వ్యాఖ్యానించిన ఒకటి రెండుచోట్ల నేను హనుమంతరావుగారితో భేదించాను. శ్రీ శ్రీ కవిత్వప్రసక్తి వచ్చినప్పుడల్లా రాజకీయాల ప్రస్తావన సహజంగా వస్తుంది. మహాప్రస్థానం, దేశ చరిత్రలు అనే గీతాలకు మార్క్సిస్టు సిద్ధాంత ప్రేరణఉందిఅని నా వాదం. అందువల్ల శ్రీ శ్రీ కవిత్వాన్ని వ్యాఖ్యానించేటప్పుడు ఆ సిద్ధాంత పరిచయం (నా విమర్శలో 'పరిజ్ఞానం'అనే పెద్దమాట వాడాను. నిజానికి నే నుద్దేశించింది పాండిత్యంఅనికాదు. పరిచయం మాత్రమే. మార్క్సిస్టు సిద్ధాంతంలో పాండిత్యంఉందని చెప్పుకోగలిగినవారు ప్రపంచంలోనే చాలా కొద్దిమంది ఉంటారు.) అవసరమని నా ఉద్దేశం. శ్రీశ్రీతో ఒక చిక్కుంది. 'మహాప్రస్థానం' గీతం రాసేనాటికి నాకు మార్క్సిజం తెలీదంటున్నారు. దాన్ని హనుమంతరావుగా రుదాహరించారు. శ్రీశ్రీకి మార్క్సిజం చాలా స్థూలంగామాత్రమే తెలుసునని రమణారెడ్డివంటి విమర్శకు లభిప్రాయ పడుతున్నారు.

శ్రీశ్రీకి మార్క్సిజం ఎంత తెలుసు? అనే చర్చవల్ల ప్రయోజనంలేదు. శ్రీశ్రీయే తనకు 'మహాప్రస్థానం' గీతం రాసేనాటికి మార్క్సిజం తెలీదనటమేకాక రష్యన్ విప్లవాన్నిగురించికూడా తెలీదంటున్నారు. కమ్యూనిస్టు ఉద్యమప్రభావం ఆయన రచనలమీద ఉందాలేదా అన్నదే మనం ఆయన సాహిత్యాన్నిబట్టి తేల్చగలం. 'మహాప్రస్థానం' గీతం చివర 'ఎర్రబావుటా నిగనిగలు'అనే చరణంలో 'ఎర్రబావుటా' కమ్యూనిస్టుల జెండాఅనితప్ప ఇంకో అర్థం చెప్పటానికి వీలుపడడంలేదు. 'ఎర్రబావుటా నిగనిగల్ని' చూడమంటూ 'పదండి ముందుకు' అంటే కవి ఉద్దేశంలో 'మరోప్రపంచం' అనేది సామ్యవాద సమాజం అని తప్ప వేరుగా వ్యాఖ్యానించటం కుదరదు. 'హరోం హరోం హర, త్రేతాగ్ని, ధనంజయునిలా, హోమజ్వాలలు' అనే పదాలప్రయోగం ఈ వ్యాఖ్యకు ప్రతిబంధకం కాదు. ఇవి కేవలం సంకేతప్రాయాలు. ఆధునికభావం చెప్తున్నప్పుడుకూడా ప్రాచీనతా సూచకాలయిన సంకేతాలను విరివిగావాడే అలవాటు శ్రీశ్రీకి ఉంది. 'ప్రతిజ్ఞ' అనే గీతంలో లండన్‌లో ఏర్పాటైన అభ్యుదయ రచయితలసంఘం Manifesto లోని భావాలను శ్రీశ్రీ తీసుకున్నారని రమణారెడ్డి గారు అభిప్రాయపడుతున్నారు. (చూ. శ్రీశ్రీ, సాహిత్యం–2. పేజీ 11). అందులోనూ 'స్వస్తి వాక్యములు సంధానిస్తూ', 'భావివేదములు' అనే ప్రయోగాలు చేశారు. ఇది 7—5—1937 న రాశారు. అదే సంవత్సరంలో రాసిన 'కవితా' అనే గీతంలో 'చిరదీక్షా తపస్సమీక్షణలో, నిశ్చలసమాధిలో', 'నిర్వికల్ప సమాధిలో నా ప్రాణం నిర్వాణం పొందిందో, అటు నను మంత్రించిన...' వంటి ప్రయోగాలున్నై. 1938 లో రచించిన 'జ్వాలాతోరణం'లో హిరణ్యనేతుడు, కురుక్షేత్రం, క్రుద్ధవృకోదరుడు, వంటి శబ్దాలు కనిపిస్తై. 1940 లో రాసిన 'జగన్నాథుని రథచక్రాలు'లో 'నటధూర్జటి నిటాలాక్షి పగిలిందట' అని రాశారు. ఈ ప్రయోగాల్ని ఇంత ఎక్కువగా ఇయ్యటానికి కారణం, శ్రీశ్రీ కవిత్వంలో ఇవి ఎంత విస్తృతంగా ఉన్నయ్యో చూపించటానికే. అందువల్ల 'మహాప్రస్థానం' అనే గీతానికి కమ్యూనిస్టు ఉద్యమం ప్రేరణ ఉందనటానికి 'ధనంజయుడు, హోమజ్వాలలు' వంటి ప్రయోగాలు బాధకం కావు.

శ్రీశ్రీ 'దేశ చరిత్రలు' అనే గీతం 19-4-1938 లో రచించారు. ఆ గీతానికి మార్క్సిస్టు సిద్ధాంతంలో ఒక భాగమైన Dialectical materialism ప్రేరణ ఉందని, నేనే కాదు, చాలామంది విమర్శకులు అభిప్రాయపడ్డారు. ఈ గీతం రాసేనాటికి శ్రీశ్రీకి మార్క్సిస్టు సిద్ధాంత పరిచయం లేదనలేం. 14—5—37 న రాసిన 'ప్రతిజ్ఞ'లో లండన్ అభ్యుదయ రచయితల సంఘం Manifesto ప్రభావం ఉన్నప్పుడు తరవాత సంవత్సరకాలంలోనయినా శ్రీశ్రీ కొన్ని మార్క్సిస్టు గ్రంథాలు చదివివుండటానికి అవకాశం వుంది. మార్క్సిస్టుసిద్ధాంతాన్ని గురించి తెలుసుకోదలచినవారు (Communist manifesto) అయినా చదువుతారు. మార్క్సు ఎంగెల్సుల మిగతా గ్రంథాల్లో ఉన్నంత

జటిలత ఇందులో లేదు. 1938 నాటికి తనకు మార్క్సిజాన్ని గురించి తెలియదని శ్రీశ్రీ కూడా అనలేదు. అందువల్ల ఈ గీతాన్ని వ్యాఖ్యానించే ముందు ఇందులో కవి ప్రధానంగా చెప్పదల్చుకున్న భావాల స్వరూప స్వభావాలను గురించి కొంతవరకు తెలుసుకోవలసిన అవసరం విమర్శకుడికి ఉంది. లేకపోతే పొరపాటు వ్యాఖ్యానాల కవకాశం ఉంది. ఆ సందర్భంలోనే 'సంవేదన' అనే పత్రిక సంచికల్లో జరిగిన చర్చను పేర్కొన్నాను. అందులో రాచమల్లు రామచంద్రారెడ్డిగారు కూడా నాలాగానే అభిప్రాయ పడ్డారు. అయితే 'ఇతరేతర' శబ్దానికి వా రిచ్చిన 'పరస్పర' అనే అర్థం (ఆ శబ్దానికా అర్థం ఉందని ఆయన చాలా ప్రయోగాలు కూడా చూపించారు) కవి ఉద్దేశించలేదని తరవాత రాసిన ఒక గీతంలో 'ఇతరేతర దేశాల్లో సతమతాల సంగతేల?' అనే ప్రయోగంవల్ల తేలింది. తరవాత శ్రీశ్రీయే 1968 లో జరిగిన ఇంటర్వ్యూలో కూడా ఈ సంగతి చెప్పారనుకోండి. దీనివల్ల శ్రీశ్రీ కవిత్వాన్ని వ్యాఖ్యానించటానికి మార్క్సిస్టు సిద్ధాంత పరిచయం అవసరం అనే ప్రధాన ప్రతిపాదన తప్పని తేలలేదు. 'ఇతరేతర' శబ్దానికి సాధ్యమైన రెండర్థాలలో రామచంద్రారెడ్డిగారు గ్రహించిన అర్థం ఒకటైతే, శ్రీశ్రీ ఉద్దేశించింది ఇంకొకటి అని మాత్రమే తేలుతుంది. ఒక శబ్దార్థం విషయంలో వచ్చిన భేదాభిప్రాయంవల్ల ప్రధాన ప్రతిపాదన వీగిపోలేదు. 'శ్రీశ్రీ కవిత కేవల రాజకీయ సిద్ధాంత దృష్టితోచేసే వ్యాఖ్యానాలకి లొంగదు' అని రాశారు హనుమంతరావుగారు. ఎవరు కాదన్నారు?' కేవల సాహిత్యదృష్టితోచేసే వ్యాఖ్యానాలకు కూడా లొంగదనే' నే ననేది.

'భిక్షువర్షీయసి' అనే ఖండికలో 'ఎముక ముక్క కొరుక్కుంటు ఏమీ అనలేదు కుక్క, ఒక ఈగను పడవేసుక తొందరగా తొలగె తొండ' అనే పాదాల్లో పేర్కొన్న జంతువులు తమ తమ పనులలో మునిగిఉన్న మనుషులను సూచించటానికి సమర్థం కావంటారు — శ్రీ హనుమంతరావుగారు. ఇందులో వాటి నైసర్గిక స్వభావ వర్ణన ఉండొచ్చు. పట్టించుకోకుండా తమ తమ పనుల్లో మునిగిపోయిన మనుషుల్ని ఎందుకు సూచించలేవు? 'ఎంగిలాకు'లోనూ; 'వెర్రిగాలి'లో జరిగిన మానవత్వారోపణ కుక్క, తొండల విషయంలో జరగలేదని శ్రీ హనుమంతరావుగారి సమాధానం. 'ప్రశ్నించు' అనే క్రియవల్ల వెర్రిగాలిలోను, 'అను' అనే క్రియవల్ల 'ఎంగిలాకు'లోను మానవత్వారోపణ జరిగింది. భాషాప్రయోగం మానవ జాతికే సాధ్యం కాబట్టి గాలి, ఆకు మాట్లాడినట్టు చెప్పటంవల్ల ఈ ఆరోపణ జరిగింది. 'మాట్లాడింది' అన్నప్పుడున్న మానవత్వారోపణ 'మాట్లాడలేదు' (భూతకాలార్థంలో) అని అన్నా ఉంటుంది. 'ఎముక ముక్క కొరుక్కుంటూ ఏమీ అనలేదు కుక్క' అన్నప్పుడు కూడా వచ్యర్థకధాతుప్రయోగంవల్ల కుక్కలో మానవత్వారోపణ ఉన్నట్టే, ఒక వరసలో ఒకేరకపు భావాన్ని చెప్తూ అదే Stanza లో ఉన్న 'తొండ'కి పై ఆరోపణమ అన్వయించుకోటం దూరార్థం ఏమీకాదు. కవి 'యదభిముఖంగా రచన చేశాడో తదభిముఖంగా' పరిశీలిస్తే తోచే విషయమే ఇది. ఇక ఇక్కడ 'ఎముక ముక్క కొరుక్కుంటు' అన్న ప్రయోగంవల్ల మానవత్వారోపణకు భంజకం కాదా అన్న సందేహం రావచ్చు. అట్లయితే 'ఎగిరివచ్చి ఎంగిలాకు' అన్నప్పుడూ ఆ ప్రమాదం లేకపోలేదు. ఎంత మానవత్వారోపణ జరిగినా, ఇవి మానవభిన్నమైన జంతువులు, వస్తువులు అన్న జ్ఞానం పూర్తిగా మాసిపోదు.

ఇక భాష—వ్యాకరణం విషయంలో శ్రీ హనుమంతరావుగారికి సందేహాలు కొన్ని ఉన్నై. నా అభిప్రాయాలు సమీక్షలో స్పష్టంగానే చెప్పాను. వీటిని ఇంతకన్నా విపులంగా వేరేచోట్లకూడా చెప్పాను. అవన్నీ శ్రీ హనుమంతరావుగారు చూసేఉంటారు. అయినా వాటిని వారు ఒప్పుకోటంలేదు. వీటిని గురించి క్లుప్తంగా ఇక్కడ ప్రస్తావిస్తాను. సంపూర్ణ వివరణకి ఇక్కడ సాధ్యంకాదు. వీలైతే ఇంకోసారి వేరే వ్యాసంలో నా ప్రతిపాదనలు విపులంగా రాస్తాను.

స్వభాషా వ్యవహర్తలందరి మనస్సుల్లోనూ వ్యాకరణం అలిఖితంగా ఉంటుందని నేను రాశాను

'అట్లాంటిదేమీ ఉండదు పొమ్మం'టున్నారు హనుమంతరావుగారు.

శ్రీ హనుమంతరావుగారు సంస్కృతభాషలోని 'క్త' ప్రత్యయాన్ని గురించి ప్రస్తావించారు. నేను చెప్పింది స్వభాషా వ్యవహర్తల సంగతి. తెలుగులో ఒక్క సంస్కృతపదాలేకాదు, ఇంగ్లీషు, ఫ్రెంచి పదాలు అవసరమనుకుంటే ఎవరైనా ప్రయోగించవచ్చు. అందుకు క్రమంగా ఇంగ్లీషు, ఫ్రెంచిభాషల పరిచయంకాని, వాటి లిఖిత వ్యాకరణాల పరిచయంకాని అవసరం. అదీగాక వ్యాకరణం అంటే కేవలం శబ్దరూప సాధనమేకాదు. అంతకన్నా ముఖ్యమైంది వాక్య నిర్మాణం ఉంది. కేవల శబ్దాలకూర్పువల్ల మాత్రమే వాక్యనిర్మాణం జరగదు.

భాషలో స్థాయి భాషేతరకారణాలవల్ల నిర్ణయింపబడుతుందని నా వాదం. అందుకు సంఘంలో వ్యవహర్తలకున్న స్థితిగతులు కారణాలు. మనం అనుకునే శిష్టవ్యావహారికం 'అశిష్ట' భాషకన్నా ఎక్కువ వ్యాకరణ సమ్మతం కావటంవల్ల శిష్టవ్యావహారికం కాలేదు. శిష్టులనబడేవాళ్లు వ్యవహరించేభాష కావటం శిష్టవ్యావహారికం అంటున్నాం. శిష్టులకు భాషా విషయంలో జాగ్రత్త ఉంటుందనీ, అశిష్టులకు ఉండదనీ అనటానికి ఆధారంలేదు. భాషలో చాలా ప్రాచీన రూపాలు అశిష్టుల్లోనే దొరుకుతుంటై. భాషా పారిశుద్ధ్యం అంటె ఏమిటి? కాలపరిణామంలో ఒకప్పటి భాషను అట్లాగే వాడటమా? అప్పటిభాషే పరిశుద్ధమైనదని ఎందుకనుకోవాలి? పూర్వ పూర్వరూపాలు ఇంకా పరిశుద్ధమైనవని ఎందుకనుకోగూడదు? లేక భాషాపరిణామంలో ఒక దశ మాత్రమే అంతకుపూర్వపు దానికన్నా, తరవాతదానికన్నా ఎక్కువ పరిశుద్ధమైనదని అనుకోవాలా? అందువల్ల 'భాషా పరిశుద్ధి'ని ఆధునిక శాస్త్రజ్ఞు లంగీకరించరు.

భాష మాటిమాటికీ మారిపోయి క్రొత్తబడి పోకుండా ఉండటానికి వ్యాకరణం అవసరమట!

భాష మాటిమాటికీ మారిపోదు. మారిపోతున్న భాషను వ్యాకరణం ఆపలేదు. భాషాభివృద్ధిలో సక్రమ అక్రమ భేదంలేదు. భాషలోవచ్చే మార్పు క్రమబద్ధమే.

వ్యాకరణం కత్తెర కాదన్నాను. కాదు కత్తెరే అని వాదిస్తున్నారు హనుమంతరావుగారు. 'తన చట్టంలో ఇముడని కొన్ని శబ్దాలను వ్యాకరణం కత్తిరించివేస్తుంద'ట! కత్తిరించి ఎక్కడ పారేస్తుంది? భాషలో లేకుండా చేస్తుందా? ఒక లిఖిత వ్యాకరణం కొన్ని శబ్దాల్ని పూర్వగ్రంథాధారంవల్లగాని, వ్యాకర్త ఇష్టానిష్టాలనుబట్టిగాని కొన్ని రూపాల్ని ఒప్పుకోనంత మాత్రాన ఆ శబ్దాలు ఎక్కడికీపోవు. భాషలో ఉంటై. ఒకవేళ పోయినా అందుకు ఈ కత్తిరింపు కారణంకాదు. అసలు వ్యాకరణ ప్రయోజనం దగ్గరే హనుమంతరావుగారి అభిప్రాయాలు నా అభిప్రాయాలు కలవటంలేదు. వ్యాకరణం సాహిత్యరచనకోసమే నంటారు ఆయన. భాషాస్వభావాన్ని గ్రహించటానికంటాన్నేను. సాహిత్యరచన భాషాప్రయోజనాల్లో ఒకటి మాత్రమే. సర్వస్వంకాదు. ఈ దృష్టితోచూస్తే వ్యాకరణం అవసరంలేని భాష ఉండదు. సర్వభాషాస్వభావమూ భాషావిజ్ఞానానికి అవసరమే. అలిఖిత భాషలకు వ్యాకరణం అక్కర్లేదంటే వాటినిగురించి మనం తెలుసుకోనక్కర్లేదన్నమాట. ఇట్లా అనటమంటే భాషావిజ్ఞానమే అవసరం లేదనటం. శ్రీ హనుమంతరావుగారి కవసరం లేకపోవచ్చు. భాషల లక్షణాల్ని గురించి తెలుసుకోదల్చినవాళ్ల కవసరమే.

స్వభాషా వ్యవహర్త లందరిలోనూ అలిఖిత వ్యాకరణం ఉంటుందంటే ఆ వ్యాకరణాన్ని గురించిన చైతన్యం (Consciousness) ఉంటుందని కాదు. అట్లాయితే ప్రతి వ్యవహర్త ఒక వ్యాకరణ గ్రంథం రాయగలిగి ఉండేవాడు. కాని అట్లా జరగటంలేదు.

భాషలో అవ్యక్తంగా వ్యాకరణ సూత్రాలున్నయ్యనీ, వీటి సమాహారాన్నే అలిఖిత వ్యాకరణం అంటారని, వాటికి లిఖితరూపాన్నియ్యటమే వ్యాకరణ గ్రంథాల ప్రయోజనమనీ నేను చెప్పింది. దీనికీ వ్యాకరణగ్రంథ పాండిత్యానికి సంబంధంలేదు. ఇక ఈ వ్యాకరణం 'విజృంభించట' మేమిటి? నిజానికి వ్యాకరణమంటే ఒక పదార్థంకాదు. ఎముకే దీన్ని

అమూర్తం (Abstract) అనటం. వాక్య నిర్మాణ పద్ధతే వ్యాకరణం. దాన్ని అక్షరబద్ధంచేస్తే వ్యాకరణ గ్రంథ మవుతుంది.

ఈ సందర్భంలో భిన్నార్థబోధకాలయిన ఒక వాక్యమూ, వాక్య భాగమూ ఉదాహరించారు. వారిచ్చిన ఉదాహరణాల్లో వచ్చే రెండర్థాలూ వ్యవహర్త అంతర్గతం చేసుకున్న వ్యాకరణంవల్ల వచ్చినవే. రెండిట్లో ఒకదాన్నే ఎంచుకోటం సందర్భాన్ననుసరించి. అయితే వాక్యాల్లో రెండర్థాలున్నయ్యని ఎట్లా గుర్తించగలుగుతున్నారు? అది అలిఖిత వ్యాకరణం మూలానే.

భాషను సాంకేతికమన్నారు ఆధునికభాషాశాస్త్రజ్ఞులు. దాన్ని విమర్శిస్తూ హనుమంతరావుగారు ఏదో నిమిత్తాన్నిబట్టే ఆ పేర్లు పెట్టిఉంటారని అంటున్నారు. ఏ మానసిక నిమిత్తాల్నిబట్టి వారు పేర్లు పెట్టిఉంటారో మనకు తెలీదు. సాంకేతిక మనటంలో భాషాశాస్త్రజ్ఞుల ఉద్దేశం భాషకూ, భాషేతర ప్రపంచానికీ సారూప్యసంబంధం (Iconic) లేదని. ఆంధ్రదేశ పటానికీ, ఆంధ్రదేశానికి సారూప్య సంబంధం ఉంది. కాని 'ఆంధ్రదేశం' అనే మాటకి ఆ పదం సూచించే వస్తువుకూ అట్లాంటి సంబంధం లేదు. ఇది సరిగా గ్రహిస్తే మిగతా 'నిమిత్తాల'తో నాకు నిమిత్తంలేదు. వాటినిగురించి ఎవరిష్టం వచ్చినట్టు వా రూహించవచ్చు. వాటిని సమర్థించటానికి, ఖండించటానికీ మనకి ఉపపత్తులు దొరకవు.

భాష—వ్యాకరణం విషయంలో నేను చెప్పినవి ఆధునిక భాషాశాస్త్రంలోవి. ఆధునిక భాషాశాస్త్రాన్ని శ్రీ హనుమంతరావుగారు అంగీకరించకపోవచ్చు. ఆధునికుల అభిప్రాయాలు ప్రాచీనులు చెప్పినవాటితో భేదించవచ్చు. పాణిని పతంజలులు మహామేధావులు. కాని మానవ విజ్ఞానం వారితోనే ఆగిపోయిందని నేననుకోను. అట్లా అంటే మానవుల మేధాశక్తినే అవమానించట మవుతుంది.

---



# నా కళ్లెం

శ్రీ నూతలపాటి గంగాధరం

నేనల్లుకునే ఆశలపూల పందిరిలో
ముళ్లతీగలా పెనవేసుకుంటుంది
నేను పరచుకునే పాలవెన్నెల నిండుకూ
తన నల్లటి పాదముద్రలతో నింపి ఖరాబు చేస్తుంది
నేను సాధనచేసే సంగీతంలో నడుమ నడుమ
తన బొంగురు గొంతు విప్పి అపస్వరం పలికిస్తుంది.
నేను తాగే పాయసంలో
పుడకలా నానోటికడ్డం పడుతుంది.

ప్రతిరోజూ ఉదయం కిటికీలో గుడ్లగూబలా కూర్చుని
నా గదిలోపడే సూర్యకిరణాల కడ్డం
తన రెక్కలు విప్పి తన ఉనికిని జ్ఞాపకం చేస్తుంది.
నేను నవ్వుతున్నప్పుడు వెనకదాగి
ఏడుస్తున్నప్పుడు ముందు నిలచి
తన రెక్కలు చాచి వీటిరెంటి మధ్యదూరాన్ని కొలుస్తుంది.

ఆనందంలో బాష్ప బిందువులా
అనురాగంలో అవ్యక్తవేదనలా
వెలుగులో నీడలా, పువ్వులో పురుగులా
విద్యుత్తులో మృత్యువులా
ఎప్పుడూ నా ఇంట్లోనే కాపురముండి
నన్ను వేదిస్తూ ఉంటుంది.
అన్నింటి మీదా సవారి తీస్తున్న
కాలతురంగం కళ్లెం నాచెత దక్కించుకున్నా
నా కళ్లెం మాత్రం దీని చెతనే ఉండిపోయింది.

# రాముడు – రామారావు

## శ్రీ ఆర్. యస్. కె. మూర్తి

ఇంక లాభం లేదురా, రాముడూ! బయటుంటే నువ్వు బ్రతుకలేవు. హాయిగా ఏ జైల్లోకన్నా వెళ్లిపోయి కూర్చో' అని సలహా చెప్పాడు, రామారావు తనలోనున్న 'రాముడికి'— అంటే తన ఇన్నరుసెల్ఫు అయిన 'రాముడి'కన్నమాట.

ఈ 'రాముడు'న్నాడే వీడుత్తబేల. చిన్నదానికీ పెద్దదానికీ ఊరికే బెంబేలు పడిపోతుంటాడు. ఉన్న నగలుకాసినీ తెగనమ్మి అమ్మ తెప్పించి యిచ్చిన డిగ్రీ ఆ అమ్మకెందుకూ ఉపయోగపడటంలేదని గోలపడతాడు, కాసేపు. చెల్లాయి పెళ్లి కెదిగున్నది. ఆమెకు పెళ్లి చేయలేకపోతినే అని ఏడుస్తాడు యింకాసేపు. ఏమి టీలోకం యిలా నిప్పులేని మంటలా మండిపోతున్న దేమిటని గగ్గోలుపడతాడు మరికొంతసేపు.

రామారావు యిలాంటి బెంబేలుజీవికాదు. తుపాకీ గుండేస్తే చిరునవ్వులు నవ్వాలని ప్రయత్నించే కొంటెగువ్వ అతను. ఎంతటి ఆపదలోనైనా నవ్వులు పులుముకోవాలనే అతని ప్రయత్నం. డిగ్రీ పనికిరాక పోయిందీ అంటె దానికి కారణ మతడుకాదు గదా? వళ్లు దాచుకోకుండా తన ఉద్యోగ ప్రయత్న మేదో తాను చేస్తూనే ఉన్నాడుగదా? మొన్నటికి మొన్న ఇరవై మైళ్ల దూరంలో ఉన్న గుంటూరు నడిచి మరీ వెళ్లొచ్చాడు, యింటర్వ్యూకి—బస్సుకి డబ్బులులేక. రిక్షా తొక్కి రోజూ నాలుగు డబ్బులు సంపాదిస్తున్నాడు యింకో ప్రక్క. ప్రయత్నం చేస్తున్నా ఫలితం రాకపోతే బెంబేలుపడట మెందుకో తెలియదు—రామారావుకి.

'రాముడు' మాత్రం ఒకటే క్రుంగిపోతాడు. డిగ్రీఉన్న తాను రిక్షా తొక్కవలసి వచ్చిందే అని బాధపడతాడు. ఒక యువకు డో యువతిని రిక్షాలో ఎక్కించుకొని తీసుకెడుతుంటే చూసి యివ్వాళ మరీ గిలగిలాడి పోతున్నాడు. ఆ యువకు డా అమ్మాయికి చెప్తున్న మాటలువిన్న అతని గుండె పగిలేపోయింది.

'చూడు పూర్ణా, మీ అన్నయ్య నీ కెట్లాగూ పెళ్లిచేయలేడు. ఎంతకాల మిలా తుప్పుపట్టిపోతావు చెప్పు. హాయిగా నామాట విను. మా కంపెనీలో చేరావంటే శరీరసుఖమూ లభిస్తుంది. తిండీ గడుస్తుంది' అని ఆ యువకు డంటుంటే అక్కడున్న పూర్ణస్థానంలో తనచెల్లెలు జ్యోతిని ఊహించుకొని 'రాముడు' సుడులు తిరిగిపోతున్నాడు. అదీగాక అమ్మకు దగ్గు ఎక్కువై ఊపిరాడక విపరీతంగా బాధ పడుతున్నది. ఇవ్వాళ రాత్రి కెట్లాగైనాసరే మందు కొనకుండా యింటికి పోగూడదని రిక్షా స్టేషను ముందు పెట్టుకొని కూర్చున్నాడు, 'రాముడు'— అంటే రామారావు ఇన్నరు సెల్ఫన్నమాట!

ఈ స్టేషను ముందు కూర్చుంటే ఏం లాభంరా? పోయి ఏబారు ముందన్నా కూర్చో—అని సలహా యిచ్చాడు రామారావు. బారుముందుండే 'అలగా రిక్షావాళ్లతో' 'గ్రాడ్యుయేటు రిక్షావాడు' ఏం పోటీచేయగల డంటాడు 'రాముడు'. రైళ్లు వస్తున్నాయి. పోతున్నాయి. గ్రాడ్యుయేటు రిక్షావాడు ఎప్పుడూ వెనకే ఉంటున్నాడు. అందుకే రామారావు పైసలహా చెప్పాడు. 'బయటుంటే నువ్వు బ్రతుకలేవురా. హాయిగావెళ్లి ఏ జైల్లోనన్నా కూర్చో' అని.

'రాముడి' కీ సలహా నచ్చినట్లున్నది. జైల్లోకి వెళ్లి కూర్చుంటే తనవారిబాధ చూడవలసినబాధన్నా

తప్పుతుంది. కాని జైల్లోపడటం అంత సులభమా? చచ్చు అనుమానం! రామారావుకి నవ్వొచ్చింది.

'ఓరినీ, బలే అనుమాన మొచ్చిందిరా నీకు? జైల్లో పడటంకూడ కష్టమే. దర్జాగా పెద్ద హోటలుకెళ్లి సుష్టుగా టిఫిను చేయి. బిల్లు చెల్లించటానికి డబ్బుల్లేవను. పట్టుకోవచ్చిన పోలీసోడి చెయ్యి కొరికేయి. శుభ్రంగా ఆర్నెల్లు వేస్తారు. లేదా అంటే ఈ సీతాకోకచిలుకలున్నారు చూశావా? చేతుల్లో బ్యాగులు పట్టుకుపోతుంటారుగా? ఒక బ్యాగు లాక్కొని పారిపో. అడ్డమొచ్చిన పోలీసోడి నెత్తినో జెల్లకాయ యిచ్చేయి. ఏడాది ఖాయంగా వేస్తారు.' విషయ వివరణ చేశాడు రామారావు.

'మరి వాళ్లు జైల్లో వేయకుండా పట్టుకు కొడితే?'

'అందుకే డబాయించాలోయి. నన్నుకొడతారేమిటండీ? కావాలంటే అరెస్టుచేసి తీసికెళ్ళండి—' అని డబాయించాలి'

'రాముడ'లా చేయటానికే కృతనిశ్చయుడైనాడు.

* * *

అయ్యరు హోటల్లో సుష్టుగా టిఫిను చేశాడు, రామారావు. 'రాముడు' వణికిపోతున్నాడు, జరగబోయేదాన్ని ఊహించుకొని.

'ఇదిగో సర్వరూ, బిల్లెంతయ్యా?' అన్నాడు చొక్కాతో మూతి తుడుచుకుంటూ రామారావు.

పాడుతిండి. జైల్లో పడటానికి మూడు రూపాయల దొంగతిండి తినవలసి వచ్చింది అని కంటకపడ్డాడు 'రాముడు'.

'నువ్వలా మూడు రూపాయలు బిల్లువేసి పారేశావనుకో. కాని సర్వరూ, మనదగ్గర సొమ్ము లేదే' రామారావు డైలాగు.

ఇదేమిటిలా డబాయిస్తాడు. మెల్లిగా చెప్పక— అని— గొణుక్కున్నాడు 'రాముడు.'

'ఏందయ్యో ప్రొప్రయిటరూ, చొక్కా వదుల్తావా, లేదా? డబ్బుల్లేవంటే వినపడటంలా, కావాలంటే పోలీసోడ్నిపిలు' రామారావు డబాయిస్తున్నాడు.

ప్రొడ్యుయేటు 'రాముడు' రామారావు వాడుతున్న భాషకు నిస్తేజుడౌతున్నాడు.

'అద్గదీ అట్టాచెప్పు. ఏంపని చెయ్యమంటావు? తొట్టెండా నీళ్లు తోడిపోసేదా? ప్లేట్లు తీసేదా? ఏం చెయ్యమంటావో చెప్పు. నువ్వు చెయ్యమన్నపని చేస్తాను'. రామారావు రాజీ పడుతున్నాడు. ప్రొప్రయిటరు వేసే శిక్షకు తలవంచుతున్నాడు.

'అగేమిటోయి, పోలీసుల్ని పిలవమని ఇగా యిస్తావేం?' అని గోలచేస్తున్నాడు 'రాముడు.'

'వీళ్లుపోలీసుల్ని పిలిచేటట్టు లేరురా. నువ్వు కాసేపు గోల చేయకు. చెప్పినపనేదో చెయ్యి' అని విసుక్కున్నాడు రామారావు.

నీళ్లు తోడుతున్నాడు. ప్లేట్లు తీస్తున్నాడు. చెప్పినపనల్లా చేస్తున్నాడు రామారావు.

రాముడు, కుంగి పోతున్నాడు. ఏమిటీ నైచ్యం! ఈ కాఫీహోటలు మురికిలో తానీపన్లు చేయటమేమిటి?

'ఏమిటోయి రామారావు! హాయిగా జైలు కెళ్ళొచ్చంటూ ఈమురికిలో తెచ్చిపడేశావు—'అని గోలపెట్టాడు 'రాముడు'

అదే ఆలోచిస్తున్నా. ఒకపనిచేయి. అదిగో ఆ అట్లు పోస్తున్నాడే అతనికి డాన్సులంటే బలేయిష్టం. అతనిదగ్గరకివెళ్లి ఆ డాన్సుల్ని పొగుడు. అతను నీకు బలేబలే అట్లు పోసిస్తాడు. అది చూసిన అయ్యరు నిన్ను హోటలునుంచి వెళ్లగొడతాడు. ఆ తరువాత జైల్లోకివెళ్లే మార్గమేదన్నా ఆలోచించవచ్చు—అని సలహాయిచ్చాడు, రామారావు.

'ఛీ. ఛీ. యింతబతుకూ బతికి అట్లుపోసే వాడిదగ్గర డాన్సుల దండకం చదవమన్నావా?

'ఛీ. ఛీ—' అంటూ ఛీత్కారంచేశాడు గ్రాడ్యుయేటు 'రాముడు'

'అయితే నువ్వు కాసేపు నోరుమూసుకొని పడుండు. అదేదో నేనే అఘోరిస్తాను—' అని కార్య భార మగ్నుడైనాడు రామారావు.

* * *

'ఏం బాబూ యిలా వచ్చావు? చేతులు నొప్పు లెట్టేనయ్యా? పో. పో. పోయి నీళ్లు తోడు' అని కసురుకున్నాడు అట్లవాడు.

'ఉండవయ్యా, నీదో గోల. అయినాకాని కాసేపు నీళ్లుతోడి, అటూ యిటూ తిరిగేటప్పటికే కాళ్లూ చేతులూ నొప్పులు పుడుతున్నయ్యే. మరా డాన్సులు, అబ్బా! అన్నిగంటలు, వళ్లంతా మెలికలు తిప్పుతూ డాన్సెలా చేస్తుందో? నిజంగా అమృతం తాగుతూ ఉంటుంది, రోజా' రామారావు దంచేశాడు లెక్చెరు.

'అన్నావూ, నువ్వూ ఆమాటే అన్నావూ? నేనదే చెబుతుంటాను, రోజా అబ్బ, ఆ డాన్సంటే...' పెనంవాడు పేలిపోతున్నాడు.

'వస్తామరి. నీళ్ళు తోడాలిగా?' రామారావు 'వెళ్ళట' అభినయించాడు.

తోడొచ్చులేవయ్యా కూర్చో. యిదిగో ఈ అట్టు తిను. ఆ ఏం చెబుతున్నానూ? ఆ...ఆ...' ఆనందోద్రేకంలో ఊగిపోతున్నాడు పెనంవాడు.

ఆ రోజల్లా .రామారావు అట్లు తింటూనే ఉన్నాడు, అంగాంగవర్ణన వింటూ.

రామారావిలా వీనులవిందుతోపాటు విందార గించటం అయ్యరు కంటపడింది. మరుక్షణంలో రామారావు రోడ్డు మీదున్నాడు.

* * *

'అమ్మయ్య, ఆ మురికిలోనుంచి బయటపడేశా వోయి. థ్యాంక్సు రామారావు' అన్నాడు 'రాముడు'

'అదిసరే, మరిక ఖర్జర్లోకివెళ్లే ఆలోచన చెయ్యొద్దా? అదిగో ఆ అమ్మాయిని చూడు. ఎంత దర్జాగా కూర్చున్నదో, బ్యాగు పక్కన పెట్టుకొని ఆ బ్యాగు తీసుకొని నిదానంగా అటు పక్కకి పో. కేకలు పెడుతుంది. అదిగో, పోలీసుకూడ వస్తున్నాడు. లక్కీఛాన్సు! గో ఎహెడ్ రాముడూ!'—అని హుషారు చేశాడు రామారావు.

'దొంగ, దొంగ—'కేకలుపెట్టింది అమ్మాయి.

పోలీసొచ్చి దొంగను పట్టుకున్నాడు. ఆమ్మాయి గారి ముందు నిలబెట్టాడు.

'ఏయి, నా బ్యాగు తీసుకుపోతున్నావెందుకు?' అన్నదల్లా రామారావునిచూసి గతుక్కుమన్నది, అతని క్లాసుమేటు రమ.

'అబ్బ! ఎంత అందంగా ఉన్నదీ రమ! కాలేజీలో ఉన్న రోజుల్లో ఎర్రతేలులా ఉండేది. అప్పు డప్పుడే వోణీలు వేస్తుండేది—రాని యవ్వనంమీద. ఎర్రతేలని రమను ఆటలుకూడ పట్టించేవాడు రామారావు. ఇప్పుడెంత నిండుగా ఉన్నది! ఎంత ముద్దుగా అన్నది 'ఏయి' అని!—'రామారావు ఘ్రమాస్పడి పోయాడు.

క్లాసుమేటు రమని చూచేటప్పటికి ప్రాణాలు జివ్వుమన్నయి, 'రాముడికి'. పేగులమీద ఎవరో రాగాలు పలికించినట్లయింది. ఈ రామారావేమో నిలువుగుడ్లు వేసుకు చూస్తున్నాడు! రాముడే సమా ధానం చెప్పవలసి వచ్చింది.

'సారీ, మేడం. ఏదోచెడు ఆకర్షణకి లొంగి పోయి ఈపనిచేసాను. శిక్షనూ అనుభవిస్తాను' అన్నాడు 'రాముడు' ఇంగ్లీషులో.

ఎంతో అల్లరిచేసే రామారావు యిప్పుడింత దీనంగా మాట్లాడుతుంటే జాలివేసింది రమకు.

'దొంగవెధవ! యింగ్లీషుకూడ! వీడిమాటలు నమ్మకండమ్మాయి గారూ!' అంటున్నాడు పోలీసు.

'నువ్వు వూరుకో. పాపమేదో పొరపాటంటు

న్నారుగా? వార్ని వదిలేయి'. ఇనస్పెక్టరుగారమ్మాయి పోలీసును డబాయించలేదా?

రామారావింకా ఈలోకంలో పడ్డట్టులేదు.

'థాంక్సు, మేడం వస్తాను' 'రాముడే' వీడ్కోలు చెప్పాడు.

* * *

'ఛీ, ఛీ! ఏమిటీ హైన్యం! క్లాసుమేటు ముందే తలవంచవలసిన దైన్యం!

'ఏమిటోయి రామారావు, ఏమిటీ ఘోరం? ఎంతగా దిగజార దీశావోయి మనస్సును—'అంటూ గొంతు కడ్డంపడ్డ ఉండలాంటిదాన్నేదో దిగమింగు కున్నాడు 'రాముడు.'

'నేనుమాత్రం కలగన్నానా, ఆమె ఎర్రతేలని. పోనీలే. యిలాంటివి చిన్న చిన్న ఎదురుదెబ్బలు. ఇంటికిపోయి అమ్మా, చెల్లెలు ముఖం చూడలే నంటివిగా? ఏం చేస్తావు? ఇలాంటివి భరించాలి. పోనీ యింటికే వెడతానంటావా?—'రామారావు పరీక్ష చేస్తున్న ట్లనిపించింది.

'నో, నో. మందులేకుండా అమ్మబాధ చూడ లేను. ముద్దబంతిలాంటి పిల్ల జ్యోతి. వేడిగాలుల నిసురులకామె వేగిపోవటం చూడలేను. వద్దు రామా రావు, నన్ను జైలుకే పంపేయి—'బావురు మనబోయి దిగమింగుకున్నాడు 'రాముడు.'

'భేష్, అలా కృతనిశ్చయుడవై ఉండాలి. ఆలో చిద్దాం. కొత్తమార్గ మేదైనా ఆలోచిద్దాం, ఆ... అదిగో ఆ పెద్దమనిషిని చూశావా? చేతిలో సూటు కేసు పట్టుకొని ట్యాంకుబండుమీద వెడుతున్నాడు. ట్యాంకుబండు పోలీసుస్టేషను దగ్గర ఆ సూటు కేసు లాక్కొని అమాంతం పోలీసు స్టేషన్లోకి పారిపో. వాళ్లే అరెస్టుచేస్తారు. క్విక్ రాముడూ! ' అంటూ మరోకసారి హుషారు చేశాడు రామారావు.

* * *

అమ్మయ్య, ఎట్లాగైతేనేం పోలీసు చేతుల్లో పడ్డాం— అని నిట్టూర్చాడు రాముడు.

'కాని యిదేమిటీ పెద్దమనిషి రిపోర్టియ్యా నంటాడేమిటి? పెట్టియిస్తే వెళ్లిపోతా' నంటా డేమిటి?

'ఏమిటోయి రామారావు! కథ అడ్డం తిరిగే టట్లుందే—'అని వాపోయాడు 'రాముడు.'

'అదే చూస్తున్నా ఈ పెట్టెలో దొంగనోట్లే మన్నా ఉన్నయ్యేమో? చూడు; ఎట్లా వణికి పోతున్నాడో?—' అంటూ డిటెక్షనులో మునిగి పోయాడు రామారావు.

'పెట్టితాళం యివ్వండి సర్. ఇన్వెంటరీ వ్రాసి పెట్టె యిచ్చేస్తాం. రిపోర్టుకూడ యివ్వండి. ఆర్నెల్లుఖాయం, గాడిదకొ...' భాష వాడు తున్నాడు ఇనస్పెక్టరు.

'తాళం నా ద గ్గ ర లేదండీ. మా బాస్ దగ్గరుంది. అయినా ఎందుకొచ్చినగొడవ పోనిద్దురూ! పాపమెవరో నిరుద్యోగల్లే ఉన్నది. డిప్రెషన్లో చేసుంటాడు. దాంట్లో అయ్యగారికి కావలసిన అర్జెంటు కాగితాలున్నయి. యిచ్చేయండి. వెళ్లి పోతాను'— పెద్దమనిషేదో అభినయం పడుతున్నాడు.

'ఏమిటోయి రామారావు!' అంటూ నీళ్లుగారి పోయాడు 'రాముడు'

'ఇనస్పెక్టరు! ఆపెట్టెయివ్వొద్దు. నేనది దొంగ తనం చేయలేదు. దొంగతనమైతే పోలీసు స్టేషనులోకి పరుగెత్తుకొస్తానా? అది తెరిచి చూడండి. మీ ప్రమోషను, నా బహుమతి వచ్చే అవకాశం చెడగొట్టు కోకండి'—రామారావు విజృంభించాడు.

'ఏయి మిస్టరు ఏమిటా పేలుడు! ఆ పెట్టె ఎవరిదో తెలుసా? మిస్టరు యినస్పెక్టరు! ఈ కుర్రాడి మాటలువింటే, నీకేవో ఐడియాలు వస్తున్నట్లున్నదే? ఏదీ ఆ ఫోనిలా యికసారివ్వు. అయ్యగారికి ఫోను చేసి తాళం చెవి తెప్పిస్తాను.'

'వద్దు యినస్పెక్టరు! ఆయన్ని ఫోను చేయ నివ్వద్దు. పెట్టె పగలగొట్టి చూడండి ప్రమోషను,

యినస్పెక్టరు, చెడగొట్టుకోబోకండి.' రామారావు హుషారు చేశాడు.

'అది సరేనండీ. మీరు ఫలానావారి తాలూకని నమ్మటమెట్లా?' అన్నాడు ఇనస్పెక్టరు.

'అట్లా అన్నారు బాగుంది. మీరే ఫోను చెయ్యండి, అయ్యగారికి'. సూటుకేసు పెద్దమనిషి కాలరు సర్దుకొన్నాడు.

ఫోనుచేసిన యినస్పెక్టరు ముఖంలో ఏవో మార్పులు!

'యస్ సర్...యిక్కడే ఉన్నారు సర్...' మాట్లాడండి.'

సూటుకేసు పెద్దమనిషి చేతికొచ్చింది ఫోను.

'అదే సర్. మీరు తెమ్మన్న అర్జెంటు పేపర్లు పట్టుకొని వస్తుంటే ఎవరో కుర్రాడు పెట్టె లాక్కొని పరుగెత్తాడు. అవతల తమ పని చెడిపోతుం దని కుర్రాణ్ణి వదిలేసి పెట్టె యివ్వమంటే ఈ యిన స్పెక్టరు మొండికేస్తున్నాడు...అలాగేసర్. మాట్లా డండి.'

ఫోను యినస్పెక్టరు చేతుల్లోకి వెళ్ళింది.

'యస్ సర్...అట్లాగే సర్...అబ్బే యిప్పుడే వదిలేస్తాను, సర్...అబ్బే తమరు రానక్కరలేదు. రిపోర్టు వద్దన్నారుగా?...అంతే సర్. పాపం కుర్రాణ్ణి బాధించడమెందుకు...యస్‌సర్...నమస్తే సర్...'

* * *

ఏమిటోయి రామారావు, అలా వదిలేశారు. నిజంగా ఆ సూటుకేసులో దొంగనోట్లే ఉన్నయ్యేం టావా—రాముడి అనుమానం.

'ఆ...కాక? అమ్మ మందుచీటీలు, జ్యోతి జాతకం కాగితాలు ఉన్నయ్యనుకున్నావా, ఆ పెట్టెలో! ఛీ. ఛీ. జైల్లో పడటంకూడ చేతకానివాడివి, నువ్వెం దుకు పనికొస్తావురా! పోయి ఏబావిలోనన్నా దూకు—' రామారావు భళ్ళుమన్నాడు, నీటిబుగ్గలా.

'నీ బోడిసలహాకు థాంక్స్ోయి రామారావు! అయినా నన్నంటావేం? నువ్వు చెయ్యమన్నదల్లా చేసానుగా? ఏం, అమ్మ మందుచీటి ఉంటేఉందిలే. మందు తేలేదని నన్ను అమ్మేం అనదు. యింటి కొచ్చానంతే చాలని సంతోషిస్తుంది. మా జ్యోతి జాతకానికేమిటోయి! అది బంగారుతల్లి. దానికి బంగారంలాంటి సంబంధంతెచ్చి పెళ్ళిచేస్తాను. తెలుసా!'—అంటూ గొల్లుమని ఏడ్చాడు 'రాముడు'.

'పాపం, పిచ్చోడు—'అంటూ చొక్కాతో కళ్ళు తుడుచుకున్నాడు రామారావు.

* * *

ఉత్సాహంతో ఉరకలువేస్తూవచ్చిన నది—ఎండి పోయిన సముద్రాన్ని చూచి భళ్ళుమన్నది, నీటి బుగ్గలా!

ఉత్సాహ ముడిగిన నదిని చూచి గొల్లుమని ఏడ్చింది, ఎండిపోయిన సముద్రం!

ఎండిపోయిన సముద్రాన్ని ఓదార్చాలనుకున్నది, విరిగిపోయిన నది!

---



# శ్రీ అనంతపద్మనాభ వ్రతోపాఖ్యానము

## శ్రీ ఆవంచ సత్యనారాయణ

తాళపత్రగవేషణము పరిష్కరణము ప్రకటనమును నవి భగీరథ ప్రయత్న సాధ్యములే. దానికి తాల్మి, పరిశోధనా పటిమ, ప్రాచీనలిపి నెఱుగగల ప్రజ్ఞ, కవి హృదయమును గ్రహింపగల నేర్పు అవసరము. మాననీయులు శ్రీ మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకరశాస్త్రిగారలు తెలుగువారి తాళీదళ ప్రకర కాంతారమునందు మార్గము చూపిన వెలుగుజ్యోతులు.

బంధువుల యిండ్లకు వెళ్ళినప్పుడు, వారివద్ద తాళపత్ర గ్రంథసంచయమును గుఱించి వివరములు సేకరించుచుండగా కంభంవద్దగల కాకర్లగ్రామ నివాసులు, నా బంధువులైన శ్రీ వారణాశి వేంకటకృష్ణమూర్తిగారు కొన్నిగ్రంథములను నాకిచ్చిరి. వాని యందు ఒకటి — 'అనంతపద్మనాభ వ్రతోపాఖ్యానము.'

### తాళపత్రప్రతి - వివరణము :

శ్రీ కృష్ణమూర్తిగారిచ్చిన తాళపత్ర సంపుటములలోగాక యిది విడిగాగలదు. ఈ గ్రంథమున్నంత వఱకును పత్రములపై 101 నుంచి 139 వఱకును క్రమసంఖ్యలు వ్రాయసకానిచే వేయబడినవి. దీనికి ముందు మఱేదియో గ్రంథము వ్రాయబడియుండ వలయును. ఆ పత్రములు లభింపలేదు. పై సంఖ్యల గల ఆకులలో 116 సంఖ్యగల ఆకు లోపించినది. ఎంత శోధించినను లభింపలేదు. దీనివలన సుమారు 15 పద్యములు లోపించినవి. ఆకులలో కొన్నింట కొద్దిభాగము లుప్తమైనది, కొన్ని సగము విరిగినవి నాల్గైదువఱకును గలవు. మిగిలిన భాగమంతయు చక్కగా నున్నది.

ఈ ప్రతి కవి తాను స్వంతముగా ప్రథమ పర్యాయము వ్రాయించుకొనినదై యుండవలయును. ఇట్లూహించుటకు రెండు కారణములు గలవు.

1. మొదటి మూడాకులకును పుత్రికలుగా నున్న మరికొన్ని పత్రములు సంఖ్యలేనివి గలవు. రెండింటియందు లిపి ఒకే వ్రాయసకాని వ్రాతగా కనబడుచున్నది. అందువలన నిది మరియొక ప్రతిని వ్రాయుటకు మొదటి ప్రతిని వ్రాసిన లేఖకుని ప్రయత్నమనుకొనుచున్నాను.

2. నాల్గవ ఆశ్వాసముచివర 'రాక్షసనామ సంవత్సర వైశాఖ శు 12 లు పొంతపాటి వెంకటపతి వ్రాసిన అనంతపద్మనాభ మాహాత్మ్యం' అని గలదు. ఈ వెంకటపతి కవియైన నారాయణకు తమ్ముడో లేక కుమారుడో యైయుండును. ఈ వెంకటపతియే కవికి లేఖకుడుగానుండి యుండవచ్చును.

### కవి-కాలము:

ఈ అనంత పద్మనాభవ్రతోపాఖ్యాన మను నాల్గాశ్వాసముల గ్రంథమును రచించినకవి పొంతపాటి నారాయణకవి. ఇతనిని గురించి ఆశ్వాసాంత గద్యతప్ప మఱి యే వివరములును గ్రంథమునం దీయబడలేదు. ఇది భద్రాచల శ్రీరాముని కంకితము చేయబడినది. నారాయణకవి ఆశ్వాసాంత గద్య యిట్లు గలదు.

'ఇది శ్రీమదతుల కరుణాసముద్ర భద్రగిరి రామభద్ర పదపద్మధ్యాన సుధాపాన జనిత కవితా వధూటి వాగ్ధాటి ప్రహ్లాదజనోద్ధాటి పొంతపాటి కులపవిత్రాపస్తంభసూత్ర శ్రీవత్సగోత్ర విబుధ గణ మిత్ర వెంగనామాత్యపుత్ర సుకవిజనగేయ నారాయణ నామధేయ విరచితంబైన అనంతపద్మనాభవ్రతోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు... ఆశ్వాసము'

ఈ తాళపత్రములు నావద్దకు రాగానే దీనికి సరియైన కాగితపు ప్రతిని వ్రాసియుంచితిని. ఆ కాగితపు ప్రతియే ఈవ్యాసమున కాధారము. ఈ కవికాల

మును నిర్ణయించుటకు తగిన ఆధారము లెచ్చటను లభించలేదు. రాక్షసనామ సంవత్సరమున వ్రాయబడిన దనుటచేత, యిది కవి వ్రాయించుకొనిన ప్రతియే యని నిశ్చయించుట కాధారము లుండుటచేతను, పత్రములనుబట్టి కనీసము ఈ రాక్షసనామ సంవత్సరము 180 సంవత్సరములకు క్రిందటి దైనను కావలయును. అట్లయిన కవి క్రీ. శ. 1800 ప్రాంతము వాడగును. ఇది కేవలము ఊహయే.

## కృతి వివరములు:

ఇది ప్రబంధశైలిలో వ్రాయబడిన గ్రంథము. ప్రథమాశ్వాసమున 92 పద్యములు, ద్వితీయాశ్వాసమున సుమారు 132 పద్యములు (లబ్ధముగాని 116 వ ఆకులోని సుమారు 10, 15 పద్యములతోసహా), తృతీయాశ్వాసమున 164 పద్యములు, చతుర్థాశ్వాసమున 146 పద్యములు, మొత్తము 534 గద్య పద్యములుగలవు. ఇందు కౌండిన్యుడను విప్రకుమారుని కథ గలదు. అందువలననే ప్రథమాశ్వాసము చివరగద్యలో '...కౌండిన్యోపాఖ్యానంబను మహా ప్రబంధంబునందు ప్రథమాశ్వాస' మని చెప్పబడినది. ఈ ప్రబంధము భద్రాచల శ్రీరాముని కంకితమని పైన చెప్పబడినది. తెలుగు ప్రబంధము లన్నింటియందును ప్రథమ పద్యమున కృతిభర్తను సంబోధించుట నియతమేయైనను ఇందు విఘ్నేశ్వర స్తుతి గలదు.

పూర్వ కవి స్తుతిలో సంస్కృత కవులైన వ్యాస, వాల్మీకి, కాళిదాస, చోర, దండి, మాఘ, విద్యారణ్య, బాణ, మయూర, భవభూతులును—తెలుగు కవులలో నన్నయ, తిక్కన, ఎర్రన, నాచన సోమన, భీమకవులు మాత్రము పేర్కొనబడిరి. కవిస్తుతిలో పోతన లేకున్నను క్రింది పద్యమున తాను పోతనవలెనే భాగవత ధన్యుడు గాకోరినట్లు తెలియుచున్నది.

[1]ఒక మనుజేంద్రునిన్
గృతి పయోరుహ నేత్రికి నాథుచేసినన్
బ్రకటిత వైభవేందిరకు
భర్తను జేయు బరుం ద్రిలోకనా
యకు గృతి కర్తజేయ
చతురాస్యున కొందగరాని ముక్తి కాం
తకుధవుజేసి భాగవత ధన్యుని
గా నను జేయకుండునే.

ఈ ప్రబంధ కథ

హరికథలను విన మును మా
కరుదుగ వినిపింప వింటి మనఘ భవిష్యో
త్తర పుణ్య పురాణ కథా
సరణియు వినుపింపు సూత సద్గుణజాతా

అనుపద్యమువలన భవిష్యోత్తరపురాణమునుండి గ్రహింపబడినట్లు తెలియుచున్నది.

నారాయణ కవికి సంస్కృతాంధ్రములందు చక్కని వైదుష్యము గలదు. తెలుగు పదముల కంటెను సంస్కృత పదములపైననే కవికి మోజు మెండు. వర్ణనలను వివిధాలంకార సమ్మేళనములై నవీనములుగాకున్నను హృదయంగమమైన స్వభావోక్తులతో వర్ణించెను. ఈతని పురవర్ణనము క్రొత్తగా లేకపోయినను ఋతువర్ణనము కమనీయముగా నున్నది. చూడుడు.

వికచాంబోరుహ పత్రనేత్రి
శరదావిర్భూతమై యభ్రమ
త్యకలంక స్థితి నొందె
భూమి తృణసస్యశ్యామమై గుప్పె మే
చక కాంతిన్ నవపత్రకాశసుమగుచ్ఛ
స్కంద సంపూర్ణ వృ
[2]క్ష చయం బెంతయు దృగ్విలాస
మొసగెన్ సచ్చిత్ర...ఛాయయై

ఈ కవి శాలివాహనగాథాసప్తశతిని క్షుణ్ణముగా పఠించినట్లున్నది. అందు ఉక్తిచమత్కారమునకు పేరుబడినయొక గాథకు సంవాదమనదగిన పద్యమును యిష్టదేవతా స్తుతియందే వ్రాసినాడు చూడుడు—

[3]బోద్దుదమ్మియందుః బురుషాయితమువేళ,
నలువయుంటః జూచి, కలిమి చెలువ
సరగ నొక్కచేత మురవైరి కుడికన్ను
మూసిపెట్టె రసవిమూఢ యగుచు.
(శాలివాహన సప్తశతి)

(విష్ణువు కుడికన్ను సూర్యుడు. దానిని మూసి నచో వికసించిన నాభికమలము ముడుచుకొని అందలి చతుర్ముఖుని మఱుఁగుపఱుచునని లక్ష్మి భావము.) దీనికే కవి అనుకరణము చూడుడు—

వల్లభురొమ్మపై సురత
వాంఛ నటింప ప్రబోధనేత్రరు
క్ఫుల్ల సరోజనాభిగత
పుత్రవిలోకితనమ్రవక్త్రయై
పల్లవకామలోల్లసిత
పాణిని లోచన మప్పళించి రం
జిల్లు సుధాబ్ధికన్యక భ
జింతు నహర్నిశ మాత్మలోపలన్.

ఈ కవికి భక్తిమెండు. ప్రథమాశ్వాసమున సగమునకుపైగా పాండవు లరణ్యవాసము చేయుచుండి నప్పుడు అచ్చటి కరుదెంచిన కృష్ణుని మునులు స్తుతించుటతోడనే నిండినది. భక్తిని ప్రదర్శింప వలసిన ఘట్టము లెప్పుడువచ్చినను వివిధవృత్తము లలో తనివితీరునంతవఱకును వర్ణించుట యీతనికి పరిపాటి. ఈ భక్తిరసపద్యరచనయందు కొన్ని పోత నకు అనుకరణములైన పద్యములు వెడలినవి. కౌండిన్యు డరణ్యమునకేగి అనంతుని వెదకు సందర్భము భాగవత మందలి గోపికావిరహమును గుర్తుకుతెచ్చును. మచ్చు నకు ఈతని రచనమందలి రెండు పద్యములను చూడుడు.

విశ్వు నవిశ్వు విశ్వవిభు
విశ్వవికల్పుకు విశ్వవేద్యు భూ
తేశ్వరు భూతజన్ము భువనేశ్వరు
పుంసు నపుంసు స్త్రీ తనున్
శాశ్వతు నక్షరు క్షరు ప్రశాంతు
కృతాంతు యనంతు నాత్ము స
ప్తాశ్వ సహస్రధాము గుణధాముని
నిన్ను భజింతు నచ్యుతా.

[4]ధారాధరప్రభలుదేరు దేహచ్ఛాయ
శిఖిపింఛవేష్టితో జెలమిసేయ
శంపాలతోల్లస చారు పీతాంబర
దీధితుల్ దిశలెల్ల దీటుకొనగ
గురుతరోన్నత రత్నకుండలంబుల కాంతి
గండస్థలంబుపై గంతులిడగ
శ్రీవత్సలాంఛనాంచిత వక్షమున దివ్య
కౌస్తుభాలంకార గరిమదోప
అమలకమలోజ్జ్వలోన్నత హస్తములను
శంఖచక్రగదాయుధచయములొప్ప
గరుడపక్షాహతముల దిక్తటములదుర
కృష్ణుడేతెంచె భక్తదృక్తృష్ణ లెనయ

చతుర్థాశ్వాసమునందు మత్తకోకిలమణిగణవృత్త గర్భసీసము, మత్తేభకందగర్భసీసము వంటి గర్భ కవిత్వ పద్యములు, ఖడ్గబంధము నాగబంధము వంటి చిత్రకవితా పద్యములును గలవు.

కథావిషయ మేదియైనను భాషాప్రత్యేకత, భావసౌకుమార్యము, భక్తి భరితములైన యిట్టి ప్రబంధము లత్యంత ముద్రణార్హములు. దీనికి సూర్యా లోకన భాగ్యమెప్పుడో!

ఈ గ్రంథమును నాకిచ్చిన శ్రీ వారణాశి వేంకటకృష్ణమూర్తిగారి కత్యంతము కృతజ్ఞుడను.

---

1. ఇందు పద్యములను తాళపత్రి ప్రతిలో నున్నట్లు యథాతథముగా ఉదాహరించితిని.

2. ఈపద్యము నాల్గవపాదమున ప్రాసము లోపించినది.

3. శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారి శాలివాహనగాథాసప్తశతీసారాంద్రీ కరణము. పుట 143.

4. ఈ పద్యము పోతన భాగవతము నందలి నరకాసుర యుద్ధమునందలి సత్యభామ వర్ణనము నందలి పద్యమును పోలియున్నది.

# పాకిస్తాన్‌లో సంక్షోభం

'పరిశీలక్'

**1930** లో లక్నోలో ముస్లింలీగ్ సమావేశం జరిగింది. ఆ సమావేశానికి సర్ మహమ్మద్ ఇక్బాల్ అధ్యక్షత వహించారు. పాకిస్తాన్ అనే పేరుతో కాకపోయినా, ముస్లింలకు ప్రత్యేక రాజ్యం లేక రాజ్యాలు భారత ఉపఖండంలో ఏర్పడాలన్న సిద్ధాంతాన్ని ఆ అధ్యక్షోపన్యాసంలో సర్ మహమ్మద్ ప్రతిపాదించారు. అయితే అప్పుడు ముస్లింలీగు ఆ సిద్ధాంతాన్ని ఆమోదించలేదు. తిరస్కరించింది. 1933 లో గాని ఈ ఆలోచనకు సుస్పష్టరూపం ఆలోచింపబడలేదు. అప్పుడు శ్రీ రెహ్మత్ ఆలీ అనే ఆయన ఆ ప్రత్యేక రాజ్యాలుగా ఏర్పడాలని భావింపబడుతున్న భారత ఉపఖండంలోని కొన్ని ముస్లిం అధిక సంఖ్యాక ప్రాంతాలకు పాకిస్తాన్ అన్ననామకరణం చేశారు.[1]

భారతదేశాన్ని పాకిస్తాన్, హిందూస్తాన్‌లుగా విభజించిందిగూడా ఆయనే. అయితే ఆ శ్రీ రెహ్మత్ ఆలీ పాకిస్తాన్, ఇప్పుడు పాకిస్తాన్‌గా ఏర్పడివున్న రాజ్యం స్వరూపంలోలేదు. ఆయన ఊహించిన పాకిస్తాన్‌లో పంజాబు, వాయవ్యసరిహద్దురాష్ట్రము, కాశ్మీర్, సింధ్, బెలూచీస్తాన్‌లు వున్నాయి. మిగిలిన భారత ఉపఖండంఅంతా ఆయన దృష్టిలో హిందూస్థానమే. ఈ ప్రతిపాదన రౌండ్‌టేబుల్ సమావేశం ముందు అప్పుడుఆధికారికంగా ప్రతిపాదించబడకపోయినా, ఆ సమావేశం సభ్యులకుఅందజేయబడింది. ఆ సమావేశంలో సర్ మహమ్మద్ ఇక్బాల్‌గూడా పాల్గొన్నారు. ఆయనతో ఆరంభమైన ఈ రకమైన పాకిస్తాన్ భావన శ్రీ రెహ్మత్‌ఆలీచే ప్రచారంలోనికి తీసుకొనిరాబడింది. ఈ ఇద్దరు చెప్పిన విషయాలనే కొంచెం పొడిగించి, ముస్లింలీగువారు 1940 లో ఒక తీర్మానం చేశారు.[2] ఆ తీర్మానంలో ప్రధానమైనభాగం ఇట్లా వుంది.

'ఈ క్రింద చెప్పబడిన సూత్రం ప్రకారం జరిగే పద్ధతిలోతప్ప, మరి యే యితరమైన పద్ధతి గల రాజ్యాంగపు పథకమున్ను ఈ దేశంలో ఆచరణ సుగమంకాదని, ముస్లింలకు అంగీకారయోగ్యంకాదని, ఈ మహాసభ తీర్మానిస్తున్నది.

భౌగోళికంగా ఒకదానిప్రక్క ఒకటిగావున్న భాగాలను ప్రాంతాలుగా గుర్తించి, వానిని అవసరం అనిపిస్తే అటువంటి భూభాగపు సర్దుబాట్లతో ఏర్పరించి అటువంటి ప్రాంతాలలో ముస్లింలు సంఖ్యచేత అధికులుగావున్న వాయవ్య, పూర్వభారత మండలాలను స్వతంత్ర రాజ్యాలుగా వ్యవస్థాపన చెయ్యాలి; అట్లా ఏర్పాటు చేయబడిన ఆ వ్యవస్థిత భాగాలు స్వయంపరిపాలనాధికారంగలవి సార్వభౌమాధికారం కలవి అయివుండాలి.'

ఈ తీర్మానంలో ఇంకా కొన్ని పేరాగ్రాఫులు వున్నయిగాని అవి ఈ సందర్భంలో ప్రస్తుతం కాదు. ఇప్పుడు పైన పేర్కొన్న పేరాగ్రాఫే అతిప్రముఖమైనదై, అసలు విషయాన్ని తెల్పుతున్నది. అందులో ప్రధానమైన భాగంయొక్క సుస్పష్ట స్వరూపం తెలియడంకోసం ఆ పేరాగ్రాఫును యథామాతృకంగా ఇంగ్లీషులోవున్న దానిని వున్నట్లు ఈ క్రింద ఇస్తున్నాను.

---

1 Pakistan or The Partition of India. Dr B. R Ambedkar

2. Ibid.

"3. Resolved that it is the considered view of this session of the All-India Muslim League that no constitutional plan would be workable in this country or aceptable to Muslims unless it is designated on the following basic principle, Viz. That geographically contiguous units are demarcated into regions which should be so constituted with such territorial redjustments as may be necessary, that the areas in which the Muslims are numerically in a majority as in the North Western and Eastern Zones of India should be grouped to constitute "Indipendent States" in which the constituted units shall be autonomous and sovereign"

ఈ విధంగా 1940 మార్చి 26వ తేదీన లాహోర్‌లో ముస్లింలీగ్ యీ తీర్మానం చేసి తన పాకిస్తాన్ భావనకు ఒక విధమైన అక్షర రూపాన్ని ఇచ్చివుంది.

**2**

ఈ తీర్మానంలో 'స్వతంత్ర రాజ్యాలు'; 'స్వయం పాలనము;' 'సార్వభౌమాధికారము' అన్న మాటలు వున్నాయి. వాయవ్య, పూర్వ మండలాలన్న ప్రస్తావన వుంది. దీనినిబట్టి మొత్తంలో 'పాకిస్తాన్' రూపాన్నిగురించిన భావన ఏ విధంగావున్నదీ కొంత చూడవచ్చు. అయితే ఈ తీర్మానంలో ఈ భాగాలను గురించి స్పష్టంగా లేకపోయినా, ఆ వున్న మాటలను బట్టే, ఆ భావనయొక్క లక్షణం అర్థం అవుతుంది. Pakistan or The Partition of India' అన్న తమ గ్రంథంలో డా. బి. ఆర్. అంబేద్కర్ ఈ భావన విషయం సమీక్షిస్తూ ఇట్లా అన్నారు. 'మూర్తమైన పద్ధతిలో చెప్పాలంటే, వాయవ్యంలో పంజాబు, వాయవ్య సరిహద్దు రాష్ట్రము, బలూచీస్తాన్, సింధు రాష్ట్రాలను, తూర్పున బెంగాల్‌ను, బ్రిటిష్ ఇండియాలో రాష్ట్రాలుగా వుంచకుండా స్వతంత్రరాజ్యాలుగా - బ్రిటిష్ ఇండియాకు బయట స్వతంత్ర రాజ్యాలుగా—ఏర్పాటు చెయ్యాలన్నదే దీని అర్థం. అయితే ఇట్లా రాజ్యాలుగా చేయబడిన తర్వాత ఈ ముస్లింరాష్ట్రాలను గురించి ఏమి చేయబోయేది ఈ తీర్మానం చెప్పడం లేదు. ఆ రాష్ట్రాలు దేనికవి ప్రత్యేక రాజ్యాలుగా వుంటాయో, లేక వానిని ఒక ఏకరాజ్యంగా సమవాయ పరుస్తారో, ఆ సమవాయం ఫెడరల్ పద్ధతిలో వుంటుందో లేక యూనిటరీపద్ధతిలో వుంటుందో—ఈ మొదలైన విషయాలేమీ లేవు. తీర్మానం ఇటువంటి విషయాలలో అస్పష్టంగా వుంది. అయితే వ్యవస్థిత భాగాలు అనడంచేత ఇచ్చట ఫెడరేషన్ పద్ధతి ఆలోచన వున్నట్లు కన్పిస్తుంది. విభాగాల ఫెడరేషను, సార్వభౌమాధికారము అన్నవి విరుద్ధ విషయాలు. కనుక ఇచ్చట విరళ సమాఖ్యా పద్ధతినే సంకల్పించినారని అన్నా అనవచ్చు.'

ఇక్కడ ఒక్క విషయం చెప్పకుతీరాలి. 1940 ముస్లింలీగ్ తీర్మానాన్నిబట్టి పాకిస్తాన్ స్వరూపం ఏవిధంగా వుండాలని అప్పటి ముస్లింలీగ్ నాయకులు వాంఛించారోమాత్రం స్పష్టపడుతుంది. డా॥ అంబేద్కర్‌వంటి అప్పటి మేధావులు ఆ విషయాన్ని గురించి ఏవిధంగా భావించినప్పటికిన్ని, ఆ నాయకులు—వారు ఆలోచించిన పాకిస్తాన్‌లోని వివిధ భాగాలకున్ను సంపూర్ణమైన స్వయంపాలనాధికారం వుండాలని భావించినట్లు కన్పిస్తుంది. 1940 తీర్మాన భాగంలోవున్న మాటలను చూస్తేనే అది విశదం అవుతుంది. ఆ పాకిస్తాన్ ఏర్పడినప్పుడు, అందులో సర్వభాగాలున్నూ సమానసత్తా కల్గినవై, దాదాపు స్వతంత్రరాష్ట్రాలుగా వ్యవహరించగల స్థితిని ఆ నాయకులు సంభావించారనే అనవలసివుంటుంది. ఎందుచేతనంటే, వారు దృష్టిలో పెట్టుకున్న— అప్పటి బ్రిటిష్ ఇండియాలోని వివిధ ముస్లిం మెజారిటీ రాష్ట్రాల ప్రతినిధులయొక్కయు అభిమతాలను సమన్వయపరచి, అందరి ఆమోదానికి రాగలవిధంగా ఆ తీర్మానం తయారుచేయబడి వుంటుందనే మనం ఇప్పుడు భావించవలసివుంటుంది. అయితే, భారత ఉపఖండం విభక్తమై, పాకిస్తాన్‌అంటూ ఏర్పడిన అనంతరం ఆ 1940 తీర్మానంలో చెప్పబడిన ప్రధాన సూత్రాలు ఆచరణలోనికిరానికారణంచేతనే ఇప్పుడు పాకిస్తాన్‌లో కొనసాగుతున్న సంక్షోభం ఏర్పడిందని అనుకోవలసివస్తుంది.

## 3

ఇటీవల శ్రీమాన్ రాజగోపాలాచారి ఒకమాట అన్నారు; పాకిస్తాన్ ఏర్పాటయినప్పుడు ఇప్పుడు ప్రారంభమైన సంక్షోభం ఎప్పుడో ఒకప్పుడు ప్రారంభం కాకతప్పదని తానున్నూ, లార్డ్‌మౌంట్‌బాటనూ అనుకున్నాము అన్నది ఆ మాటల సారాంశం. ఇక్కడ తూర్పు, పశ్చిమ పాకిస్తాన్‌ల మధ్యవున్న వెయ్యిమైళ్ళ దూరమున్నూ, ఆ రెండు విభాగాల ప్రజలమధ్యవున్న నైసర్గికమైన లక్షణాలలోని భేదమున్నూ, ఇందుకు కారణాలని వారు అనుకున్నారేమో తెలియదు. కాని ప్రపంచంలో ఇంతకన్న నైజవిరుద్ధులు కలిసిమెలసి ఒక్క రాజ్యంగా వుండటం చరిత్రలో లేక పోలేదు. అందువల్ల ఆ కారణం ఇచ్చట కుదరదు. అందుచేతనే ఇక్కడ పైన చెప్పుకున్న ప్రధాన కారణంతో పాటు మరికొన్ని కారణాలేమైనా వున్నాయేమో పరిశీలనచేస్తే కొన్ని విషయాలు కన్పిస్తాయి.

ఖాయిదె—ఆజాం జిన్నా, శ్రీ లియాఖతలీ ఖాన్‌ల అనంతరం పాకిస్తాన్‌కు అంతటి నేర్పు, అంతటి మెలకువగల నాయకులు లభ్యంకాలేదు. పైగా పాకిస్తాన్ సాధనకు కారణమైన ముస్లింలీగ్ అనతి కాలంలోనే దెబ్బతినిపోయింది. పూర్వం ముస్లింలీగ్‌కు బయటవుంటూ, అనంతరకాలంలో అందులోచేరిన ఫజ్లుల్‌హక్కు, షురావర్దీవంటి నాయకులకు ముస్లింలీగ్ రాజకీయాలు నచ్చలేదు. శ్రీ షురావర్దీ వేరే పార్టీయే పెట్టారు. ఆ పార్టీ ఒకవిధమైన అభ్యుదయ భావాలతో అనతికాలంలోనే పైకివచ్చింది. పాకిస్తాన్‌లో గనుక 1940 లో ముస్లింలీగ్ ఆమోదించివున్న తీర్మానాన్ని రాజ్యాంగధర్మప్రాతిపదికగా తీసుకొని, దానికి ప్రాతిపదికధర్మస్వరూపాన్ని కల్పించి వున్నట్లయితే పరిస్థితులు ఎట్లా రూపుకట్టేవో ఇప్పుడు చెప్పలేము. కాని అట్లా జరగలేదు సరికదా, అక్కడ ఆదినుంచీ గూడా తూర్పు, పశ్చిమ పాకిస్తాన్‌ల మధ్య రవరవలు పెరుగుతూ వచ్చినట్లే కన్పిస్తుంది.

ఇందుకు తూర్పు పాకిస్తాన్‌లో జనాభా ఆధిక్యం కారణం కావచ్చు. ముస్లింలీగ్ ప్రాచుర్యం చెల్లినంతవరకు అక్కడ ఇబ్బంది ఏమీలేకపోయింది ఇందుకే. ఆ తర్వాత లీగ్ దెబ్బతిని, ఇతర పార్టీలు తలఎత్తేసరికి కొందరికి పాకిస్తాన్‌లో ప్రజాస్వామ్యం—(బ్రిటిష్ పార్లమెంటరీ పద్ధతిలో పనిచేయకపోవచ్చు నన్న నమ్మకాలుగూడా కలగడం ప్రారంభించాయి. పాకిస్తాన్‌లో సైన్యం అధికారాన్ని హస్తగతం చేసుకొనడానికి ఇటువంటివే కారణాలు ఏమో వున్నాయని అనిపిస్తుంది.

పాకిస్తాన్‌లో సైన్యం **మొట్ట**మొదట అధికారాన్ని హస్తగతం చేసుకున్నప్పుడు, ఆ నూతన అధిపతులు దేశంలోని అన్నిదోషాలకు రాజకీయవేత్తలను దుయ్యపట్టారు. రాజకీయపక్షాలను నిషేధించారు; రద్దుచేశారు. కాని ఆ సైన్యం క్రిందగూడా దేశం అంతకుపూర్వంకన్నా మెరుగైనదిలేదు; అధికారాన్ని ప్రజలతో, ప్రజల ప్రతినిధులతో పంచుకోని పక్షంలో వేరేవిధమైన విషమపరిణామాలు ఏర్పడగలవు. అందుచేతనే అచ్చట ప్రాతిపదిక ప్రజాస్వామ్యాల పద్ధతి మొదలైనవి తలఎత్తవలసివచ్చింది. 1962 రాజ్యాంగాన్ని ప్రకటిస్తూ అప్పటి పాకిస్తాన్ అధ్యక్షుడు శ్రీ అయూబ్‌ఖాన్ ప్రజాస్వామ్యాన్ని క్రమశిక్షణతో సంవలనం చెందించడము మొదలైన విషయాలనుగురించి మాట్లాడారు. ప్రెసిడెన్షియల్ పద్ధతి ప్రజాస్వామ్యం మంచిదన్నట్లు పేర్కొన్నారు. పార్లమెంటరీ పద్ధతి పాకిస్తాన్‌లో విఫలమైనదంటూ, శ్రీ అయూబ్‌ఖాన్ ఇట్లా అన్నారు: 'పార్లమెంటరీ పద్ధతిని ప్రయత్నించాము. అది విఫలమైంది. అసలు ఆ పద్ధతిలో ఏదో లోపం వున్నదనికాదు. ఆ పద్ధతి పనిచెయ్యడానికి అవసరమైన అనేకమైన నైపుణ్యాలు మనము ఇంకా సాధించుకోలేదు... ఈ పార్లమెంటరీ పద్ధతి బ్రిటన్‌లోను, స్కాండినేవియా దేశాలలోను తప్ప ఇతరత్రా పెద్దగా పనిచెయ్యలేదు. ఫ్రాన్సు గూడా ఈ పద్ధతిలో పనిచేయలేకపోయింది. అందుచేత మనం ఏమో చేయగలమని అనుకోరాదు.'

ఈమాటలు ఆయన 1962 మధ్యకాలంలో చెప్పారు. మరి ఆయన చెప్పినపద్ధతి ఏమి పనిచేసింది? ఆయనే అధికారంలోంచి తొలగవలసి వచ్చింది. అధికారాన్ని ఇంకొకరికి అప్పగించవలసి వచ్చింది. సైన్యమే అధికారంలోకి వచ్చేసింది. ఇచ్చట కన్పించేది ఏమిటంటే, పాకిస్తాన్‌లో పనిచేయగల పద్ధతిని గురించి, 1940 లో అప్పటి ముస్లింలీగ్ నాయకులు లాహోర్ తీర్మానంలో ఏమి చెప్పారో, దానిని అనుసరించక పోవడమేనని ఇప్పటికీ అనిపిస్తుంది.

## 4

భారతదేశం అవిభక్తంగా వున్నరోజుల్లో 1940 లో మార్చి 26 వ తేదీన లాహోరులో ఆ తీర్మానం చేయబడింది. ఇప్పుడు 1971 మార్చి నెలలో దాదాపు అదేతారీఖు రోజున పాకిస్తాన్‌లో సంక్షోభం ఏర్పడింది. ప్రజాస్వామ్యధర్మపద్ధతిని కాల దన్ని పాకిస్తాన సైనికాధికారులు, రాజ్యశరీరంలో ఒక భాగంలో కసాయికోత ప్రారంభించారు. ఈ సంక్షోభా నికి రాజకీయమైన కారణాలేగాక, ఇంకా ఇతర కారణాలు గూడా కొన్ని కన్పిస్తున్నాయి—ముఖ్యంగా పశ్చిమ పాకి స్తాన్ నాయకులు తమ ఆధిపత్యం పోతుందేమోనని భయపడి పోవడం ఒక ప్రధాన కారణంగా తోస్తుంది. అసలు పాకిస్తాన్‌లో ఇంతవరకు సాగిన సర్వమైన రాజకీయమైన అవాంతారాలకు ఈస్థితే కారణం అని చెప్పవచ్చు. ప్రజాస్వామ్య ధర్మాన్ని అనుసరించి నట్లయితే తూర్పు పాకిస్తాన్‌ది పైచేయి అయిపో తుంది. ఆ తూర్పుపాకిస్తాన్‌తో పశ్చిమపాకిస్తాన్ భావ సంబంధమైన ఐక్యతను సాధించలేక పోయింది. పాకి స్తాన్‌యొక్క నాయకత్వం వైఫల్యము, పాకిస్తాన్ రాజ్యాంగవ్యవస్థయొక్క వైఫల్యముగూడా ఇందులోనే వున్నాయి.

అసలు రాజకీయపద్ధతి అన్నది—ఆర్థిక రూప మైన, అధికారరూపమైన భావవిశేషానికి తొడిగే తొడుగువంటిది. అందువల్ల ఈ తొడులో ఏమి వున్నదో పరిశీలించి చూస్తేనేగాని, అసలువిషయం గోచరంకాదు. పాకిస్తాన్‌యొక్క వ్యవస్థానంలో ఈ ఆర్థిక, ఆధికారిక అసమానత్వం, ఆ దేశం యొక్క ఉభయభాగాలయందు సహజస్థితిలో లేనందు వల్ల, ఆ సహజస్థితి లేకపోయినా, కోసం సమ స్థితిసాధనయత్నం జరగక పోయినందువల్ల సారపు ద్రవ్యమైనది చెడి, పైతొడుగును గూడా దెబ్బ తీసింది. సర్వబలాలను అసహజస్థితిలో తన చేతిలో వుంచుకున్న పశ్చిమపాకిస్తాన్, తూర్పు పాకిస్తాన్‌ను ఒక 'వలస'గా సంభావనచేస్తూ వచ్చింది. అసహజమైన ఈ స్థితి సర్వరంగాలలోను వ్యాపింపచేయబడి, తూర్పుపాకిస్తాన్‌లో ఆత్మధర్మ పృథక్కృతికి దారి ఏర్పడేస్థితి కల్పించబడింది. రాజ్యాలలో సర్వాంగాలు సహజస్థితిలో, సమస్థితిలో వున్నప్పుడు సుస్థితి వుంటుందిగాని, ఆ స్థితి వ్యత్యస్త మైనప్పుడు, అది దుస్థితిగా మారుతుంది. ఈ స్థితి సరిదిద్దడానికి పాకిస్తాన్ నాయకులు చేసింది ఏమీలేదు: తూర్పుపాకిస్తాన్ తన ఆత్మ అన్వేషణ చేసుకొనడం మొదలుపెట్టింది. స్వయంపాలనలో తప్ప ఆత్మవికాసనానికి ఇతరేస్థానం కన్పించలేదు. అధ్య క్షుడు యాహ్యాఖాన్ పెట్టిన అచ్చమైన ఎన్నికలలో ఆ ఆత్మ స్వచ్ఛమై అభివ్యక్తమైంది. ఆ ఆత్మకు షేక్ ముజీబ్ వాక్కు అయినాడు. అయితే దేశంలో ఎన్నికలు జరిపి, ప్రజాస్వామ్యాన్ని తీసుకొని రాబోయి, అంతలో పాకిస్తాన్ సైనిక నాయకులు వెనక్కు తీయడం జరిగిందంటే, అది పూర్వపు అసహజస్థితి లక్షణమేగాని, మరిఒక్కటి అనలేము.

ఈ అసహజస్థితిని ప్రదర్శించారిఅంటే ఎంతో చెప్పవలసివుంటుంది. కాని ఒక్క ఉదాహరణ చాలు. 1947—1962 ల మధ్య తూర్పుపాకి స్తాన్ ఎగుమతుల విలువ 1300 కోట్ల రూపాయలు. దిగుమతులు రు. 790 కోట్లు. అదేకాలంలో పశ్చిమ పాకిస్తాన్ ఎగుమతులు రు. 99 కోట్లు, దిగుమతులు రు. 187 కోట్లు. ఈ అంకెలు చూస్తేనే చాలు పాకిస్తాన్‌లో సంక్షోభం అడుగునవున్న అసలు కారణం ఏమిటో కన్పిస్తుంది.

అందువల్లనే ఇప్పుడు పాకిస్తాన్‌లో ఈ సంక్షో భాన్ని పాకిస్తాన్ నాయకులు చేజేతులా తెచ్చుకున్నారని అనిపిస్తుంది. అందుకే అసహజమైన సైనికధర్మాన్ని అక్కడ చేబట్టవలసివచ్చిందనిపిస్తుంది. ఈ స్థితిలో పాకిస్తాన్‌ను ఏయేప్రాతిపదికలమీద నిర్మించామంటు న్నారో, అవి అన్నీ శ్లథమై పోయినాయి. కారణం ఏమిటి? అసలు ఏ ప్రాతిపదికను పాకిస్తాన్‌ను నిర్మించాలని ఆదిలో అనుకున్నారో, ఆ అసలు ప్రాతి పదిక అధఃకరింపబడింది. శరీరం వున్నదిగాని, ఆత్మే లేదు. రాజ్యశరీరానికి ప్రజా, ప్రజాస్వామ్యము ఆత్మ. ప్రజాస్వామ్యానికి మెజారిటీ భావన ఆత్మ. ఆత్మ అంటూవుండి శరీరంకోసం వెతుక్కోవడం ఒకటి; శరీరం వుండి, ఆత్మను కోల్పోవడం ఒకటి. ఒకటి సహజస్థితి. రెండవది అసహజస్థితి. పాకి స్తాన్ ఇప్పుడు ఈ రెండవ స్థితిలో పడినందువల్లనే అచ్చట సంక్షోభం ఏర్పడింది. పాకిస్తాన్ అన్నది పాకిస్తాన్‌గా వుండగలస్థితి ఈ సంక్షోభపు రక్త పాతంచేత తప్పికూడా పోయింది.

---

కలగూరగంప:

# రచయిత తెలియని రచనలు

ప్రాచీన సారస్వతమునందు ప్రసిద్ధులైన కొందరు కవుల రచనలు అలభ్యములు. కొన్ని రచనలకు కర్తృత్వము ఇదమిత్థముగా లేదు. మరియు కవులలో కొందరు తమ కృతులయందు వారి నామధేయములను తెలుపలేదు. ఇది వారి నిస్వార్థతకు తార్కాణము కావచ్చును.

ప్రస్తుతము కర్తృనామము తెలియని ఒక తాళపత్ర గ్రంథమునుగూర్చి తెలుపుటయే ఈ రచనోద్దేశ్యము.

మా ఆప్తమిత్రులు శ్రీ వే. నరసింహారెడ్డిగారు (ఉస్మానియా విశ్వవిద్యాలయ కళాశాల (వరంగల్లు)లో ఉపన్యాసకులు.) కొన్ని తాళపత్ర గ్రంథములను నాకొసంగి సుమారు రెండు సంవత్సరాలైనది. ఈ మధ్య కొన్ని గ్రంథములను పరిశోధించు సమయమునందు దీనినికూడా పరిశీలించుట జరిగినది.

ఈ ప్రతి మొత్తము 40 పత్రములు గలది. రెండు వైపుల వ్రాయబడినది. గ్రంథమునందెచ్చటను కృతికర్త పేరులేదు. ఈయన శ్రీ వైష్ణవుడు. నల్లగొండజిల్లా రామన్నపేట తాలూకాయందలి 'తొండ్లవాయి' యను గ్రామవాసి—అని తెలియుచున్నది.

ఈ ప్రతియందు దిగువ నొసంగబడిన రచనలు (శతకములు) గలవు.

1. నందనందన శతకము.

2. శ్రీ కృష్ణాష్టోత్తర శతము. (కృష్ణస్తుతి శతకము.)

3. తొండ్లవాయి కేశవరాయ శతకము.

4. జగన్మోహన శతకము. (కొంత.)—అనువానితోబాటు 'శ్రీరామశకునము' చూచుపద్ధతి, మరియు ఈ రచయితయొక్క కుటుంబమువారి (?) జాతకములును కొన్ని పత్రములపై గలవు.

దీనియందలి వ్రాత సుమారు 150 సంవత్సరములకు పూర్వమైనదని ఆ పద్ధతిని బట్టియు, ప్రతిస్థితిని బట్టియు. వ్యక్తమగుచున్నది. ప్రతిలో ఒకటి, రెండు పత్రములు జీర్ణమగుట తప్ప అంతయును స్పష్టముగా గలదు. ఇందలి లేఖనము గుండ్రముగా దోషరాహిత్యముగా నున్నది. ప్రతి శతకము చివర చిత్రకవితాశాఖకు చెందిన భిన్నార్థములు ప్రతిభాసించునట్టి ఒక పద్యము వ్రాయబడినది.

రచయిత వైష్ణవుడని ఈ క్రింది యాధారములచే వెల్లడి యగుచున్నది. జగన్మోహన శతకము చివర విష్వక్సేనుడు, కౌమోదకి, మొదలైన స్తుతుల తర్వాత ద్వాదశాళ్వారుల నిట్లు స్తుతించినాడు —

'శ్రీ నారాయణు నాజ్ఞ చేతనుల
రక్షింపన్ సదా సాత్త్విక
శ్రీ నైపుణ్యత దాసకోటి కిల
శేషీ శేష సంబంధ మెం
తై నైర్మల్య కథాను సంఘటిత
తద్దివ్య ప్రబంధాళి సో
పాన ప్రక్రియఁ దెల్పువారిఁ గొలుతున్
పన్నిద్ద రాళ్వారులన్'

అనియు, దీనివెంటనే—

'హరితస గోత్ర పవిత్రుల
కరమొప్ప శమాద్యగణిత కళ్యాణగుణో
త్కర పరిపూర్ణుల వేంకట
గురువరసుతుఁ గొల్తు రంగ గురుపుంగవులన్'

కవినిగూర్చి తెలిసికొనుటకు ఈ కందపద్యమే ఆధారము. ఈ రచయిత వేంకట గురువర్యుల పుత్రు

డైన రంగగురుపుంగవునకు శిష్యుడని తెలియుచున్నది! వీరెవరో ? ఏమి రచనలు చేసిరో ?

శతకములేకాక మధ్యన రెండు పత్రములపై ఈ పద్యములతోబాటు ప్రబంధ పద్ధతిలో స్తుతులు వర్ణనలు కొన్ని అసమగ్రములుగా గలవు. శతకముల యందు మిక్కిలి భిన్నములైన వృత్తములుగాని కొన్ని వర్ణనలుగాని ఉండవుగావున ఏదైన ఒక గ్రంథము నష్టముకాగా ఇవి మిగిలిన పత్రములేమోయని యనుమానము.

కవి తన ఈ రచనలను తొండ్లవాయి యందలి గోపాలకృష్ణున కంకితముగా రచించినాడు. ఈయన తొండ్లవాయి గ్రామవాస్తవ్యుడో లేక తత్పరిసర గ్రామవాసియో అయియుండవచ్చును. హైదరాబాదునుండి సూర్యాపేటకు బోవు జాతీయ రహదారిపై 'నార్కట్‌పల్లి' (కాకతీయులు, రాచకొండ రాజులు వీరికాలములో నిది 'నారికేళ పల్లి') యను గ్రామమున కుత్తరదిశను సుమారు 10 మైళ్ళ దూరములో 'తొండ్లవాయి' యను గ్రామముగలదు. ఈ శతకములయందే జగన్మోహన శతకము — 'వారిజాలగిరి గోపాలా జగన్మోహనా!' అను మకుటముతో కలదు. 'వారిజాల' యనునది నేడు 'వెలిజాల'గా పిలువబడు గ్రామమో యేమో ! లేదా ఇది కల్పితమైనను గావచ్చునేమో !

నేను చూచినంతవరకు 'వంగూరి'వారి శతక కవుల చరిత్రయందును, వావిళ్లవారి శతక సంపుటముల యందును, వేదం వేంకట కృష్ణశర్మ గారి శతకవాఙ్మయ సర్వస్వము నందును ఈ శతకములు పేర్కొనబడలేదు. శతకకవుల చరిత్ర [1957 ము.] 892 వ పుట యందున అకారాద్యనుక్రమణికలో 'నందివాడ జగన్నాథరాజు' నందనందన శతకమొకటి రచించినట్లు గలదు.)

ఈ శతకములయందలి కవిత్వము నిర్దుష్టముగా హృద్యముగా గలదు గంభీరమైన చక్కని కవితాధారనుబట్టి చూచిన కవి మిక్కిలి ప్రౌఢ కవిత్వమును వ్రాయుటలో పరాకాష్ఠ నందినవాడని భావింపవీలగుచున్నది. కారణమేమోగాని ఒకటిరెండు చోట్ల పద్యములయందు యతిభంగము, ప్రాసదోషములు దొర్లినవి. ఇవి అంతగా పరిగణింపదగినవి కాకపోవచ్చును.

పాఠకు లీతని కవితాస్వాదన మొనర్పగలరను భావనతో ప్రతిరచననుండి ఒండురెండు పద్యముల నొసంగుచున్నాను.

'నందనందనా'అను మకుటముతోగల యీ శతకమునందు 120 చంపకోత్పలమాలికలు గలవు.

'నీ పదపద్మముల్ దలచి
యేఁ దరియించెద దుష్కృతాంబుధిన్
దాపరమేల యేలవలదా ! యని
గావున నింకనైన నే
యాపద నొందనీక విను
తామరశాత్రవహంత ! వేగ రా
వే ! పరమాత్మ నన్ను...పవే
కరుణానిధి నందనందనా !'

'అక్షిషకేతనాబ్జసుతు
లాత్మజు లిందిర భార్యయున్ తమో
హృక్షిరిగన్నపాదము స
రిత్పతియున్ పడకిల్లు శార్ఙ్గి చా
పోక్షిత బాణవేగమున
నుర్వీఁబడున్ రిపుకోటి యొప్పె భా
స్వక్షిళకుల్ దనర్చి చెలు
వంబు వహింతువు నందనందనా !'

శ్రీకృష్ణస్తుతి శతకమునుండి—

'దుడుకుల్ మానదు కంటివే సతి
భవత్సూనుండు నా యింట నా
కొడుకుం [illegible]డలు నొక్కసెజ్జన యనంగున్
బూజఁ గావింప [illegible]
బడ[illegible]ము గొనివైవ నా కెర్రుగమిన్
బర్వెత్తగాఁ గూయు [illegible]
న్నడుగంగొంటిమె యిట్టివన్న నగు
కృష్ణస్వామికే మ్రొక్కెదన్.'

'తొండ్లవాయ కేశవరాయ' శతకమునుండి,—

'నీదయు లేశము వడయక
లేదు భవత్సేవ పరిమళించుచు జగతిన్
గాదయ్యెను శివపూజకు
గేదంగియు తొండ్లవాయ కేశవరామా॥'

'జగన్మోహన శతకము' నుండి—

'ఖగరాడ్వాహన మాధవా!
విమతరక్షస్తోమ విధ్వంసనా!
ఖగరాజాక్ష! సువర్ణచేల!
విలసత్కైవల్య సంధాయి! నీ
దగు నామామృతమేను గ్రోలుచు
భవద్దాసుండనై 'మంగళం
బగివాన్విష్ణు' యటంచు దల్తు
హరి! పాలా జగన్మోహనా॥'

మధ్యమధ్య వేరుగా కొన్ని పద్యములు వ్రాయబడియున్నవి. అప్రస్తుతముగావున వాని నుదారించలేదు. సంఘమునందలి బాగోగులను విమర్శించి మానవుని ఉత్తమ సంస్కారవంతునిగాజేయు ప్రతిభ గలిగినవి శతకములు. ఇట్టి రచన లెన్నియో సూర్యాలోక భాగ్యమునందక క్రిమికీటకములకు తమ శరీరము నర్పించి క్రమగ్గుట యనునది యెన్నడు మానునో!

'జయన్తి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః.'

— శ్రీరంగాచార్య.

## నేటి భాషా విమర్శలు

అక్టోబరు నెల భారతిలో వెలువడిన 'రెండు విమర్శలు—ఒక సమాధానం' అన్న శీర్షికగల వ్యాసాన్ని యాదృచ్ఛికంగా చూచాను. ఆ వ్యాసంలో పేర్కొనబడిన కొన్ని విషయాలు చూచి మన భాషాశాస్త్ర పరిశోధనా పాటవం చాలా బలహీనపడిందని మథన పడ్డాను. ఉన్నత విద్యాభ్యాసంచేసి శాస్త్ర పరిశోధకులనిపించుకోదలచేవారు కొన్ని అభిప్రాయాలు వెల్లడించేముందు బాధ్యతాయుతంగా జాగ్రత వహించాలని కోరుతున్నాను.

'పేలాలు అనేది నిత్యబహువచనాంతం. దాని ఏకవచనరూపం యేమిటో తెలియదు. అట్లాంటివి 'ఉసిళ్లు'అనే పదం నా వ్యాసంలో ఉదాహరించాను.'

ఇది చాలా ప్రమాదకరమైన తొందరపాటుతో కూడిన నిర్ణయం—'పేలాలు' నిత్యబహువచనాంతం కాదు—'పేలము' ఏకవచనరూపం — పేలములు—పేలాలు బహువచనరూపాలు. పేలము ఏకవచనరూపం ఉన్నది కాబట్టే 'పేలపుగింజ'—'పేలపుపిండి'—'పేలప్పిండి'వంటి ము వర్ణంమీద పు వర్ణాదేశ రూపాలు ఏర్పడ్డాయి. మరి పేలాలు నిత్యబహువచనాంతం అనడం యెంత తొందరపాటుమాట—ఉసి—ఉసులు—ఉసుళ్లు—ఇసి—ఇసులు — ఇసుళ్లు — ఇవి ఒక వర్గరూపాలు. ఉసిడి—ఉసిళ్లు—ఇవి మరొక వర్గరూపాలు.

'గిడుగువారైనా అకారేతరస్వరాలున్నప్పుడు కూడా యీకార్యం జరుగుతుందని బల్లెము—బల్లేలు - ముత్తెము - ముత్తేలు— అని ఉదాహరించారు గాని కేవలం అకార ఏకారాలకే యీకార్యం జరుగుతుందని నిర్దేశించలేదు—'

ముత్తెము అన్నప్పుడు బహువచనం పరమైతే ము లోపంవచ్చి దీర్ఘం వచ్చిందనడం సరికాదు—ముత్తియము అన్నప్పుడు ఇత్వలోపంవచ్చి ముత్త్యము అయి బహువచనం పరంకాగా ములోపం దీర్ఘంవచ్చి ముత్త్యాలు అయి అనంతరం ము లోపంరాగా యేర్పడ్డ రూపం ముత్తాలు—ఇక్కడ తకారంమీది స్వరం ఆ ఏల అంత

కల తాటాకులోని టూ గత స్వరంవంటిది. బళ్లె ములు అన్నప్పుడు పరిపూర్ణమయిన అంటే విస్పష్ట మైన ఎత్వం లకారంమీద ఉండగా ము లోపదీర్ఘాలు రావు ళ్లెమీది ఎత్వం కొంత భ్రష్టమై 'అ—ఎ' రెండుస్వరాల అంశకల హ్రస్వస్వరరూపం వ్యవహా రంలో రాగా పిదప పాక్షికంగా అత్వాంశత్వానికి ప్రాధాన్యంవచ్చి బహువచనం పరంకాగా ఆత్వాన్ని పొందుతుంది—బల్లాలు అవుతుంది—అయితే 'బళ్లి యము' ఇయాంత రూపంకూడా లేకపోలేదు - జానపదా లైన పాతకాలపు బొబ్బిలియుద్ధం—పల్నాటియుద్ధం-గండికోటయుద్ధం వంటి బుర్రకథల్లో ఈ ఇయాంత రూపం కనిపిస్తుంది. అయినప్పుడు బళ్లియము ఇత్వ లోపంవచ్చి బల్ల్యము—బల్ల్యములు-ము లోపదీర్ఘాలు-బల్ల్యాలు—యలోపం బల్లాలు అవుతుంది.

పేళాలు నిత్యబహువచనాంతంఅనే స్థితికి మనం దిగజారిపోయామంటే భాషావిషయంలో శాస్త్రార్థ్య యనంమాట అలావుంచి అసలు లోకానుభవం శబ్ద వ్యవహారానుభవం యెంతగా పెంపొందించుకోవలసిన అవసరం ఉన్నదో బోధపడుతుంది.

—శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య

## ఉర్లాంపద్దు : కక్క

మార్చి 'భారతిలో' 'మాండలిక పదకోశము'పై జరిపిన సమీక్షలో శ్రీ నిడుదవోలు వెంకటరావు కొన్ని విశాఖజిల్లా మాండలిక పదాలకు సరైన అర్థ నిర్ణయం చేశారు. కాని 'ఉర్లాంపద్దు' 'కక్క' అన్న రెండుమాటల విషయంలో మాత్రం పొరపడ్డా రని నాకు తోస్తున్నది.

శ్రీకాకులం జిల్లాలోని 'ఉర్లాం'లో పూర్వం పండితులను పరీక్షించి పారితోషికాలిచ్చేవారు. కాని పరీక్షలలో నెగ్గిన వారందరికీ సంభావన లియ్యడానికి ధనం చాలకపోగా చివరకి మిగిలినవారితో 'మీపేర్లు పద్దులో రాసుకొన్నాం. తర్వాతవచ్చి మీ సంభావనలు తీసుకోండి' అనేవారనీ, కాని తర్వాత ఆ సంభావనలు వారికి ఇయ్యడం చాలావరకూ జరిగేదికాదనీ ఆ ప్రాంతంలో అనుకొనేవారు. కనుక ఎవరికైనా డబ్బు ఇయ్యవలసి ఉండి, బాకీపెట్టి చివరికి ఇయ్యక పోతే ఆ ఇవ్వకపోవడాన్ని 'ఉర్లాంపద్దు' అంటారు. ఈమాట ఈ అర్థంలో విశాఖ శ్రీకాకులం జిల్లాలలో వాడుకలోఉంది. వేదపండితుడుఅన్న అర్థంలో వాడు కలో లేదు.

'కక్క' అంటే తండ్రి తమ్ముడూ, పినతల్లి మొగుడూకూడా.పినతండ్రి భార్యకు 'కక్కి' అనిపేరు. పినతల్లిని 'కక్కి' అనరు, అబ్బచ్చి అంటారు.

—శ్రీ కొఠారి హనుమంతరావు.



# గ్రంథవిమర్శలు

## విధివంచితలు

(నవల పాకెట్‌సైజు)

(రచన: డి. కామేశ్వరి. ప్రచురణ: యం శేషాచలం అండ్ కంపెనీ ...మద్రాసు— మచిలీపట్నం — సికింద్రాబాద్. ధర: రెండు రూపాయలు.)

'ఎన్నడన్నా నీ వాక్క స్త్రీవన్న సత్యం గుర్తించావా...నీ హృదయంలోకి ఎప్పుడన్నా చూసుకున్నావా? నీ హృదయం మామూలు ఆడదానిలా ఎన్నడన్నా సున్నితంగా స్పందించిందా? నచ్చి మనసిచ్చే పురుషుడి కౌగిట్లో తియ్యటిమాటలు వింటూ ప్రేమగా చూసుకుంటూ సోలిపోవడంలో ఆ తన్మయం మాధుర్యం నీ కెన్నడన్నా కలిగాయా? నీకెలా అర్థవౌతుంది, ప్రేమ కనులముందుకలిగించే ఇంద్రజాలం?...అతని ఆరాధనతో నిండినచూపు నాలో అమృతపుటేరులు పరుగెత్తిస్తుంది. ఆ భావం నీకర్థం కావాలంటే మరోజన్మ మెత్తాలి నువు!'. కనబడని మానసిక సంఘర్షణలో సతమతమయిన యిరువురు స్త్రీలు విధికెదురు నిలబడలేక దానిముందు తలవంచి వంచింపబడ్డారు. ఒకస్త్రీ ఆత్మహత్యకు పాల్పడింది. దానివలన కీర్తిశేషురాలైంది. సుజాత బ్రతికియున్నను చైతన్యంలేని స్థాణువైనది — పార్వతి—సుజాత విచిత్ర మనస్తత్వం కలిగినవారు. సుజాతకు భౌతిక సౌందర్యంకన్న మానసిక సౌందర్యం కావాలి. పార్వతికి మానసికంకంటె భౌతికంమీద మోజు ఎక్కువ. అవటంచేత మిడిమిడిజ్ఞానంతో అక్షరం ముక్కలు నేర్పించిన సుజాతను 'ఆ భావం నీకర్థం కావాలంటే మరోజన్మ మెత్తాలి నువు' అని అసగలిగింది. ఒకరి హృదయం ఆరాటపడింది; మరొకరి హృదయం ఆరాటాన్ని బలవంతంగా అణచుకొన్నది. పార్వతి మధ్యలో చదువు ప్రారంభించి ఒకస్థాయికి వచ్చింది. చదువుకుతగిన సంస్కారం అబ్బలేదు. హైస్కూలు చదువు ఉన్నప్పుడు పార్వతిలో విచక్షణాజ్ఞానం ఉన్నది. అందువల్లనే ఆలోచనలు పెంచుకొని పరిష్కారమార్గంకొఱకు తాపత్రయపడింది. ఆ వ్యక్తి ఇంగ్లీషుమాటలు నేర్చినతరువాత కన్నబిడ్డను మరచిపోయి స్వార్థంతో ప్రవర్తించింది. లోకం వైపుకు కన్నెత్తి చూడలేదు. కాని తల్లికన్న మిన్నగా చూసుకొనే సుజాతనే తూలనాడింది. అందాల పురుషుడితో తనకు పరిచయమైనదన్న వ్యామోహంతో పార్వతి తన ఉనికిని మరచిపోయి సుజాతను లెక్కచేయకుండా ఇంద్రభవనం నిర్మించాలని ప్రారంభోత్సవం చేసింది. పరిస్థితులు సానుకూలం కాకపోవటంతో మొదలు తుది అయింది. జీవితంగమనం మారిపోయింది. ఆమెలో కలిగిన ప్రతిమార్పు అడుగున విశృంఖలమైన స్వేచ్ఛ రెక్కలు విదిలిస్తున్నది. ఆస్వేచ్ఛ సుజాతకు వెగటుగా తోచింది. పార్వతి వేషధారణ సుజాతను సిగ్గుతో తలవంచుకొనేట్లు చేసింది.

ప్రకాశం సహజంగా మంచివాడే; అయితే రచయిత్రి అతనిని రాక్షసునిగా చిత్రించి పార్వతిఅంటే తాళిగట్టిన భార్యచేత ఛీ అనిపించారు. అతడు బి. ఎల్ చదివాడు. ఇంట్లో భార్యను అర్థంచేసికొనకుండా మల్లెపూలు తెమ్మంటే కసరికొట్టే ఆధునిక ప్రకాశంలాంటివా రుండరు. ఉంటారని రచయిత్రి ఊహించి ఆ రూపాన్ని కల్పన చేశారు. చిత్రణ చాల అసహజంగా ఉన్నది. ఎంత పల్లెటూరువాసియైన భార్యపట్ల ఆ విధంగా ప్రవర్తించటం ఈ రోజుల్లో జరగదు, జరగబోదు. అంతేగాక ప్రకాశం ముదుసలికాదు కండువా వేసికొనుటకు. పల్లెటూరిపంతులుగదాయని కండువాతోపాటు కిర్రుచెప్పులు చేతికర్ర మున్నగునవి చెప్పకపోవటంచేత ప్రకాశంపైన రచయిత్రి సానుభూతి చూపినందుకు చాల సంతోషం. తాతలనుంచి ఆనవాయితీ వస్తున్నదని సమర్థించి ప్రకాశానికి విపరీతపు పద్ధతులు అంటగట్టటం సంభావ్యంగాలేదు.

ఆవేశం అభిమానం ఉన్నవాడు ప్రకాశం. అందుకనే పార్వతిని బయటకునెట్టాడు. మెల్లకన్ను

సీతను పార్వతిపై ఉన్న కసికొద్దీ అభిమానంతో ఆహ్వానించుకొన్నాడు. ఎవ్వరివలన తాను ఏరకమైన ఆనందాన్ని పూర్తిగా అనుభవించలేకపోయాడు. కట్టుకొన్న భార్యయని నానాహింసలు పెట్టాడు. అలాగే రెండవభార్యనుకూడ బాధించాలని ప్రయత్నించాడు. కాని హింసపెట్టకపోగా ఆమెచేత క్షణక్షణం హింసింపబడ్డాడు. ప్రకాశం వ్యక్తిత్వం కలిగిన వ్యక్తి అన్న నమ్మకం కలిగినా పార్వతిని దగ్గర చేర్చకుండా ఆమెను ఒక విచిత్రలోకానికి ప్రయాణం చేయించటంచేత కథలో ఊహింపరాని శిల్పం వచ్చింది. చివరలో దీనిని నిల్పలేక తండ్రి – కొడుకులను సామాన్యంగా సన్నిహితం చేశారు. సుజాత ఎంతమంచిదో ప్రకాశం అంతమంచివాడు. అతని మనసును ఎరిగి ప్రవర్తింపకపోవటంచేత పార్వతి యిల్లువదలి బిడ్డను ఎత్తుకొని వెళ్లిపోయింది. మొదటినుండి పార్వతి మనస్తత్వం అందరి స్త్రీలలాంటిదిగాదు. ఇంటినుంచి వెళ్లిపోవటానికి ప్రకాశంకంటె సుజాత కారణమయింది. సుజాత మాత్రం దాంపత్యాన్ని సన్నిహితం చేయకపోగా వారిద్దరిని వేరుచేయుటంచేత ప్రకాశంజీవితంలో అగాధ మేర్పడింది. ఈ సంఘటన కల్పించటం చాల అసహజమై విపరీతంగా ఉన్నది. అతనిలో మానవత్వం ఒక్కసారిగా విజృంభించి పోయిన పార్వతి మరల వస్తుందని ఊహించాడు. కాని అభా రాలేదు. విడిపోయనతరువాత ఒకరినొకరు మాటా పలుకు లేకుండా తెలియకుండా దూరమైపోయారు

కథకు సుజాత పారిజాతం. నిజాన్ని నిజంగా చెప్పాలన్న ఉత్సాహం అధికం. కాలేజీలో ఉద్యోగం చేయటం మొదలుపెట్టింది. బాధను భరించలేదు. విపరీతాన్ని సహించలేదు. ఒకస్త్రీపైనుండే జాలి ఆమెను క్రమమైన మార్గానికి నడిపించలేక పోయింది. పార్వతి కాపురం భగ్నం కావటానికి సూదంటురాయిలా పనిచేసింది. బతుకు బాటలను సరిదిద్ది సలహా ఇయ్యవలసిన సుజాత వికృతంగా ఆలోచించి చేతులారా రెండుప్రాణాలను హతమార్చింది. మార్పు వస్తుందనుకొన్న పార్వతి సుజాతపై ఎదురు తిరిగింది. గుట్టుగా సంసారాన్ని కన్నీటిమధ్య గడుపుతున్న అబలను బలవంతంగా బయటి ప్రపంచానికి పరిచయంచేసి సత్ఫలితాలు సాధించాలన్న కుతూహలాన్ని రూపుమాపుకొన్నది. తనవాటకు విధి అడ్డుగా నిలిచింది. కర్తవ్యం నెరవేరలేదు. కన్నీరు పెట్టుకొన్నది. పదార్థం కోసం అనవసరంగా చేతులు కాల్చుకోవటం సుజాతకు తగినట్లుగా ఏమాత్రం లేదు. 'ఇంక దానికి తోడూనీడా అంతా మీరే. అది తిన్నగా నాదగ్గరికే వచ్చిందంటే ఇంతమాత్రం పాటి పోషించే సామత నాకులేదు. మొగుడిని విడిచిన ఆడదాన్ని యింట్లో పెట్టుకొని లోకులచేత అపవాదులు భరించగల సాహసమూ లేదు. మంచోచెడో యింక దానిభారం మీ చేతుల్లోనే వదిలేస్తున్నాను' అని పార్వతి అన్న సుజాతతో చెప్పాడు. ఈమాటలు రక్తసంబంధం కలిగివున్న వాడు అనేమాటలుగా కాన్పించటం లేదు. సుజాత అంటే ఎవరో తెలియకనే చెల్లెలిని గురించి చెబుతూ ఆమెను అంతస్థు ఎక్కించాడు. స్వాభిమానం దెబ్బతింటుందని తలచి అతనిమాటలకు అవును కాదు అని సమాధానం చెప్పలేకపోయింది. పార్వతి జీవితాన్ని తనవైపుకు త్రిప్పుకొనుటకు అసందర్భమైన భ్రమలోపడింది. ఆ భ్రమవలనే తన జీవితాన్ని కనులు విప్పి కాంచలేకపోయింది

సుజాతను ఇంటి ఇల్లాలుగా చెయ్యాలని తల్లిదండ్రులు ప్రయత్నించారు. సాధ్యంకాలేదు. వేదాంతిగా మారిపోయింది. ఆమె బతుకుకు అర్థం తెలియకుండా రచయిత్రి చిత్రించటం సబబుగాలేదు. క్లియోపాట్రా కథ నచ్చకపోయినా పార్వతిని ఆ ప్రపంచంలోకి మార్గం చూపించింది సుజాతయే. ఏమిటీ తెలివితక్కువ పని? పార్వతిలో నూతన చైతన్యం రావాలని కలలుకన్నది. కాని కలలకు సరియైన పరిష్కారం కనుగొనలేక పోయింది. అంతరాలు గ్రహించకుండా అభం శుభం తెలియని ప్రకాశాన్ని అన్యాయం చేసింది. ఆమె సహాయంచేస్తున్నానని భావించి అపకారంచేసింది. ఆమెచదువు ఒక వైపును మాత్రమేచూసి పరిశీలించింది కాని వస్తువుయొక్క పరిపూర్ణ స్వరూపాన్ని పరిశోధింపకపోవటంచేత ఆనందాన్ని పొందలేపోయింది.

'విధివంచితలు' నవల క్రొత్తగా ఉన్నది. ముఖ్యమైన కొన్నిదోషాలు తప్ప తక్కినవి ఫరవాలేదు. పాత్ర చిత్రణలో చాల జాగ్రత్త వహించి ఒక్కొక్కపాత్రకు

జీవం పోశారు. ఆ పాత్రలు సమాజానికి ప్రతిరూపాలుగా పూర్తిగా నిరూపించుకోలేవు. పాత్రల జీవితాలు ఒక మలుపు త్రిప్పారు. ఆశయాలు ఆదర్శాలతో నిండుహృదయాలను ప్రాణం తీశారు. మంచివెనుక చెడుఉన్నట్లు చెడువెనుక మంచిఉన్నదని రచయిత్రి స్పష్టంగా చెప్పటకు వెనుకడుగు వేశారు. అందని ఆదర్శాలు చెప్పినందువల్ల ప్రయోజనం నాస్తి. స్వేచ్ఛావాయువు లంటూ, నాగరికతపేరుచెప్పి జీవితం నాశనంచేసికొనే నారీమణులను శ్రీమతి కామేశ్వరి రహస్యంగా విమర్శించారు. చదువులుండటం మంచిదేకాని సంస్కారంలేని చదువు పార్వతి జీవితంలా ఉంటుందని నిరూపించినందు కందరూ హర్షింపవలసిందే. సుజాత కల్పించిన ఆశవల్ల పార్వతి భగ్నంకావాలను తలంపు రచయిత్రి కుంటే అది ఒకవిధంగా చూస్తే హాస్యాస్పదంగా ఉన్నది. ఒకరినిఒకరు బాధపెడితే దాని ఫలితాలు వెంటనే ఆ వ్యక్తికి తెలుస్తాయిఅన్న సిద్ధాంతంలోని సత్యమెంతో అసత్యమెంతో అనేవి చూడకుండగనే ఒక నిర్ణయానికి రచయిత్రి రావటం విచిత్రంగానే కన్పిస్తున్నది.

కథకు వలయునంత ఆసక్తి ఉన్నది. రఘు డాక్టరయ్యేసరికి కథను కుంచించారు. అతడు డాక్టరవటంతో నవలకథ దరిదాపు 30 సంవత్సరాలు నడిచినదనిపిస్తున్నది. కథను కాలంతో సమన్వయం చేసేటప్పుడు ఎవరైనాసరే జాగ్రత్తపడాలి. లేకపోతే సంవత్సరాలు లెక్కలేకుండా దొర్లిపోతాయి. రఘు డాక్టరయ్యేవరకు తల్లి—తండ్రి ఎవ్వరనే విషయాన్ని గమనించలేదని రచయిత్రి చెప్పటం చాల పొరబాటు. లోకజ్ఞానం తెలిసినవ్యక్తి తండ్రినిగురించి అడగకుండా ఉండలేదు. అయినా ఆ విషయాన్ని చెప్పలేదు. సుజాత చెప్పేవరకూ తనకి విషయాలు పట్టలేదని చెప్పటం రఘు విషయంలో ఆశ్చర్యంగా ఉన్నది. పాత్రలు జీవంఉన్న వ్యక్తులేఅని భావించినపుడు ఇట్టి అభూతకల్పనలు రచయిత్రి చేసి ఉండరు.

—రామమోహన్.

# మళ్లీ రైలు తప్పిపోయింది

(గ్రంథకర్త — గొల్లపూడి మారుతీరావు. ప్రచురణ: యం. శేషాచలం అండ్‌కో: మచిలీపట్నం పే 50 రు 2/—)

అదృష్టం వెంటపడతారు కొందరు. అదృష్టం వెంటపడినా అందుకోలేరు మరికొందరు. ఖరీదైన అదృష్టం వెంటపడినా జార విడిచాడు చంద్రుడు. అదృష్టం వెంటపడి అందుకున్నాడు రంగరాజు. కథ విజయవాడ రైల్వే ప్లాట్‌ఫారంమీద ఒక్కరాత్రి జరిగింది. చంద్రుడు బడిపంతులు కొడుకు. తండ్రి చిన్ననాడే పోయాడు. తల్లి పార్వతమ్మ సంగీత పాఠాలు చెప్పుకుంటూ పన్నెండేళ్లు పెంచింది. ఆర్థికంగా ఇబ్బందులకు లోనైనస్థితిలో ఆవూరి మోతుబరి కాంతయ్యగారమ్మాయి వలజ రాకతో పార్వతమ్మ గండం గట్టెక్కింది. తరువాత కొద్దిరోజులకే చచ్చిపోయింది. వలజకు చంద్రుడంటే అభిమానం. చంద్రునికి వలజమీద ఎంతో గౌరవం. చంద్రునిలో న్యూనతాభావం, వలజలో ఆధిక్యతాభావం జీర్ణించిపోయాయి. పుట్టిపెరిగిన పరిస్థితులు చుట్టూవున్న సాంఘిక వాతావరణం వాళ్ల నావిధంగా కట్టిపడేసినవి. వలజ చదుకోమన్నా, తనను పెళ్లాడమన్నా ససేమిరా ఒప్పుకోలేదు చంద్రుడు. ఆధునిక నాగరికతను ఒంటినిండా పులుముకుని వలజతో అణగివున్న వాంఛల్ని ఉబికించి సినిమా వ్యాపారం నిమిత్తం వచ్చి వలజ మనస్సునే దోచుకున్నాడు రంగరాజు. చంద్రుడు స్వగ్రామం వదలి ఉద్యోగంకోసం విశాఖపట్నంచేరాడు. నరసయ్య కుటుంబంలో భాగస్వామి కావడం, తులసిని వివాహమాడటం జరిగిపోయాయి. నరసయ్యకూతురు రుక్మిణి చదువుకుని ఇస్మాయిల్‌ని ప్రేమించి చివరకు ఆత్మహత్య చేసుకుంది. ఇస్మాయిల్ పెళ్లి చేసుకుందామనుకునేప్పటికి రుక్కు చనిపోయి సంవత్సరమవుతుంది. ఇస్మాయిల్ సహాయంతో చంద్రుడు హైదరాబాద్‌వెళ్లి ఉద్యోగంలో స్థిరపడ్డాడు. కూతురు పుట్టింది. పెళ్లిచేశాడు. భార్య తులసి కాగేపాలు ఒలకబోసుకుని కాళ్ళు పోగొట్టుకుంది. తులసిమీద చంద్రుడు కసిని ప్రదర్శించటానికి కారణం ఆమె కుంటితనం. చంద్రుడు వ్యక్తిత్వంలేని మనిషి. తులసిది పరిపూర్ణమైన వ్యక్తిత్వం. తులసి కాళ్లు బాగుచేయించుదామని రాయవేలూరు బయలుదేరుతూ తోడుగావుండటానికి కూతురికి కబురుచేస్తాడు. ఆమె రాక ఆలస్యమవుతుంది. ఆమెకోసం ప్లాట్‌ఫారంమీద నిరీక్షిస్తున్నాడు. చిననాటి వలజా, రంగరాజులు కని

పిస్తారు. కథ యిక్కడనుంచి ప్రారంభం. గతం వర్తమానం కలగాపులగంగా కథ నడుస్తుంది. చివరికి అల్లుడూ కూతురు వస్తారు. చంద్రునిలో కొత్త ఆనందం. మనవడిలో తన ప్రతిబింబాన్ని చూసుకుని తృప్తిపడతాడు. చీకటి గడచిపోయింది. వెలుగు పొడ చూపింది. ఇంతలో వలజ వెళ్లిన రైలుకు ప్రమాదం జరిగింది. వలజ వీడ్కోలు చెబుతూ 'మళ్లీ రైలు తప్పిపోయింది' అన్నమాట చంద్రుడికి గుర్తుకొచ్చింది.

ఆధునిక నాగరికతకు ప్రతీకలుగా వలజా, రంగరాజులను తీర్చిదిద్దారు. అనేక అనుభవాలు, సంఘ టనలవలన చంద్రుడు వయస్సుకన్నా బాగా ఎదిగాడు.

కథంతా చదివాక మనకిస్తున్న సందేశం ఏమి టని ప్రశ్నించుకుంటే నవల యిచ్చే సమాధానం: ఇరుకైన జీవితంపట్ల అసంతృప్తి, అసహ్యం ప్రద ర్శించక, మనస్సు విశాలపరచుకుని వెలుగును, ఆనం దాన్ని పోగుచేసుకుని, జీవితాన్ని జీవనయోగ్యం చేసు కోటం శ్రేయస్కరం—అని.

పకడ్బందీగా నడిచింది కథ. సరునైనభాష. ప్రతి పాత్ర చిత్రాన్ని స్పష్టమైన ఆకృతిలో చిత్రించారు.

## ఆ క ర్ష ణ

(గ్రంథకర్త : డా. కొమ్మూరి వేణుగోపాల రావు. ప్రచురణకర్త : యం. శేషాచలం అండ్‌కో. మచిలీపట్నం. పే. 128. వెల రు. 2/—)

ఇది నవలకాదు. డాక్టరుకి వృత్తిలో కలిగే అనుభవాలూ జ్ఞాపకాలూ. డైరీలాటిది. ధనసంచయేచ్ఛ కన్నా వృత్తిధర్మం, మానవసేవా ముఖ్యమని గుర్తించు వారు తక్కువవవుతున్నారు వైద్యవృత్తితో మానవాళికి మహోన్నతసేవచేసినఆల్బర్ట్‌స్వైట్జర్,డాక్టరుకాకపోయినా కుష్టురోగి పుళ్లు కడిగి, ఆసుపత్రిలో చేర్పించి రోగుల సేవకై ఒక గంటను వినియోగించుకున్న నిస్స్వార్థ మానవసేవాపరాయణుడు గాంధీవంటి మహనీయులు మరపురారు. డాక్టర్లలో ధనాశాపరులున్నట్టే రోగుల్లో ఫీజు ఎగవేసే వాళ్ళూ వుంటారు. అందుకే కాబోలు యిప్పుడు ముందుగానే కొన్నిచోట్ల అయిదో, పదో ఫీజు కట్టించుకుంటున్నారు.

వైద్యవృత్తిలో వుండే యిబ్బందులూ అర్ధ రాత్రి కేసులూ, ఎదుర్కోవాల్సిన సమస్యలూ అంద మైన ఆడవాళ్ల ఆకర్షణలు, ఆకర్షణల్లో అపస్వ రాలూవంటి రకరకాల విషయాలను రమణీయంగా చిత్రించారు. రచయిత డాక్టరు గావడంవలన అతిసున్నితంగా, సుకుమారంగా వాస్తవికంగా నిక్షేపించారు. డాక్టర్లకు మతిచలించే సంఘటనలూ, ఆడరోగుల బుగ్గమీద చిటికెవేయడం, ముద్దుపెట్టు కోడం, దగ్గరకు లాక్కోడంవంటి విషయాలు మొహ మాటం లేకుండా చెప్పారు.

అందరూ చదవవలసిన పుస్తకం.

—శివకుమార్.

---



Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1, Editor : S. Sambhu Prasad.